# చతుర

సంపుటి : 6 డిశంబర్ 1983 సంచిక 11


## ఈ నెల సమగ్ర నవల

ధైర్యసాహసాలకు మారుపేరుగా దేశంలో లబ్ధప్రతిష్టులయిన సిక్కులు పంజాబ్‌లో వీరావేశంతో పోరాడుతున్నది దేనికోసం? దేశరక్షణకోసం ప్రాణాలర్పించటానికి వెనుదీయని ఆ జాతి తమ రాష్ట్ర విభజనను కోరేస్థితికి ఎలా రాగలిగింది? 'హిందూస్తాన్ హమారా' అంటూ అందుకోసం ఆనాడు బలిదానాలకు వెనుకాడని జాతి ఈనాడు 'ఖలిస్తాన్' నినాదం ఆయుధంగా ఎందుకు బజార్న పడింది? ఎవరు వీరు? ఏమిటి వారి ఆశయం? ఏది వారి లక్ష్యం? ఎలా సాధించదలచారు వాటిని? ఎందుకు నడుపుతున్నారీ....

# ఉద్యమం



సమకాలీన జీవితంలో మన కళ్ళముందే మహెూధృతంగా కొనసాగుతున్న ఈ ఉద్యమాన్ని కళాత్మకంగా పరిచయంచేసే ఉద్వేగ భరిత నవల 'ఉద్యమం'! సుప్రసిద్ధ పంజాబీ రచయిత

## రాజ్‌గిల్

ఉత్కంఠను రేకెత్తించేలా రచించిన 'జో బోలె' నవలకు 'సహవాని' తెనుగు సేత ఈ నెల చతుర సమగ్రనవల 'ఉద్యమం'.

ముఖచిత్రం : యం. కె. రమణమూర్తి
రెండవ కవరు : పి. యం. వరప్రసాదరావ్
మూడవ కవరు : బ్రహ్మదేవ్

# రచయితలకు ఆహ్వానం

వైవిధ్యంగల ఇతివృత్తాలతో, ఆసక్తికరమైన రచనా సంవిధానంగల నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. ప్రచురించే ప్రతి నవలకు రు.1500/-, అత్యుత్తమ నవలకు రు. 2000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర'లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే!

'చతుర'లో బొమ్మలు, ఇతర శీర్షికలుకాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్కన నవల వ్రాత ప్రతిలో మొత్తంమీద 26 వేల పదాలకు తక్కువ కాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో ఒక పేజీలో ఎన్ని పదాలు వచ్చాయనేదానినిబట్టి మొత్తం నవలలోని పదాలను సుమారుగా లెక్క చూసుకోవచ్చును. ప్రస్తుతం వివిధ మాస పత్రికలు ప్రచురిస్తున్న 112 పేజీల నవలలు 'చతుర'లో 70 పేజీలు మాత్రమే అవుతాయి.

* పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలించబడతాయి.
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించ వలసి వచ్చే పక్షంలో అందుకు అభ్యంతరంలేనివారే నవలలను పంపించగలరు.
* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.

**చతుర**

ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ – 500 004.

# చతుర ప్రపంచం

## పుస్తకాల షాపు




రాజకీయ నాయకులు, సినీ నటులకే కాదు పుస్తకాల షాపులక్కూడా ప్రత్యేక మైన గుర్తింపు వుంటుంది. దానికి షాపు యజమానీ, ఆ షాపు ప్రదేశం యొక్క ప్రాధాన్యత కూడా తోడయితే వేరే చెప్పాలా? న్యూఢిల్లీలో పేరొందిన లోడి రోడ్‌లోని ఖాన్ మార్కెట్‌కు చాలా చరిత్ర వుంది. ఈ మార్కెట్‌కు ప్రముఖులయిన విదేశీ రాయబారులు, సీనియర్ మంత్రులు, ప్రభుత్వ కార్యదర్శులు వగైరాలు వస్తుంటారు.

ఈ మార్కెట్‌లో వున్న 88 షాపుల్లోని అన్నిరకాల వస్తువుల ధరలూ చుక్కలనంటుతూ వుంటాయి. మన ప్రస్తుత ప్రధానమంత్రి కోడలు మనేకా గాంధీకి చెందిన 'ది బుక్ షాప్' అనే పేరుగల పుస్తకాల షాపు ఒకటి అక్కడే వుంది. ఈ షాపులో వివిధ అంశాలకు సంబంధించిన 3,000పుస్తకాలువున్నాయి. నవలలు, పిల్లల పుస్తకాలు, వన్యమృగ ప్రాణుల గురించి.... అక్కడ దొరకని పుస్తకమంటూ వుండదు. షాపులోకి ప్రవేశిస్తూనే 'ఓసిబిసి' లేదా 'అబ్బా' సంగీతం శ్రావ్యంగా వినిపిస్తుంటుంది.

మనేకాగాంధీ ఢిల్లీలో వున్నపుడు విధిగా సాయంత్రం మూడు నుంచి ఐదు గంటల వరకు షాపులో వుండి బిజినెస్ వ్యవహారాలు చూస్తుంటుంది. లేటెస్ట్ నవలల్ని గురించిన ప్రచారానికి ఆమె అత్యాధునిక పద్ధతులననుసరిస్తుంటుంది. ఢిల్లీలో లేటెస్ట్ నవలలను నియాన్ లైట్ల ద్వారా అడ్వర్‌టైజ్ చేసే పుస్తకాలషాపు బహుశా మనేకాగాంధీది మాత్రమే.

ఒకప్పటి పేరొందిన మోడల్ మనేకాకు ప్రకటనారంగంలోని సరికొత్త మెలకువలు తెలిసి వుండటంలో ఆశ్చర్యం ఏమీలేదు.

ఈ షాపుకి వచ్చే కష్టమర్లు తక్కువ వాళ్ళేమీకాదు. ప్రముఖ కార్మికనాయకు డయిన జార్జ్ ఫెర్నాండెజ్, ఇందిరా కాంగ్రెస్ మంత్రులు డాక్టర్ యం.యస్. సంజీవరావ్, వీరేంద్రపాటిల్ వంటివారు క్రమం తప్పకుండా ఇక్కడికొచ్చి పుస్తకాలు కొంటుంటారు. ప్రముఖ రచయిత, పాత్రికేయుడు కుష్వంత్ సింగ్ ఎప్పుడూ ఈ షాపుకి వస్తుంటాడు. ఆయన రాగానే నవలల షెల్ఫ్‌కి అతుక్కుపోతాడు. ఓ పుస్తకం అందుకొని అలా నుంచునే నవల చదవటం పూర్తిచేస్తాడట!

మనేకాగాంధి ఈ షాపుకి నెలకు 2500 రూపాయల అద్దె చెల్లిస్తోంది. పుస్తకాల అమ్మకాలను ముగ్గురు అమ్మాయిలు పర్యవేక్షిస్తుంటారు. మనేకా గాంధీ సోదరీమణులు ఈ బిజినెస్‌లో భాగస్తులు. వీరికి ఈ వ్యాపారంలో నెలకి ఇరవైవేల రూపాయల ఆదాయం వస్తుండ వచ్చని అంచనా.

# యుగాంతం

కలియుగంలో అక్రమాలు, అన్యాయాలు, నేరాలు ఎక్కువైపోయి ఆ భారాన్ని భూమాత మోయలేక దేవుడితో మొరపెట్టుకుంటే, పాప భారాన్ని అంతం చేయడానికి జలప్రళయాన్ని సృష్టించి ప్రపంచాన్ని అంతం చేస్తాడని హిందూ పురాణాలు చెపుతాయి. ఈ విషయంలో క్రైస్తవ మతగ్రంథం బైబిల్ కూడా కొన్ని ఉదాహరణలిస్తుంది.

అయితే ఇదివరలో ఓ రెండుసార్లు ప్రళయం వస్తోందోచ్ అని గోలపుట్టడం, ప్రజలు ప్రాణాలరచేత పట్టుకు కూర్చోవడం, తీరా అవికాస్తా తుస్సుమనడం జరిగింది.

1975లో ప్రళయం వచ్చేస్తోంది వచ్చేస్తోందని పత్రికలు ఎడాపెడా ప్రచురించి పారేశాయి. అప్పుడు పిరికి గుండెలవారు బెంబేలెత్తిపోయి ప్రాణాలరచేత పట్టుకుని కూర్చున్నారు. రోగులు చావుకోసం నిరీక్షిస్తూ మందులు తీసుకోవడం మానేశారు. ది.పి. పెరిగిపోయిన భూస్వాములు తమ భూముల్ని కారుచౌకగా అమ్మేసుకున్నారు. తీరా ఈ హడావిడి, భయాలు హంబగ్ అని తేలిపోయింది చివరికి.

ఇలాంటి పరిస్థితే 1979లో స్కైలాబ్ పేరుతో ఏర్పడింది మళ్లీ. స్కైలాబ్ సృష్టించిన కల్లోలం కాద్దోగాపోప్పే ఇంకా



అందరికీ గుర్తుండే వుంటుంది. ఈమధ్య తెనాలిలోని ఎవంగెలిస్ట్ క్రిస్టియన్ అసోసియేషన్ మరో బాంబు పేల్చింది. ఈ సంస్థలో దాదాపు ఎనిమిది లక్షల మంది సభ్యులు వున్నారు. ఈ సంస్థ త్వరలో ప్రపంచం అంతం కాబోతోందని ఆమధ్య జోస్యం చెప్పింది. ఈ వార్తను ఏసుక్రీస్తే స్వయంగా దేవాంశగల ప్రాణుల ద్వారా మాకు తెలిజేశారు. ఇది కంప్యూటర్ యుగం. మనిషి సృష్టించిన కంప్యూటర్ క్రమంగా మనిషి మీద ఆధిపత్యం సంపాదిస్తోంది. ప్రపంచం ఈ ఏడు అక్టోబర్ 5 లేదా 6 తేదీలో నాశనమైపోవచ్చు అని సెలవిచ్చిందీ సంస్థ.

ఈ వార్తకు అమెరికా టి.వి. బాగానే ప్రచారం ఇచ్చింది. ఓ ప్రసిద్ధ రచయిత ఈ అక్టోబర్ ప్రళయం గురించి తన నవలలో ప్రస్తావించాడు కూడా.

ప్రపంచం ఎలా నాశనమతుంది అనేది కూడా అప్పట్లో వీరే సూచించారు. ముందుగా సోవియట్ యూనియన్ ఇజ్రాయిల్ మీద దాడి చేస్తుందట. అప్పుడు ప్రపంచ యుద్ధం మొదలై అటం బాంబుల వలన ప్రపంచమంతా నాశనమవుతుందట. ఇంతకీ అక్టోబర్ 5,6 తేదీలు గడిచిపోయాయి కూడా. మరి ప్రళయం వచ్చే సూచనలు కనుచూపు మేరలో కనుపించటం లేదు గానీ ఆ భయంతో గజగజలాడిపోయినవారు మాత్రం విశ్వవ్యాప్తంగా ఉన్నారు.

# మనీలా

అన్నమో రామచంద్రా అని కొన్ని దేశాలు అలమటించి పోతోంటే మనీలా వంటి మరికొన్ని దేశాల్లో బియ్యాన్ని పశువులకు మేతగా వాడుతున్నారు.మనీలా రేడియో స్టేషన్ నుంచి గత ఏడేళ్ళగా ప్రతి సాయంత్రం తమిళంలో వార్తలు ప్రసారమవుతున్నాయి. ఆమధ్య ఈ తమిళ వార్తలు చదివే మనీలావాసి భారతదేశం వచ్చినపుడు కాకుల్ని చూసి "అబ్బా ... ఎంత నల్లగా అందంగా వున్నాయి" అని పరవశించిపోయాడట.




మనీలాలో కాకులు చాలా అరుదుగా కన్పిస్తాయి. మనీలాలో మరికొన్ని విశేషాలు కూడా వున్నాయి. అక్కడి ధాన్య పరిశోధనా కేంద్రం ప్రపంచ ప్రసిద్ధి చెందినది. అంతర్జాతీయ ఖ్యాతి పొందిన బియ్యం నిపుణులు అక్కడ పనిచేస్తున్నారు. అక్కడ బియ్యం సమృద్ధిగా పండుతాయి. ఆశ్చర్యం ఏమిటంటే చాలా తక్కువమంది బియ్యాన్ని వాడతారు. బియ్యంలో అధిక శాతాన్ని పశువుల మేతకోసం వాడతారు. మనీలా హోటళ్ళలో 'వచ్చేవారం ప్రత్యేకం దక్షిణ భారత వంటకం ఇడ్లీ' అని బోర్డులు పెడతారట. అది చూసిన భారతీయులు లొట్టలేసుకుంటూ హోటల్‌కి పరిగెడతారు. అయితే ప్లేటు ఇడ్లీ ఖరీదు తొమ్మిది రూపాయలు గనక అంత తాహతు లేనివారు ప్రాప్తంలేదనుకొని

**నోటి దుర్వాసన పోగొట్టుకోండి...**
**దంత క్షయాన్ని ఎదుర్కోండి.**




కోల్గేట్ తాలూకు నమ్మకమైన ఫార్ములా మీ నోటి శ్వాస శుభ్రంగా, తాజాగా వుండేలా చేస్తుంది...
మీ పళ్లు ఆరోగ్యంగా, దృఢంగా వుండేలా చేస్తుంది.

**ఎలాగో చూడండి:**



మీ పళ్లలో ఇరుక్కుపోయిన ఆహారపు తునకల్లో దుర్వాసన దంతక్షయం కలిగించే సూక్ష్మజీవులు పెరుగుతాయి.



కోల్గేట్‌లోని అద్వితీయమైన శక్తి గల నురుగు లోతుగా చొచ్చుకుపోయి, హానికరమైన ఆహారపు తునకలనీ, సూక్ష్మజీవులనీ తొలగిస్తుంది.



ఫలితం: ఆత్మవిశ్వాసాన్నిచ్చే తాజా శ్వాస, దంతక్షయం నుంచి రక్షణ, ఆరోగ్యమైన గట్టి పళ్లు.

గుర్తుంచుకోండి, ప్రతిసారీ భోజనం కాగానే కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో పళ్లు బ్రష్ చేసుకోండి. నోటి దుర్వాసన పోగొట్టుకోండి...దంతక్షయాన్ని ఎదుర్కోండి.

**దీని తాజా పిప్పరమెంట్ రుచి మీ కెంతో నచ్చుతుంది!**

GK&E.B82.86 TL

ఊరుకుంటారు.

ఫిలిప్పైన్స్ ప్రజలు ములక్కాయలను పశువుల్ని కొట్టడానికి ఉపయోగిస్తారు. ములక్కాడలు విషపూరితమని వారి నమ్మకం. ములక్కాడలు వేసి కాచిన మన సాంబార్‌ను ఓసారి వాళ్ళకి రుచి చూసిస్తే గాని దాని మహత్యం తెలిసిరాదు వారికి.

# మాయలమారి మొక్కలు

రాజకుమారుడు రాజకుమార్తెను వెతకడానికో, రాక్షసుడి ప్రాణం వున్న చిలకను పట్టుకు రావడానికో ఓ అడవి లోంచి వెళుతుంటాడు. ఇంతలో హఠాత్తుగా రక్షించండి అన్న ఆర్తనాదం వినిపిస్తుంది. కత్తిదూసి ఆవైపుకి పరిగెత్తిన రాజకుమారుడిని ఓ మాయలమారి మొక్క అమాంతం బంధించడం, చివరికి రాజకుమారుడు వీరోచితంగా దాన్నుంచి తప్పించుకోవడం వంటి కథలు చాలా వచ్చాయి. కొన్ని విషయాలు వింటే ఆ కల్పనను మించిన నిజాలున్నాయి సుమా అనిపించక మానదు.

ప్రపంచంలో నర భక్షకులు వున్నట్లే స్వల్పశాతమే అయినా మొక్కల్లో కూడా ఈ తరహావి వున్నాయి. వాటిలో కొన్ని మనదేశంలోనే అస్సాం, బెంగాల్ అడవుల్లో వున్నాయి. మొక్కల్లో 450 రకాలు కేవలం పురుగులు, కీటకాల మీద ఆధారపడి బతుకుతున్నాయి. ఈ మొక్కల ఆకులు, పూలు, పళ్ళు కంటికింపుగా వుండి




పురుగులు, కీటకాలను ఆకర్షించి దగ్గరకు రాగానే గుటకాయస్వాహా చేసేస్తాయి.

ఈ మాంసాహార వృక్షాలకు ఫాస్ఫేట్, నైట్రేట్ వున్న నేల బాగా అనువైనదని తేలింది. వీటి ఉనికి క్రీ.శ. 1760 నాటికే కనుగొనబడింది. ఆఫ్రికా అడవుల్లో కనిపించే కొన్ని రకాల మాంసాహార వృక్షజాతులకి రెండు అడుగులపొడవున్న ముళ్ళలాంటివి వుంటాయి. వీటితో ఆహారాన్ని బంధిస్తుంది. ఈ మొక్కలు మనిషిశరీరం నుంచి అరగంటలో మొత్తం రక్తాన్ని పీల్చివేసి పరలోక యాత్ర చేయిస్తాయి. ఈ రకం చెట్లచుట్టూ మనిషి లేదా జంతువుల ఎముకలు పడివుండటం కనిపిస్తుంది.

'ఫ్లాగ్ ట్రాప్' లేదా 'పిచ్చర్' అనే మొక్కలు అందమైన ఆకులు, పువ్వులు కలిగివుండి పురుగుల్ని, కీటకాల్ని మింగేస్తుంటుంది. సన్‌డ్యూ అనే మరోరకం మొక్క ఆకులు ఒకదాన్నొకటి రాసుకున్నపుడు జానపద కథల్లో వర్ణించినట్లు చిన్నపిల్లలు ఏడ్చిన శబ్దం వస్తుంది. ఈ మొక్క పువ్వులలో లోతైన రంధ్రాలుంటాయి. ఈ పూలు జిగటగా వుండే ద్రవాన్ని విడుదల చేస్తాయి. ఈ ద్రవాన్ని రుచి చూడవచ్చే పురుగులు వెంటనే ఆ ద్రవంలో కరిగిపోతాయి.

'బ్లాడర్ వోర్ట్' అనే నీటి మొక్క కాంతివంతంగా మెరుస్తుంటుంది. ఇవి నీళ్ళలోని చిన్నచిన్న చేపలు, పురుగుల మీద ఆధారపడి బతుకుతుంటాయి. ఈ మొక్క ఉపరితలాన పురుగుల్ని పట్టుకునే కవాటం ఒకటి వుంటుంది. ఒకసారి పురుగు లోపలికి పోయాక మరి బయటికి రావడం అసాధ్యం. ఎందుకంటే మొక్క లోపల కూడా మరో కవాటం వుంటుంది.

మాంసాహారమొక్కల్లోకెల్లా విలక్షణమైనది 'టైగర్ ట్రీ'. ఇది జావా అడవుల్లో కనిపిస్తుంటుంది. ఈ చెట్టుకి 60-70 అడుగుల పరిధిలోకి ఎవరూ అడుగు పెట్టలేరు. కారణం – ఇది వెలువరించే విషపూరితమైన వాయువు పీల్చిన ప్రాణి ఏదీ బతకదు. ఈ చెట్టుపైన గాల్లో తిరిగే పక్షులు కూడా ఈ విషవాయువు కలిసిన గాలి పీల్చగానే చనిపోతుంటాయి. ఈమధ్య ప్రభుత్వం ఈ చెట్ల చుట్టూ రక్షణ కంచెలను నిర్మించింది.

టైగర్ ట్రీతో పోటీపడగల మరో మొక్క 'క్లినిల్'. ఇవి ఎక్కువగా బ్రెజిల్ అడవుల్లో కనిపిస్తుంటాయి. ఈ మొక్కలు వేసవిలో పుష్పించినపుడు ఎవరన్నా చెట్టు కింద నిలబడితే వెంటనే మరణిస్తారు. ఎందుకంటే ఈచెట్టు పుష్పించేటపుడు విషపూరితమైన పౌడర్‌ను వెలువరిస్తుంది. ఈ పౌడర్ గాలికి ఇతర ప్రదేశాలకు వ్యాపించినా ప్రమాదమే.

'ఎడిన' అనేచెట్టు ఆఫ్రికాలో ఎక్కువ. ఇది పొటాషియం సైనేడ్‌లాగా విషపూరితమైనది. ఈ చెట్టు ఆకులు, పువ్వులను తాకడం కూడా ప్రమాదమే. ట్రెమ్స్ రకం మొక్కలు ఎక్కువగా చిత్తడి నేలలో పెరుగుతుంటాయి. ఇవి నిరంతరం పొడుగ్గా, సూదిగా వున్న ముళ్ళవంటి వాటిని విపరీతమైన వేగంతో వెదజల్లుతుంటాయి.

ఇలాంటి చెట్లను సృష్టించి ప్రకృతి నిజంగానే శాస్త్రజ్ఞులను సవాల్ చేసింది. ఇప్పటివరకూ ఈ చెట్ల నిర్మాణం, వీటి జీవన విధానాల గురించి ఎవరూ ఎలాంటి వివరాలు తెలుసుకోలేకపోయారు. కారణం ఈ మొక్కల దగ్గరకు పోవడం అంటే ప్రాణాల మీద ఆశ వదులుకోవడమే. ★




ఆ గదిలో సమావేశమైన బృందంలో పట్టుమని పదిమంది కూడా లేరు. ఓ పాత సీలింగు ఫ్యాను బద్ధకంగా తిరుగుతోంది. గదిలో గాలి ఆడటంలేదు. ఆ ఉక్కకి ప్రతి ఒక్కరూ చెమటలు కక్కుతున్నారు. అయినా వాళ్ళు అదేమీ పట్టించుకునేస్థితిలో లేరు.

గదంతా విషాదం ఆవరించినట్టుగా ఉంది. ఉన్నది పదిమందే అయినా, గది యావత్తు కిక్కిరిసిపోయినట్టుగా ఉంది. అందరూ తలలు వేళ్లాడేసుకుని కూర్చున్నారు. ఆ మధ్యాహ్నం జరిగిన హైజాక్ ప్రయత్నం రసాభాసయిపోయి వాళ్ళ సహచరుడు పోలీసు తుపాకిగుళ్ళకి బలైపోయాడు. దాంతో వాళ్ళకి ఎక్కడలేని నైరాశ్యం ముంచుకొచ్చింది. నిస్పృహతో, నిరాశతో కృంగిపోయారు.

వారందరూ యువకులు, అందమైన వాళ్ళు, ఒక ఆశయానికి నిబద్ధులయిన వాళ్లు. తమ ఆశయంకోసం తనువులర్పించటానికి తయారయి ఉన్నారు. పట్టుబడ్డా ప్రాణాలకోసం దేవిరించేవాళ్లు కాదు. ఓటమికన్నా మరణమే మేలనే దృఢ సంకల్పం వాళ్ళది. అయినా వాళ్ళీరోజు ఓడిపోయినట్లుగా బాధపడుతున్నారు. అయినా తుడిచిపెట్టుకుపోయామనిమాత్రం అనుకోవటంలేదు. ఎన్నో వ్యతిరేక పరిస్థితుల్ని తట్టుకుని ఖాల్సా పోరాడాడు. ఎన్నో ఓటములు చవిచూశాడు. కాని ఓటమికి తలవంచలేదు. అంతిమవిజయం ఖాల్సాదే. అది వాళ్ళందరికీ తెలుసు. అది చరిత్ర సత్యం. దాన్నుంచే తరిగిపోయిన ఉత్సాహాన్ని తిరిగిపుంజుకుని నిరంతరాయంగా పోరాడతారు. అయినా వాళ్లూ మానవమాత్రులే. మానవ సహజమయిన బాధ, దుఃఖం వాళ్ళని కృంగదీశాయి. హైజాక్ చేయబోయిన గ్యాని జగ్తార్ సింగ్‌ని నిర్దాక్షిణ్యంగా కాల్చివెయ్యటం వాళ్ళని కదిలించివేసింది. మనస్సుల్ని గాయపర్చింది. అంతకుముందే జత్తేదార్ మహాబల్ సింగ్ ప్రభుత్వానికిలొంగిపోయాడు. స్నేహితులుకూడా తమకి ద్రోహం చేశారు. ఎందుకిలా జరిగింది? ఇరుకు పర్వతలోయలో భారీ తుపాకి కాల్పుల్లా వాళ్ళ మనసుల్లో పదేపదే ప్రతిధ్వనించే ప్రశ్న ఇదే.

ఆ గది అమృతసర్‌లో షంషీర్ సాహిబ్-గురుద్వారాకి ఓ పక్కన ఉంది. ఆ గురుద్వారా స్వర్ణదేవాలయ సముదాయానికి కొంత ఎడంగా ఉంటుంది. హర్‌మందిర్, తదితర సిక్కుదేవాలయాలంత పెద్దదీ, అద్భుతమైందీ కాకపోయినా దానికి ఒక ప్రత్యేక ప్రాధాన్యం ఉంది. 'స్వర్ణదేవాలయాన్ని సందర్శించటానికొచ్చే భక్తులంతా షంషీర్ సాహిబ్ గురుద్వారాలో అడుగుపెట్టకుండా వెళ్ళరు. మిగతా అన్ని గురుద్వారాలలో వలెగాక ఇక్కడ పంచిపెట్టే తెలుపు, ఎరుపు, నారింజరంగుల్లోని పూలరేకల ప్రసాదాన్ని ప్రాణప్రదంగా తమపర్సుల్లో, ఇనప్పెట్టెల్లో, ఆభరణాల పేటికల్లో దాచుకుంటారు.

స్వర్ణదేవాలయ సముదాయంలోగానీ, ఇంకా ఆ పరిసరాల్లోగానీ ఈ 'బైరాగి గది'లాంటి సురక్షితమైనచోటు మరి లేదు. బందా బైరాగిని అమితంగా ఆరాధించేవాళ్ళుతప్ప ఇతర్లు అంతగా శ్రమపడి వెదగాఉండే ఈ గురుద్వారాని సందర్శించరు. అంచేత ఇది ప్రభుత్వాధికార్ల ముఖ్యంగా పోలీసు అధికార్ల దృష్టికి దూరంగా ఉంది. అందుకే అకాలీదళ్ ఖాల్సా కార్యాచరణ బృందం ఇక్కడే




సమావేశమవుతుంటుంది.

హఠాత్తుగా గదిలో చీకటి కమ్ముకుంటంతో వాలిపోయిన తలలన్నీ పైకిలేచి గుమ్మం కేసి తిరిగాయి. తారె తిపోయి కాదు — ఉత్కంఠ నిండిన నిరీక్షణలో వాళ్ళు తలుపుకేసి తలలు తిప్పారు. గుమ్మంలో స్వచ్ఛమైన ఓ జాట్ యువతి నిలబడి వుంది. భుజాలకు, నడుముకు తోలుపట్టీలు బిగించింది. దోసిట్లో ఆకుదొన్నె పట్టు కుంది.

ఆకుదొన్నెలోని కడా ప్రసాదపు, కమ్మని వాసన గదంతా వ్యాపించింది. ఒక్క-క్షణం వాళ్ళ మనస్సులు తేట పడ్డాయి.

''వాహే గురూజీ కా ఖాల్సా....''

''వాహే గురూజీకి ఫతే'' అందరూ గొంతు కలిపారు.

పరస్పర అభివాదాలు పూర్తికాగానే గదిలో మళ్ళీ విషాద వాతావరణం నిండి పోయింది. రాజసాన్సీ విమానాశ్రయంలో సంప్రదింపులకోసం విమానందిగి అడుగు ముందుకువేసిన గ్యాని జగ్తార్‌సింగుని పోలీసులు నిర్దాక్షిణ్యంగా కాల్చి చంపిన వార్త విన్నప్పట్నుంచి వాళ్ళందరి గుండెల్లో దిగులు గూడుకట్టుకునే ఉంది. ఆమె ప్రసాదం పంచటం ప్రారంభించి నప్పుడు మాత్రం వాళ్ళకి క్షణికమయిన ఊరటకలిగింది. అందరికీ ప్రసాదం పంచేక మిగిలిన బుక్కెడూ ఆమె నోట్లో వేసుకుని వాళ్ళకెదురుగా కూర్చుంది.

"నేను ప్రతిపాదించబోయేదేమంటే.." ఒకరు ఏదో చెప్పబోయారు.

"వద్దు. ఏం చెప్పక్కరలేదు" అతని మాటని మధ్యలో తుంచేస్తూ ఆమె అరి చింది. ఆమె స్వరం గర్జించినట్లుగా మోగింది.

"ప్రతిపాదించేవాడు 'ఆయన'. అంతా ఆయన ఇచ్ఛానుసారం జరుగుతుంది" అంటూ ఆమె కళ్ళు మూసుకుని నిటారుగా కూర్చుంది. "మనమంతా ఆయన కృపని వేడుకునేవాళ్ళం మాత్రమే ఆయన కృప ఉంటే మనం ఆయనపట్ల, ఆయన పంథ్ పట్ల, ఆయన ప్రజపట్ల మనకర్తవ్యాన్ని నెరవేర్చగలుగుతాం"

"నిజం నిజం" అని అరిచారెవరో కాని ఆమె అదేమీ లక్ష్యపెట్టలేదు.

"షహీద్ గ్యాని జగ్తార్‌సింగు కోసం మనమిప్పుడు ప్రార్థన జరపాలి. మన పదవ గురువు గురుగోవింద‌సింగ్ మహ రాజ్ అతణ్ణి తన శాశ్వత సన్నిధిలోకి స్వీకరిస్తాడు"

అందరూ లేచినిలబడి చేతులు జోడిం చారు. గురుగోవింద్‌సింగ్ మూర్తిని మన స్సులో నిలుపుకుని కళ్ళు మూసుకున్నారు. ఆమె నివేదన కార్యక్రమాన్ని పూర్తి చేసింది. కార్యక్రమం పూర్తయిన చాలా సేపటిదాకా ఆమె ముగింపుమాటలు వాళ్ళ చెవుల్లో రింగుమని మారుమోగు తూనే ఉన్నాయి.

"హే భగవాన్, పంథ్ ఆవిష్కర్తా, దీనరక్షకా, నిరాశ్రయులకు ఆశ్రయ దాతా, క్షుధార్తులకు అన్నదాతా, పేదల పెన్నిధీ, అధర్మనిధన ఖడ్గధారీ...నీ దాసుడు గ్యాని జగ్తార్‌సింగ్ నీవనుగ్ర హించిన పంథ్ సేవలో ప్రాణాలర్పిం చాడు. తూటాల ధాటికి అతని ఒళ్ళు తూట్లు పడింది. ధర్మబద్ధమైన పంథ్ ఆశయాన్ని నిలబెట్టటానికి నేలతల్లి అతని నెత్తురు గ్రోలింది. అయినా నీ దాసుడు బాధతోగాని, భయంతోగాని, ఓటమితోగాని విలపించలేదు. ఆఖరిక్షణం దాకా నీ దివ్యనామం నాలుకమీద ఆడిస్తూ

నేలకొరిగిన నిజమైన విశ్వాసపాత్రుడతను. సర్వజ్ఞుడవైన నిన్ను నీ దాసుని ఆత్మార్పణని స్వీకరించమని వేడుకుంటున్నాం. అమరవీరుని ఆర్తిత ప్రసాదించమని ప్రార్థిస్తున్నాం. ఓ మహోదార మూర్తీ...అతణ్ణి అనుగ్రహించు!పంథ్‌ని ఆశీర్వదించు!

ఓ మహానుభావా...నీ దాసులమైన మమ్మ దీవించు! పంథ్ ఆదర్శాన్ని ముందుకు కొనిపోయేశక్తి మాకు ప్రసాదించు! పంథ్ విజయం, కలకాలం వర్ధిల్లజెయ్యి! జో బోలే సో నిహాల్!"

"సత్ శ్రీ అకాల్"

తేలికపడ్డ మనస్సుతో అందరూ నేల మీద చతికిలపడ్డారు. వాళ్ళ మనస్సుల్ని ఆవరించిన నిర్వేదం, నిరాశ, నిస్సత్తువ మటుమాయమయ్యాయి. నిప్పుల్లో దూకటానికి, నిండు ప్రాణాలు బలివ్వటానికి ఆమె ఉత్తర్వుకోసం ఆతురతతో ఉరకలెత్తారు.

"ఓర్పు లేకపోవటం ఒక పాపం" అందామె ప్రశాంతంగా.

వాళ్ళు తమ బలహీనతకి సిగ్గుపడ్డారు. తమ అంతరాంతరాళాల్లోని ఆలోచనలతో, అనుభూతులతో శృతికలిసిన ఒక నాయకురాలుగా ఈ బీబీ ససీబ్ లభించిందన్న గర్వభావం కలగటంతో తప్పు చేశామే అన్న వాళ్ళ ఆవేదన పటాపంచలైంది. ఒక కొత్త ఉత్సాహం వాళ్ళలో ఉరకలువేసింది. ఇక విజయం తమదే అన్న నూతన విశ్వాసం వాళ్ళ మనసులో రేకెత్తింది. వాళ్ళలో ఒకరిద్దరు అంతిమ విజయాన్ని కళ్ళారా చూసే భాగ్యం కలగకుండా ఉండాలని గురువుని మనసులో మౌనంగా ప్రార్థించారు కూడా. వీరోచితంగా మరణించి అమరవీరులు కావాలని వాళ్ళ ఆరాటం. ఆత్మార్పణ ద్వారా అమరవీరులైతేనేతప్ప తమకి దశమ గురువు గురు గోవింద్‌సింగ్ సాయుజ్యం లభించదని వాళ్ళ చింత.

"ఈరోజుకింకేమీ చర్చించేదిలేదు. మన సోదరుడు షహీద్ గ్యానీ జగ్గార్ సింగ్ ఆత్మార్పణని స్మరిద్దాం. అనంతమైన ఓరిమి, ధైర్యం, విజ్ఞతలకోసం ఖాల్సాను సృష్టించిన మన తండ్రికి, మన గురువుకు ఈ రాత్రి ప్రార్థనలు జరుపుదాం. కర్తవ్య నిర్ణయం చెయ్యటానికి మనమెవ్వరం? మనం 'ఆయన' సైనికులం; ఆయన ఆజ్ఞల్ని శిరసావహించే సేవకులం. విధేయులైన సేవకుల మాదిరి ఆయన ఉత్తర్వుల్ని అమలుపరుద్దాం. మీలో ప్రతిఒక్కరికి ఆయన సైగలు అందుతాయి. అవి మీ గుండెల్లో దాచుకోవాలి. అలాకాకుండా ఎవరైతే గురువాజ్ఞని బైటికి వెల్లడి చేస్తారో వాళ్ళు గురుద్రోహం చేసినవాళ్ళ కింద లెక్క. రేపటికి మన కర్తవ్యమేమిటో తెలుస్తుంది. ఇక ఎవరిదోవన వాళ్ళు వెళ్ళిపోదాం. ఎవరికి వాళ్ళం విడివిడిగా హర్‌మందిర్ చేరుకుందాం. ఆయన కృపని, ప్రసాదాన్ని ఇళ్ళకు పట్టుకుపోదాం. ప్రసాదం పట్టుకున్న గురుద్వారానుంచి బైటకొచ్చేవాళ్ళని ఎవ్వరూ అనుమానించరు. పోలీసులు, సి.ఐ.డి.లు కూడా కళ్ళుమూసుకుంటారు.

"రేపు మీలో కొందరు స్కూలు ప్లాకార్డ్లు పట్టుకుని భక్తి గీతాలు పాడుకుంటూ వచ్చే విద్యార్థుల జట్టుకి ముందుండి లోపలికి నడవండి. అప్పుడు మిమ్మల్ని ఎవరూ ఆపరు. మీకు అవసరమైనంత మంది బడిపిల్లలు దొరికే ఏర్పాటు నేను చూస్తాను. రేపు ఉదయం



9 గంటలకు బడిపిల్లలు మీ కోసం హాజరుగా వుంటారు.

"ఇక మిగిలినవాళ్లు నాతోపాటు రావచ్చు. రేపు ఉదయం ఒక కొత్త వధూవరుల జంట హర్‌మందిర్ సాహిబ్‌లో పూజ చేసుకోడానికి వస్తుంది. మనమంతా ఆ జంటని అంటిపెట్టుకుని మందిరంలోకి తీసుకుపోయే పెళ్లివారం. మనమధ్య పరస్పరం తెలిగ్గా సమాచారం అందే ఏర్పాట్లు నేను పూర్తిచేస్తాను. ఇప్పటిదాకా మనం ఏర్పాటు చేసుకున్న రహస్య సంకేతాలన్నీ ఈ క్షణాన రద్దయినట్లే! పూర్వపు సైగల్తో మిమ్మల్నెవరైనా తప్పుదోవపట్టించటానికి ప్రయత్నిస్తే బోల్తా పడకండి. జాగ్రత్త" అందామె.

కొందరు భక్తిభావంతో, మరికొందరు అభిమాన పురస్సరంగా, ఇంకా కొందరు ఆశీర్వాద పూర్వకంగా ఆమెని స్పృశించి సెలవు తీసుకున్నారు. అందరూ ఒకరి తర్వాత ఒకరు నిముషం, అరనిముషం తేడాతో గురుద్వారా నుంచి బైటపడి గుర్బాణీ ఆలాపిస్తూ తలోదిక్కుగా నిష్క్రమించారు. అందరూ వెళ్లిపోయిందాకా ఆమె ఒక్కతే గదిలో నిలబడి పోయింది. తరువాత ఆమె కూడా బైటికి నడిచింది.



"అది మహాఘాతుకం, పచ్చిపిరికితనం.




ఖాల్సా ఉట్టినే ఎవరి ప్రాణాలు తియ్యడు. తన ప్రాణానికి ముప్పురానీ, అమాయకుల ప్రాణాల్ని బలిచెయ్యడు. అలా చెయ్యటం గురుగోవింద్‌సింగ్ మహరాజ్ బోధించిన దానికి విరుద్ధం. అది జరగడానికిపీల్లేదు"

నసీబ్ తన కోపాన్ని ఎంతగా అదిమిపెట్టినా ఆమె తీవ్ర స్వరం బైరాగిగదిలో సమావేశమైన ప్రతిభక్త సభ్యుడికి చురకలా తగిలింది. అకాలీదళ్ ఖాల్సా కార్యాచరణ బృందంలో ఆమె కొత్తగా చేరింది. పైగా ఉపనాయకత్వ పదవికి ఎన్నిక అయింది.

కమాండర్ తన్‌సీమ్ సింగుకి ఈ కొత్త పరిణామం చిరాకెత్తించింది. ఇటువంటి తీవ్రవాదుల బృందంలో ఒక స్త్రీకి చోటు పెట్టటం అతనికి మొదట్నుంచి ఇష్టంలేదు. కాని సంత్ షేర్‌సింగ్ థండర్ మాటని తోసివేసే వీలులేక తలొగ్గవలసి వచ్చింది. ఆ థండర్ నిజంగా పిడుగే. ప్రస్తుతం పంథ్ రక్షకుడాయనే. ఇంతకు పూర్వం ఎన్నడూ కనీవినీ ఎరగని రీతిలో ఆయనపట్ల పెరిగిపోయే ప్రజాదరణ, ఆయన అతివాద ధోరణి, ఆయన పరిశుద్ధ మత ప్రసంగాలు సిక్కు ప్రజాబహుళ్యాన్ని అపరిమితంగా ఆకట్టుకున్నాయి. ఒకనాడు సిక్కుస్థాన్ కోసం, పంజాబీ సుబాకోసం మాస్టర్ తారాసింగ్ ఇచ్చిన పిలుపుకుకూడా ఇంత ప్రజాప్రతిస్పందన రాలేదు. యావత్తు అకాలీదళ్ ఖాల్సా ఉద్యమంకన్నా, అకాలీ ఆందోళన కన్నా ప్రభుత్వం ఎక్కువ గడగడలాడిపోయేది ఈ ఒక్కవ్యక్తి గురించే. కాబట్టే సంత్ మాటంటే సిక్కులందరికీ శిరోధార్యం. అటువంటి సంత్‌కి తను వారసుణ్ణనుకున్నాడు తన్‌సీమ్ సింగు. దానికి అనేక దాఖలాలున్న మాటా నిజమే. సంత్ స్వయంగా అతనికా అభిప్రాయం కలిగిం

చాడు. సంత్‌కి వారసుడు తన్‌సీమ్‌సింగే నని ప్రజలందరికీ తెలుసు. ఈ ప్రభుత్వాన్ని కుప్పకూల్చడంలో తను కృతకృత్యుడైతే తప్పకుండా సంత్‌కు తనే వారసుడవుతాడు. అందులో సందేహం లేదు. బందా బహాదుర్ తరువాత అంతటి వాడు తనే ఔతాడు. మహారాజా రంజిత్ సింగు తన విజయం ముందు వెలాతెలా పోతాడు. అటువంటి తన స్వప్నాన్ని ఒక ఆడపిల్ల ధ్వంసం చెయ్యటానికి తను అవకాశమివ్వడు. ఆమె విషయంలో తను ఏదో ఒకటి చేసెయ్యాలి.

"మనం ఒకటి చేద్దాం. మనం అనుకున్నదాన్ని ఒకేదెబ్బతో సాధించే బ్రహ్మాండమైన పనేదైనా చేద్దాం. అంతే గాని, దెబ్బతీసి పారిపోయే ఈ చాటుమాటు వ్యవహారం ఖాల్సా ధర్మానికే విరుద్ధం" అంది ఆమె.

"అదే జనానికి, ప్రభుత్వానికి బెదురు పుట్టించిందని గుర్తుపెట్టుకో" అన్నాడు తన్‌సీమ్ సింగ్.

"బెదురేగాని భయం కాదు" అందామె వెటకారంగా.

"భయంకూడా. ఏరోజు ఎవరి కంఠం మీద కత్తి దిగుతుందో తెలీక అందరూ భయంతో గడగడలాడుతున్నారు. ముఖ్యంగా పంజాబ్ మంత్రులు, సీనియర్ అధికార్లు"

"ఎన్నాళ్లు? మనకి తెలీకుండానే మనల్ని కాల్చి పేల్చిపారేసే ఒక బలమైన కార్యక్రమం వాళ్లుకూడా నిర్ణయించుకునే వరకేగా"

"ఆ పరిస్థితి ఎదురైతే మనమూ ఎదుర్కుంటాం" అన్నాడు తన్‌సీమ్ సింగు ఆమె వాదనని కొట్టిపారేస్తూ.

"సరే. జతేదార్ మహాబత్ సింగు చేసిన పిరికిపనిని ఇప్పుడు మనం ఎదుర్కోవాలి"

తన్‌సీమ్‌సింగు కేవలం ప్రేక్షకునిలా కూర్చుండిపోయాడు.

"అతనెప్పుడు భయంతో తనకి తెలిసిందంతా బైటికి కక్కేస్తాడు. కాదంటావా? అప్పుడు మీకే గతిపడుతుంది?, మీ ఆశయం ఏమవుతుంది? మీ పంథ్‌కి ఎంత చెరుపు కలుగుతుంది?"

"అతనలా చెయ్యడు. అతను అమృతధారీ సిక్కు. అకాల్‌తఖ్త్ ముందు అతను ప్రమాణం చేశాడు"

"అయినా అతను కేవలం ఒక మానవమాత్రుడు"

"ఔను. అతను మానవమాత్రుడు. అయితే ఈ మానవమాత్రులే తమని ఖండఖండాలుగా చీల్చినా, కీళ్లు విరిచేసినా, పండ్ల చక్రాలమధ్య బిగించినా, కాలేకాలే పలకలమీద బలవంతంగా కుదేసినా బాధతో మూలగలేదు, ఏడవలేదు, శోకాలు తియ్యలేదు, కనీసం కంటతడి పెట్టలేదు. తమకళ్లముందే తమ పసిబిడ్డల పొట్టచీల్చి ఇంకా సన్నగా కొట్టుకునే గుండెని, కాలేయాన్ని నోళ్లలో కుక్కినా ఈ మానవమాత్రులు కిక్కురుమనకుండా సహించారు. అమృతధారీ శిక్కు అంటే అలాంటివాడు చెల్లాయ్! అతను కేవలం మానవమాత్రుడు కాకపోవటమేకాదు; అతను ఈ ప్రపంచపు బాధకి, ఆనందానికి అతీతుడు; మానవమాత్రుల మానసిక, శారీరక బాధలకు అతీతుడు"

"అయినా అతను లొంగిపోయాడు. అతని మొదటి తప్పిదం ఇది; బహుశా చివరి తప్పిదం కూడానేమో! మన ధర్మం యొక్క అగ్నిపరీక్ష మరణం భయ్యా! ప్రాణంకాదు; ప్రాణంమీద తీపికాదు;



ఆస్తిమీద మమకారం కాదు. అది బలి దానం....సంపూర్ణమైన ఆత్మ బలిదానం"

"ఈ చర్చ నిష్ప్రయోజనం" అన్నాడు తన్‌సీమ్ సింగ్ విషయం దాటవేస్తూ. ఈ గోరంత విషయాన్ని కొండంత చెయ్యనీకుండా ఆమెని ఎలా ఆపాలా అనే దానిమీద అతని మనస్సు పూర్తిగా లగ్నమైంది.

"అతను మన ఆశయానికి మోసం చేసినమాట వాస్తవమే. అంచేత ఇప్పుడు మనం మన ఎత్తుగడల్ని మార్చుకోవాలి. అతనివల్ల మన దళానికి మాత్రం చెడుపు జరగదు. ఎందుకంటారా? మన దళం గురించి అతనికేమీ తెలీదు. అతణ్ణి ఎరుగున్నది నేను. నా ఒక్కడి పేరూ బైటికి రావచ్చు. అంతకుమించి జరిగేదేమీ ఉండదు" అన్నాడు తన్‌సీమ్‌సింగ్.

ఆ మాటతో అందరూ తేలిగ్గా ఊపిరి

పిల్చుకున్నారు. అతను దళసభ్యుడు కాడు, కేవలం కిరాయి కార్యకర్త అని తెలియగానే వాళ్ల గుండెలమీది పెద్ద బరువు దిగిపోయినట్లుగా అనిపించింది.

"మొదట వాగ్దానం చేసిన మేరకి మన పాకిస్తాన్ మిత్రులు ఎందుకు మద్దతు ఇవ్వటం లేదా అని నాకు ఆందోళనగా



వుంది. అమెరికా, కెనడాల్లో ఉండే మన నాయకులు హఠాత్తుగా ఎందుకు మూగనోము పట్టారు? విదేశ నిపుణుల్ని ఆయుధాల్ని పంపిస్తామని మాట ఇచ్చినవాళ్లే ఎందుకు మాటతప్పారు?" ఒక్క క్షణం చెప్పటం ఆగి మళ్లీ కొనసాగించాడు.

"వాళ్ల సహాయం అందకుండా మన పథకాన్ని ఆచరణలో పెట్టలేం. నిజం చెప్పాలంటే వాళ్ల అండ లేకుండా మనం కొనసాగలేం"

"అంటే అనక తెరలో ఇరుక్కుపోయామన్నమాట!" అంది నసీబ్ ప్రశాంతంగా.

అందరూ ఆమెకేసి తీవ్రంగాచూశారు. తన్‌సీమ్ సింగ్ కూడా ఆమెకేసి తీవ్రంగా చూశాడు. ఆమె కంఠంలో ధ్వనించిన తిరస్కారం అందరికీ బోధపడింది. బైటివాళ్ల అండదండల మీద పూర్తిగా ఆధారపడిన ఒక దళనాయకుడి అంతర్గత బలహీనతని ఎత్తిచూపుతున్నట్లుగా ఆమె స్వరంలో ద్యోతకమైంది. పైపెచ్చు, కార్యాచరణ దళానికి తెలియపర్చకుండా వేరేకార్యక్రమానికి పూనుకున్న ఒక నాయకుని అవిజ్ఞత పట్ల నిరసన ఆమె మాట తీరులో వెల్లడయింది.

"ఎక్కడా మనం ఇరుక్కుపోలేదు. దళ్ ఖాల్సా ముందుకు సాగిపోవటం ఆగదు కాని... కాని మిత్రులనుకున్న వాళ్లంతా ఎందుకు, ఎందుకిలా మాట తప్పారో మనందరికీ తెలుసుకోవాలనుంది" అతని మాటల్లో ఆత్మవిశ్వాసం లోపించింది.

"మనకి మిత్రులుగా ఉండాలని వాళ్లకెవ్వరికీ లేదుగనక"

"అంటే మీ ఉద్దేశం?"

"నా ఉద్దేశమేదైనా అదంత ముఖ్యం కాదు. నేనిప్పటిదాకా చెప్పింది, సదా చెప్పేదీ, పట్టు పట్టేదీ మనం మనసొంత బలాన్ని, సొంతవనరుల్ని సమీకరించుకోవాలనే. మన అదుపులో ఉండని సాధనాలమీద మనం ఆధారపడకూడదు. ఇతర్లమీద ఆధారపడ్డవాడు సదా నిరాధారుడే"

"మనకి అందరి సహాయం, సహకారం, డబ్బు, ఆయుధాలు, అంతర్జాతీయ ప్రచారం అన్నీ అవసరమే" అన్నాడు తన్‌సీమ్ సింగ్ తీవ్రంగా.

"మన పదవ గురువు మొగలాయీలకి వ్యతిరేకంగా కత్తి కట్టినప్పుడున్నంతటి ఘోర పరిస్థితిలో మనమిప్పుడు లేం. ఆనాడు ఆయనకి సాధనసంపత్తిలేదు. చాలినంత సైనిక శక్తిలేదు. అయినా ఆయన ఎవరో వస్తారని, ఏదో చేస్తారని ఎదురుతెన్నులు చూస్తూ కూర్చోలేదు"

"ఆయన గురు మహరాజని మర్చిపోవద్దు. ఆయన ఇచ్చేవాడే తప్ప పుచ్చుకునేవాడు కాదు"

"అలాంటప్పుడు మీకేం కావాలో ఇవ్వమని ఆయనని ప్రార్థించి ఉండాల్సింది గానీ ఇతర్ల సహాయం కోసం అర్రులు చాచాల్సినపనేముంది?పాలస్తీనా విమోచన సంస్థకి పట్టినగతి మీకు తెలియదా? అరబ్బులు తమ మద్దతుని ఉపసంహరించుకున్న మరుక్షణం యూదులు వాళ్ళమీద పడినమిలిపారేశారుగదా!"

"కాలం మారుతుంది చెల్లాయ్! 'ఆయన' రహస్యాలు, విన్యాసాలు తెలుసుకోగల వాళ్ళెవరు? మన గురు మహరాజ్ కాలంనాటి పరిస్థితులు వేరు. ఆ పరిస్థితులు వ్యక్తిగతమయిన సాహస కార్యాచరణకి ఎక్కువ అనుకూలించాయి. రవాణా, సమాచార ప్రసార సాధనాలూ,




అత్యాధునిక ఆయుధాలూ అపరిమితంగా అభివృద్ధయిన మనకాలంలో, అనేక మందితోకూడిన సంయుక్త, సమన్వయ కృషి అవసరం. రోజులు మారాయి."

"అవును భయ్యా, రోజులు మారాయి. కాని ఆత్మశక్తి మారదు. ఆశయ నిబద్ధత మారదు. విశ్వాసం, ఆత్మశక్తి, ఆశయ నిబద్ధత లెక్కకొస్తాయిగాని భౌతిక వస్తువులు కాదు. మన గురువు అయిదుగురి తలలు బలివ్వమని కోరింది ఆ ఒక్కసారికేకాదు. ఆ పిలుపు నిత్యమయింది, నిరంతరమైంది. అది అన్ని కాలాలలోనూ వినగోరినవారందరికీ వర్తిస్తుంది. ఆ పిలుపు విన్నవాళ్ళకి జీవితం కత్తి ఒరకి మించిన అర్థవంతమయిన పదార్థం కాదు. ఒక్కసారి కత్తి బయటికిలాగాక ఒర ఎందుకూ కొరగాని వస్తువే!"

బైరాగి గదిలో సమావేశమైన అందరి హృదయాల్లో ఒక నూతన చైతన్యం పెల్లుబికింది. ఆఖరికి, బద్ధకంగా తిరిగే పాత పంఖా సైతం స్పందించుకుంది. రెండు నిముషాలసేపు వాళ్ళంతా పునరుత్తేజపు పొంగులో మౌనంగా కూర్చుండిపోయారు.

"ఇకముందు మన సొంతబలంమీద నిలబడి మన కార్యక్రమం నడుపుదాం. మన షరతులకి లోబడి మనకి సహాయపడ్డానికి ముందుకొచ్చేవాళ్ళకి మనం స్వాగతం చెపుతాం. కాని బయటి సహాయాన్ని నమ్ముకుని మనం మన కార్యక్రమాలు నిర్ణయించేది లేదు. మనం మన ఎత్తుగడలు మార్చుకోవాలి. మనం పోగొట్టుకున్న ప్రతిష్టని తిరిగి సాధించగలిగే ఒక బ్రహ్మాండమైన పనిచెయ్యాల్సిన అవసరం ఉంది. అర్థంలేని వెధవ హైజాకింగ్ వ్యవహారం మానుకోవాలి. దానివల్ల మంచి జరక్కపోగా చెడ్డపేరు మాత్రం వచ్చింది" అంది నసీబ్ నిష్కర్షగా.

"నసీబ్ అభిప్రాయంతో నేను ఏకీభవించను" అన్నాడు భాయ్ మహీప్ తన కుడి చెయ్యి బిగించి మోకాలిమీద గుద్దుకుంటూ. "హైజాక్ సంఘటనలు మనకి పేరు, ప్రచారం తెచ్చిపెట్టాయి. నిరాయుధంగా విమానాల్ని దారిమళ్ళించిన మనల్ని అందరూ మెచ్చుకున్నారు. నిజమైన ఖాల్సా వీరుడికే అటువంటి సాహసం చెయ్యటం చాతనవుతుంది. మనమంటే ప్రజలకి, ప్రభుత్వానికి భీతి పుట్టింది. ప్రభుత్వం మనతో ఒక అంగీకారానికి రావాలని ప్రజలు కోర్తున్నారు. ప్రభుత్వం తక్షణం మన డిమాండ్లని ఆమోదించక తప్పదనే మానసిక వాతావరణం మన హైజాక్ కార్యక్రమాలవల్ల ఏర్పడింది"

"ఔను. వట్టిచేతులతో అటువంటి అసాధ్యమయిన అద్భుతాన్ని సాధించిన మన సింహాల్ని చూసి మనం గర్వపడాలి" తన్‌సీమ్‌సింగ్ వంతపాడాడు.

"ఒక చిరుచీమకూడా ఏనుగుని చెండాడగలుగుతుంది. దాన్ని వీరకృత్యంగా ఎవరూ వర్ణించరు" అంది నసీబ్.

"హైజాక్ కార్యక్రమాన్ని కొనసాగించాలనేది నా ప్రతిపాదన" అన్నాడు తన్‌సీమ్‌సింగ్.

"అలాంటప్పుడు మనం విడిపోదాం. మీ కార్యక్రమాన్ని మీరు కొనసాగించండి. మేం మావంతు వచ్చేదాకా ఆగుతాం. మన పదవ గురువు గురుగోవింద్ సింగ్ మహరాజ్ నడిపించినట్లుగా నడుస్తాం"

తన సవాలుకు ప్రతిఘటన ఎదురు

తుంపని ఆమె ఆగింది. ఎవరూ ఏమీ మాట్లాడలేదు. గదిలో నిశ్శబ్దం తాండవించింది. చీలిపోవాలనే నిర్ణయం చాలా హఠాత్పరిణామం; ఒక విద్యుద్ఘాతం. ఎవ్వరూ ఊహించనటువంటిది. ఆమెపైన నమ్మకం పెట్టుకున్న ఆమె మద్దతుదారులు సైతం ఈ మాటతో విత్తరపోయారు. ఉద్యమం ఇంకా శైశవదశలో ఉంది. ఇప్పటివరకూ సాధించింది శూన్యం. ఈ పరిస్థితిలో చీలిక అంటే ఆ దళం దిమ్మరపోవటంలో ఆశ్చర్యం లేదు.

"ఇప్పుడేకాదు నసీబ్" అన్నాడు



తస్లీమ్ సింగ్ తీవ్రంగా. సమావేశం నుంచి వెళ్ళిపోవాలని లేచిన నసీబ్ మళ్ళీ కూర్చుండిపోయింది. ఆమెతో లేవబోయిన మద్దతుదారులిద్దరు మాటు మాటాడకుండా మౌనంగాకూర్చుండిపోయారు. వాళ్ళకింకా తస్లీమ్ సింగేనాయకుడు. అతనిపిడికిళ్ళు బిగిశాయి. కోపంతీవరించింది. సంత్ ఖండర్ అంతటివాడు ఆమోదించిన తన నాయకత్వానికి సవాలు ఎదురైంది. అందునా ఓ పల్లెటూరి పిల్లనుంచి. ఆమెని దళం నుంచి తొలగించటానికి ఏదో ఒకటి చెయ్యాలి. కాదు—విరగడ చేసుకోవాలి. మనస్సులో మౌన ప్రతిజ్ఞ తీసుకున్నాడు.

అతని సమ్మోహనశక్తి అమోఘం. పిడికిలిమీద దేగని ప్రదర్శిస్తున్నట్లుగా ఎడమ చెయ్యి పైకెత్తాడు. ఆ చేతికి తొడు

క్కున్న డేగ చర్మపు తోలు తొడుగుని ఘరానాగా ప్రదర్శించాడు.

"ఈ చేతిమీద డేగ లేదు. కాని నా దైవం, దశమ గురువు నాయీ పిడికిలి మీద డేగని కూర్చోబెట్టుకోమని కోర్తు న్నాడు. అడవిచుట్టూ ఎగుర్తూ గిరికీలు కొట్టే మామూలు డేగజాతి పక్షిని కూర్చోబెట్టుకోమనికాదు. ఆయన ఖాల్సాని సృష్టించినప్పుడు ఈ ప్రపంచం కనీవినీ ఎరుగని డేగలుగా మనల్ని రూపొందిం చాడు ఆయన. ప్రియ సోదరీ సోదరు లారా..శ్రద్ధగా వినండి. మన దైవం తళ తళ మెరిసే ఒక తెల్లని డేగని ధరించి నీల తురగంమీద స్వారీచేశాడు. దాని ఈకల కాంతిముందు శతకోటి సూర్య ప్రభలు చిన్నబోయాయి. ఆయన నన్ను పంథ్ విజయ విహంగాన్ని ప్రదర్శించ మంటున్నాడు. విముక్త, స్వతంత్ర పంథ్ విజయాన్ని సాధించమంటున్నాడు. సిక్కు సంగత్ నాకివ్వగలిగింది ఆ విజయ విహంగాన్నే అంటున్నాడు. కాబట్టి నేను నా దైవం, దశమగురువు, భగవానుడు, ఖడ్గకేతు, విశ్వాధినాథుడి సేవలో కొనసాగేందుకు మీరు మన ఈ సిక్కుసంగత్ నాకా విజయవిహంగాన్ని ప్రసాదిస్తారా?"

సిక్కు సంగత్ అతని కోర్కెని మన్నించింది. సిక్కు సంగత్ సమ్మతి ప్రకటించగానే జయజయధ్వానాలతో గది మారుమోగిపోయింది. సంగత్‌గా వ్యవహ రించబడే ఆ సిక్కు బృందం ఆక్షణంలో కీర్తనలు గానంచేస్తూ మృత్యు గర్భంలోకి నిర్భయంగా నడవటానికి తయారుగా ఉంది. సంత్ మత గాథావేశం వాళ్ళని మహోత్సాహతరంగాల మీద తేలియాడిం చింది. వాళ్ళంతా తాత్కాలికంగా బాధకి, లేమికి, ఆకలికి, దప్పికకి అతీతమైన స్థితిలోకి వెళ్ళిపోయారు. ఆ ఆధ్యాత్మికపు కైపులో వాళ్లు గృహస్థులుగా, కుటుం బానికి కూడూ గుడ్డా సంపాయించి పెట్టే వాళ్ళుగా, సంతానం కన్న తండ్రులుగా, సమాజంలో సభ్యులుగా తమ విధులు, బాధ్యతలు, కర్తవ్యాల తాలూకు స్పృహనే కోల్పోయారు. పంథ్‌కోసం ప్రాణా లర్పించి అమరవీరులైపోయి గురుదేవులలో ఐక్యమైపోయే ఏకాగ్రతలోకి దిగి పోయారు.

తన్‌సీమ్‌సింగ్ సభ్యుల దృష్టి తన వేపు తిప్పుకోటానికి ఖంగుమని దగ్గాడు.

"ఈ ఒక్క హైజాక్ ప్రయత్నం చేద్దాం. దానివల్ల మేలుకలిగితే అదే కార్య క్రమం కొనసాగిద్దాం. విఫలమైతే ఆ కార్యక్రమం విరమించుకుని నాయ కత్వాన్ని నసీబ్‌కు అప్పగిద్దాం" అన్నాడు తన్‌సీమ్‌సింగ్. నసీబ్ ఆ సుదినం రాబోదనే ధీమాతో –

"పంథ్ లక్ష్యంకోసం సరేఅంటున్నా. కాని పాకిస్థాన్ సహకరించని పక్షంలో ఎలా నెగ్గుకురావాలని అనుకుంటున్నారు మీరు?" అనడిగింది నసీబ్ నెమ్మదిగా.

"విమానాన్ని గాల్లో పేల్చేస్తాం"

"అంటే స్త్రీలు, పిల్లలతోసహా వంద పైచిలుకు ప్రయాణీకుల్ని చంపేస్తారా?"

"ప్రేమలోనూ, యుద్ధంలోనూ ప్రతిదీ సక్రమమే"

"అని మన పదవ గురువు చెప్పలేదు. గురుగోవింద్‌సింగ్ మహరాజ్, సత్‌నామ్, శ్రీవాహేగురూ"

ఒక్క తన్‌సీమ్‌సింగ్ తప్ప అందరూ ఇంచుకు ప్రతిస్పందించారు. వారి నినా దాలతో గది ప్రతిధ్వనించింది.

"మన మత ధర్మానికి, న్యాయానికి





అధినాథుడైన మన గురువు ఒక మహిళని అవమానపర్చడాన్ని, ఒక తల్లి మనసుని నొప్పించడాన్ని, ఒక బిడ్డని హతమార్చ డాన్ని, లూటీని, గృహదహనాల్ని, ఆస్తి విధ్వంసాన్ని,పంటచేలని నేలమట్టం చెయ్య డాన్ని తీవ్రంగా నిరసించాడు. ఖాల్సాకు ఉన్న ఒక మహాద్భుతమైన, అజేయమైన, అభేద్యమైన ఆయుధం 'దాక్షిణ్యం' అని మర్చిపోకండి.యుద్ధరంగంలో ముస్లిం క్షత గాత్రులకు నీళ్లందించాడనే ఫిర్యాదుకు గురయిన కన్నయ్యని గురుగోవిందసింగ్ ఎందుకు ఆశీర్వదించాడో ఆలోచించండి"

"ఇంతకీ సోదరి నసీబ్ ఉద్దేశమేమిటో అంతుబట్టటంలేదు. యాక్షన్ గ్రూపుని రద్దుచెయ్యమనా లేక దళ్ ఖాల్సానా? అదీగాక ప్రభుత్వానికి లొంగిపోమనా? మన పదవగురువు నలుగురి అమాయక బిడ్డల వీరరక్తంతో ఎదిగిన ఖాల్సా మరణ శాసనంపై చేవ్రాలు పెట్టమనా? వాహేగురూ, వాహేగురూ."

సభ్యులంతా తస్నీమ్‌సింగ్‌తో గొంతు కలిపి 'వాహేగురూ' అనరిచారు. తరు వాత కొద్దినిమిషాలు సందిగ్ధభరితమైన నిశ్శబ్దం రాజ్యంచేసింది. అందరూ కనులు మూసి,తలలువంచి ప్రార్థనలో నిమగ్నమై పోయారు.

"మన ఆశయం నెరవేరేదాకా మనం అనుకున్నప్రకారం మన కార్యక్రమాన్ని కొనసాగిద్దాం! కాకపోతే పంథ్‌కోసరం తృణప్రాయమైన ఈ ప్రాణాలుఅర్పిద్దాం" అన్నాడు తస్నీమ్‌సింగ్. వాళ్ల హృద యాల్లో తను రగిలించిన అత్మగ్లానిని అడ్డంపెట్టుకుని తనమాటకు తిరుగు లేకుండా చేసుకుందామని అతని ప్రయత్నం. వాళ్లంతా పరిపూర్ణ వినమ్ర భావనలో మునిగిపోయివున్న క్షణం అది. ఏదిచెప్పినా కాదని ఎదురాడేశక్తి నశించి ఉన్న సమయం అది. తస్నీమ్‌సింగ్ వాళ్లని ఆస్థితికితెచ్చాడు. కాని నసీబ్ దీన్ని కూడా తిప్పికొట్టగలదని అతను ఊహించ లేదు.

"వీల్లేదు" అంది నసీబ్ అధికార స్వరంతో. "మన సోదరుడు కోరిన ప్రకారం ఇంకొక్క అవకాశం మాత్రమే తీసుకుందాం. దాని జయాపజయాల్నిబట్టి మన భావికర్తవ్యం నిర్ణయించుకుందాం. నిర్ధారణ అయిందేదో అయింది. ఇహ వెనకడుగువేసే ప్రసక్తేలేదు. దెబ్బదించే మీరు దిగిపోండి. నెగ్గారా సరే గుడ్డిగా మీవెంట నడుస్తాం"

"నేను ఓడిపోతే ఎవరు నాయకత్వం తీసుకుంటారు?" అనడిగాడు తస్నీమ్‌సింగ్.

"అది దళంనిర్ణయిస్తుంది" అంది నసీబ్ వినమ్రంగా.

"మీరంతా ఏమంటారు ఖాల్సాజీ?" అనడిగాడు తస్నీమ్ మిగతాసభ్యుల్ని ఉద్దేశించి.

"మీ తరువాత ఉన్నవ్యక్తి నాయ కత్వం వహిస్తాడు. ఇందులో విశేషమే ముంది?" అన్నాడు భాయ్ మహిప్‌సింగ్. అతనిమాటతో ఏకీభవిస్తూ గుసగుసలు వినిపించాయి.

"ఎవరా వ్యక్తి?"

"బీబీ నసీబ్‌ని రెండవకమాండర్‌గా మీరే ఎన్నుకున్నారుగదా తస్నీమ్‌సింగ్" సార్జెంట్ మేజర్ ఖడక్‌సింగ్ గొంతు ఖాకాలా మోగింది.

"అదికాదు. మీ అందరికీ స్పష్టంగా బోధపడిందీలేందీ తెలుసుకుందామని అడి గాను" అని తెలివిగా మాటమార్చాడు తస్నీమ్. మరుసటి హైజాక్‌ప్రయత్నానికి ముందే ఆమెనెలాగైనా వదిలించుకోవా

లనేది అతని ఆలోచన. అది ఒకటిరెండు రోజుల్లో తేలిపోవాలి. ఈరోజు రాత్రే ఆమెని ఏరివేసే పథకం నిర్ణయించాలి. ఏటు వెయ్యటంలో కాకలుదీరిన "హిట్ గ్రూపు"కు ఇది కష్టంకాదు. ఆ గ్రూపు



ఉనికే పరమ రహస్యం.

ఇక ఆ చర్చకి పరిసమాప్తిగా "బోలో సోనిహాల్" అని నినాదమిచ్చాడు ఖడక్ సింగ్.

"సత్ శ్రీ అకాల్" అని జవాబిచ్చారు మిగిలినవాళ్లు.

"తస్లీమ్‌సింగ్! మీ సమాధానం?" అనడిగాడు ఖడక్‌సింగ్ కరుగ్గా.

తస్లీమ్ అతనికేసి, నసీబ్‌కు మద్దతుదార్లని తను అనుకుంటున్న వాళ్లకేసి దీర్ఘంగా చూశాడు. నిర్దాక్షిణ్యంగా వాళ్లలో ప్రతిఒక్కడిమీదా ప్రతీకారం తీర్చుకోడానికి మనస్సులో ప్రతిజ్ఞ తీసుకున్నాడు. సమాధానం చెప్పకుండా తస్లీమ్ చివాల్న లేచి బైటికి వెళ్లిపోయాడు. నసీబ్ లేచి అతని స్థానంలో కూర్చుంది.

"ధ్యానం చేసుకోడానికి పావుగంట వ్యవధివ్వండి. పావుగంట తరువాత దయచేసి మీరంతా రండి" అంది నసీబ్ సవినయంగా.

అంతా లేచి బైటికి నడిచారు. గది ఖాళీ అయింది. నసీబ్ లేచి నిలబడి స్వర్ణ

దేవాలయానికి అభిముఖంగా తిరిగి అంతరాంతరాళాలలోంచి పరమ నిష్ఠతో ప్రార్థన ప్రారంభించింది. ప్రార్థనా శ్లోకంలోని ప్రతిఒక్క అక్షరానికి ఆమె ఆత్మ లయాత్మకంగా కొట్టుకుంది. ధైర్యం, మార్గనిర్దేశం, విజ్ఞత ప్రసాదించమని ఆమె ప్రార్థించింది. ఖాల్సా విజయం కోసం, పంథ్ ఉజ్వలస్థితి కోసం, మానవ కోటి సుఖసంతోషాలకోసం, విశ్వశాంతి కోసం ఆమె ప్రార్థనచేసింది.

హఠాత్తుగా మెరుపు మెరిసినట్లనిపించింది. ఆ క్షణికమైన మెరుపులో నీలతురంగమెక్కి, ఎడమ హస్తకవచం మీద తెల్లని డేగని ప్రదర్శిస్తూ గురు గోవింద్ సింగ్ దర్శనమిచ్చినట్లుగా తోచింది. తనకదిచాలు. తనకి గురుసైగ అందింది. కర్తవ్యం పరిపూర్తి చెయ్యాలి. "ఓ కృపాణమూర్తీ, నా భగవాన్... ధన్యోస్మి! గురుగోవింద్‌సింగ్ మహరాజ్ ధన్యోస్మి!" నసీబ్ చెక్కిళ్లమీద కన్నీరు ధారకట్టింది.

ఆమె ఇంకా కళ్లు మూసుకునే ఉంది. గురుసాక్షాత్కారదృశ్యం చెదిరిపోతుందనే భయంతో ఆమె కళ్లు తెరవలేదు. ఆ దృశ్యం తన మనోఫలకం మీద శాశ్వతంగా హత్తుకుపోవాలి. వెంటవే ఆమె అన్ని ఆలోచనల్నీ కట్టిపెట్టి మనస్సుని నిర్వికారంగా, శూన్యంగా ఉంచి సమాధిలోకి వెళ్లిపోయింది. సమాధి స్థితినుంచి ఆమె బైటపడ్డ తరవాత ఆమె మనస్సు పునర్వికాసంతో, పునఃతేజంతో నిండిపోయింది.

వాచీ చూసుకుంది. ఆమె ధ్యానాన్ని ప్రారంభించి ముప్పావుగంట దాటింది. వేళ సభ్యులంతా పావుగంట కాగానే రావాల్సింది. ఆమె ఆశ్చర్యపడింది. బహుశా తను సమాధిస్థితిలో వుండటం చూసి వాళ్లు వెనుతిరిగి వెళ్లిపోయారేమో! అంతలోనే అందరూ వరసగా గదిలోకి ప్రవేశించారు. విషాదపు బరువుకింద వాళ్ళ తలలు వాలిపోయాయి. ఎవ్వరూ తలపైకెత్తి చూడలేదు. నేలమీద కూర్చోలేదు. వచ్చినవాళ్లు వచ్చినట్లుగా నిలబడిపోయే వున్నారు.

అందరూ లోపలికొచ్చాక "ఖాల్సాజీ, నావంక చూడండి" అందామె. వాళ్లంతా అయిష్టంగా నెమ్మదిగా కళ్లెత్తి ఆమెవంక చూశారు. తమ గురువుల తేజస్సు ఆమె ముఖంలో ప్రకాశిస్తోంది. ఆమె కనుబొమల నుంచి ఉదయభానుని అరుణరాగం తొంగి చూస్తోంది. వాళ్లు ఓ అలౌకిక తన్మయతతో ఆమెముందు తలలు వంచారు. ఆ దివ్యావేశమూర్తి సన్నిధి తమకు పెన్నిధిగా భావించారు.

"ఖాల్సాజీ! ఎవరైతే హృదయంలో పాపం మూటగట్టుకుంటారో, వాళ్లకి గురుకృప దొరకదు. భగవదానుగ్రహం లభించదు"

"ఓటి నసీబ్!" జ్ఞాని మహీప్‌సింగ్ ఏదో చెప్పాలని నోరుతెరిచాడు.

"మీరు చెప్పబోయేది నాకు తెలుసు. అతను మనస్సులో పాపపు ఆలోచన పెట్టుకున్నాడు. విఫలమైపోయింది. అయితే, అతని ఆత్మలో భక్తితత్పరత కూడా ఉంది. దాన్ని మనం గౌరవిస్తాం. అతని కోసం ప్రార్థన జరుపుతాం. భాయ్‌మహీప్ అతనికోసం ప్రార్థన కార్యక్రమం నడిపిస్తాడు." అందామె.

వాళ్లు కొయ్యబారిపోయారు. గదిలోంచి అడుగు బైటికి కదపకుండానే ఆమెకీ సంగతి ఎలా తెలిసిందని వాళ్లు విస్తుపోయారు. అందరూ లేచినిలబడి ప్రార్థన





చేశారు. మహీప్‌సింగ్ నివేదనా కార్య క్రమం పూర్తిచేశాడు. అంతా నిర్మలమైన మనస్సుతో, పునరుత్సాహంతో కూర్చు న్నారు.

జరిగిందేమంటే తన్‌సీమ్ సింగ్ వెళ్లే హడావుడిలో అన్ని జాగ్రత్తలూ పక్కకి నెట్టాడు. స్వార్థం తలకెక్కినప్పుడు మనిషి సామాన్యమైన ఇంగిత జ్ఞానం కూడా కోల్పోతాడు. తనకోసం ప్రభుత్వం వల పన్నిందని అతనికి స్పష్టంగా తెలుసు. కాని, ఆ క్షణంలో అది గుర్తులేదు. అతను స్వర్ణదేవాలయం నుంచి బైటికి వచ్చీ రాగానే పోలీసులు ఆగమని కేకవేశారు. ఏదో ఒకటి బొంకి, అమాయకత్వం నటిస్తే తేలిగ్గా తప్పించుకు పోగలిగేవాడే. కాని, పరిగెత్తి పారిపోవ టానికి ప్రయత్నించాడు. ఆ ప్రయత్నమే అతణ్ణి పట్టించింది. పోలీసులు అతనివెంట పడ్డారు. చివాల్న ఓ చీకటి గొందిలోకి దూరాడు. వాళ్లు వెంటనే అతని ఒళ్లు తూట్లు పడేటట్లు తూటాలు పేల్చారు. జనంలో వ్యాపించిన వదంతి అదీ. ఏమైనా స్టెన్‌గన్‌తో పేల్చిన గుండ్ల జడికి ఎవడు గానీ బతికి బైట పడ్డం కల్ల.

"ఈరోజు మీరెవ్వరూ ఆవరణదాటి బైటికి కదలకండి. దారితప్పిన మన సోదరుడికి ఏం జరిగిందో ఖచ్చితంగా మనకి తెలీదు. చనిపోయీ వుండొచ్చు. కాకపోనూవచ్చు. పట్టుబడకుండా చనిపోయేవుంటే మనకే ప్రమాదంరాదు. మన సంత్ భంవర్‌కూడా అపాయం లేదు. ఈ క్షణంనుంచి మీరంతా సేవాదార్లు. మీమీ పనులు శ్రద్ధగా, జాగ్రత్తగా చేసుకుపొండి. ఈ గురు ద్వారాని జాగ్రత్తగా కనిపెట్టివుండండి. ఏదో ఒక మిషమీద ఎవరైనా ఒకటికి రెండుసార్లు లోపలికి వస్తారేమో కని పెట్టిచూడండి. రేపీవేళదాకా చూద్దాం. ఏమీ జరక్కపోతే, మన కార్యక్రమం కొనసాగిద్దాం. మీరంతా మూడు జట్లుగా విడిపోండి. ఒకొక్కజట్టు ఎనిమిది గంటలు ఏమరకుండా కాపలాకాస్తుంది. అప్రమ త్తతే భక్తి. అదే గురువు మననుంచి ఆశించేది. ఆ భక్తి భావం మీ అందర్లో నిండివుంటుందని నా ఆశ."

బరువెక్కిన గుండెతో అందరూ నిష్క్ర మించారు. పచ్చి పిరికితనంతో ఒకవ్యక్తి లొంగుబాటు, పిచ్చి ఉద్రేకంతో కొని తెచ్చుకున్న మరొక వ్యక్తి దుర్మృతి ఖాల్సా లక్ష్యానికి చాలా అపకారంచేశాయి. అందునా, ముఖ్యంగా ప్రభుత్వం మోకాళ్ల మీదకూలబడిఅంగీకారానికి రానున్న కీలక క్షణంలో ఈ దురదృష్టం సంభవించింది.

మరుసటి రోజు అదే వేళకి, అంటే 24గంటల తరువాత అందరూ అదే గదిలో సమావేశమయ్యారు. రెండవ హైజాక్ ప్రయత్నం గురించి చర్చ ప్రారంభమైంది.

"మొట్టమొదట ఆ హైజాకర్ ఎవరో తేల్చుకుందాం" అంది నసీబ్.

ఎవ్వరూ నోరు విప్పలేదు. అంతా మూగనోము పట్టారు.

"మీకు తెలిసికూడా చెప్పకపోతే అది గురుద్రోహం. ఖాల్సా మధ్య రహస్యా నికి చోటులేదు. మన గురువులు ఏం చెప్పారో గుర్తు తెచ్చుకోండి 'ఓ సిక్కు లారా....మీ హృదయాలు నాకు విప్పి చూపండి. మీ హృదయాలు పాపదూరమై నిర్మలమవుతాయి'"

చిట్టచివరకి ఖడక్‌సింగ్ అతని పేరు బైటపెట్టాడు.

"సోదరి నసీబ్! భగవంతుడు నిన్ను నుగ్రహించుగాక! అతని పేరు గ్యాని

 చతుర ... లెలె

జగ్తార్ సింగ్. నవాశహర్ వాస్తవ్యుడు"

"హైజాకింగ్ గురించి . అతనికేం తెలుసు?"

"ఏమీ తెలీదు. కేవలం ప్రాణానికి తెగించాడు. ముగింపు ఏమైనా అతనికి ఖాతరులేదు"

"ఎందుకని?"

"పోలీసులు ఒక హత్య కేసులో అతణ్ణి సాక్ష్యానికి వేసుకున్నారు. తను ఎవరైతే శుద్ధ అమాయకుడని అనుకున్నాడో అతని మీద పోలీసులు ఒక హత్యానేరం రుద్దారు. అందులో ఇతన్ని ఇరికించి ప్రభుత్వ సాక్షిగా ఉండమని బలవంతం చేశారు. ఒప్పుకోకపోతే ఆఖరికి పోలీసు స్టేషన్లో అతని కళ్ళముందే అతని భార్య బట్టలు విప్పదీశారు"

"వాహేగురూ! వాహేగురూ" దిగ్భ్రమతో అంతా హాహాకారాలు చేశారు.

"ఆవిడ ఆత్మహత్య చేసుకుంది. పోలీసులు అతణ్ణి కేసునుంచి తప్పించారు. కాని తన భార్య బట్టలూడదీయించిన ఆ డీయస్పీని హతమారుస్తానని అతను ప్రతిజ్ఞ చేశాడు"

"తస్నీమ్ అతణ్ణి రిక్రూట్ చేసుకోకుండా వుండాల్సింది. ఆ మనిషికి తన వ్యక్తిగత ప్రతీకారం తీర్చుకోడమే ధ్యేయం. పంథ్‌కి గానీ, ఖాల్సాకిగానీ ప్రతీకారేచ్ఛ ఉండదు. ఆశయం ధర్మబద్ధమైవుండాలి. అది ప్రజలకు సంబంధించిన ఆశయం కావాలి. పంథ్ కోసం పోరాడే ఖాల్సా హృదయంలో ద్వేషం ఉండరాదు. గురుగోవింద్‌సింగ్ మహరాజ్ తన శత్రువుల్ని ద్వేషించలేదు. గురు మహరాజ్ మొఘల్ సైనికుల్లో సైతం దైవకృపని చూశాడు"

"అతను రెండు రోజుల క్రితమే బొంబాయి వెళ్ళిపోయాడు"

"అతను రంగంలోకి దూకేది ఏ రోజు?"

"ఈ వారంలో ఏ రోజైనా. వ్యూహం తయారు చేసుకోడానికి అతను బొంబే - అమృత్‌సర్ రూట్‌లో చక్కర్లు కొడుతున్నాడు"

"మనం అతణ్ణి ఆపాలి ఖడక్ సింగ్‌జీ. బొంబే, జైపూర్, అమృత్‌సర్ విమానాశ్రయాల్లో మన మనుషుల్ని పెట్టండి. సమయం మించిపోకముందే అతణ్ణి ఆపండి. అతను తప్పకుండా తప్పుచేస్తాడు. వ్యక్తిగత ద్వేషం మనిషిని గుడ్డివాణ్ణి చేస్తుంది"

"అలాగే. కాని మనం అతణ్ణి ఆపలేం. అతని మనస్సు దానిమీదలగ్నమై వుంది. ఇప్పుడు వెనకడుగు వెయ్యడు. ఈ వారమంతా ప్రతి నిమిషం అతని మీద నిఘా వెయ్యటమంటే సాధ్యం కాకపోవచ్చు" అన్నాడు ఖడక్‌సింగ్.

"మీరు అలా అనుకుంటున్నారా? మన లక్ష్యానికి ప్రమాదకరమైన మనుషుల్ని ఎలా జాగ్రత్తలో పెట్టాలో మీకు తెలుసు. కాదంటారా?"

"బోలో సో నిహాల్" భాయ్‌మహిప్ సింగ్ పిలుపిచ్చాడు.

"సత్‌శ్రీ అకాల్"

అంతటితో ఆ చర్చ ముగిసింది.తాత్కాలికంగా మిగతా కార్యక్రమాలన్నీ రద్దయ్యాయి.

"ఇరవై నాలుగుగంటలూ నేనిక్కడ అందుబాటులో ఉంటాను. ఇక్కడ నా మకాం గురించి అనుమానం కలక్కుండా ఏడు రోజుల పాటు గురుగ్రంథ్ సాహిబ్ పారాయణం చేస్తాను. మీలో ఎవరు నన్ను చూడవచ్చినా పూలరేకులు దోసిట్లో

పోసుకుని రండి. భక్తుడు మాదిరిగా కూర్చుని పారాయణ వినండి. గదిలో ఎవరూ లేరని నిర్ధారణ చేసుకున్న తరవాత సమాచారం చెప్పండి. ఈలోగా మీరూ గుర్బాణీ పఠించండి. గురు మహరాజ్ సైగ మీకూ అందుతుంది. ఆయన తన ఆశ్రితుల్ని ఎప్పుడూ ఆదుకుంటాడు. వాహే గురూజీకా ఖాల్సా"

"వాహే గురూజీ కీ ఫతే"

గ్యాని జగ్తార్‌సింగ్ ప్రతీకారం అనే మానవ బలహీనతకు లొంగిపోయాడు. విమానం దారిమళ్ళించాడు. రాజసన్సీలో దిగటానికి సంతోషంగా ఒప్పుకున్నాడు. తనభార్యని గుప్తలూటిచేయించిన డీయస్పీని అప్పగించమన్నదే అతని మొట్టమొదటి డిమాండు. అతని వ్యక్తిగత ద్వేషమే అతని చావుకు కారణమైంది. తన షరతుల్ని గురించి చర్చలకోసం అతను విమానం నుంచి దిగి బైటికి కాలు పెట్టిన మరుక్షణం అతని ఒళ్లు తూటాలతో తూట్లమయం అయింది. తను విమానం లోంచి కాలు బైట పెట్టిన మరుక్షణం వాళ్ల దయాదాక్షిణ్యాలకు లోనయ్యాననేది అతనికి తట్టలేదు.

అది అకాలీదళ్ ఖాల్సా ఉద్యమ స్వరూపాన్నే మార్చివేసింది. పోలీసు చిత్రహింసల్లో జతేదార్ మహబత్ సింగ్ ఏమేమి వెళ్లగక్కాడో వాళ్లకి తెలీదు. అతనేమీ చెప్పివుండడని వాళ్లమనసుల్లో మిణుకు మిణుకుమనే ఓ ఆశ. కాని వాళ్లకి పూర్తి నమ్మకంలేదు. జతేదార్ మహబత్ సింగ్‌కి ఖాల్సా గౌరవ ప్రతిష్ఠల్ని కాపాడే స్థాయికి ఎదగగలిగేపాటి స్థయిర్యం ఉందా?అదే తెలుసుకోవాలి.అది తెలుసుకోగలం. ఈలోగా ఏమీ ఎరగనట్లు క్షేమంగా నాటకం నడపాలి.




అమృత్‌సర్ పోలీసు సూపర్నెంటు లజ్జారామ్ స్వర్ణదేవాలయం దగ్గర్లో క్లాక్‌టవర్ ప్లాజావద్ద జీపు ఆగీ ఆగకుండానే కిందికి దూకాడు. ఇన్‌స్పెక్టర్ షాబేగ్ పరుగెత్తుకుంటూ ఎదురొచ్చి ఠీవిగా శాల్యూట్ చేశాడు. ప్లాజాలో డ్యూటీ అంటే అతనికి రోత. పోలీసువాళ్ల అక్కడ అధమాధమ ప్రాణిలా చూస్తారు. జత్తేదార్ల కళ్లల్లో గుసలుకొట్టే కసి, ద్వేషం, సేవాదార్ల మొహాల్లో తొంగిచూసే హేళన, తిరస్కారం అతణ్ణి నిద్రలో కూడా వెంటాడుతున్నట్టే ఉంటాయి. పైగా ఆ దిక్కుమాలిన డ్యూటీవల్ల తన సాయంత్రపు సరదాలు బంద్ పోయాయి. డ్రింకుల్లేవు. మ్యూజిక్ లేదు. మజాలేదు. డియస్పీ అక్కడ ఏం కనిపెడదామని వచ్చాడో అతనికే తెలీదు. చేతులు వేళ్లాడేసుకువెళ్తే పైవాళ్ల చివాట్లు, చీత్కారాలు తప్పవు. తస్నీమ్‌సింగ్ కనపడగానే కట్టి పడెయ్యండర్రా అంటే కాల్చిచంపేశారు ఈ పనికిమాలిన వెధవలు! ఒకడు తగ్గాడనే వ్యర్థ సంతృప్తితప్ప చచ్చిన తస్నీమ్ గుడ్డిగవ్వ విలువ చెయ్యడు. సజీవంగా అతణ్ణి పట్టుకుని వుంటే, తన కీర్తి మారుమోగిపోయేదిప్పు...

"అంతా నార్మల్ సర్. రోజూ

ప్రవాహంలా భక్తులు లోపలికి పోతూనే ఉన్నారు. అన్నం మూటలు కట్టుకుని, చిన్నపిల్లల్ని చంకెక్కించుకుని పల్లెటూళ్ళనుంచి వచ్చే జనమే ఎక్కువ సార్. ఈ భూమ్మీద తమ బతుక్కి ఇదే ఆఖరు అన్నట్టుగా ఒంటెత్తుగా అయోమయంగా నడిచే ముసలీముతకా..."

"కవిత్వం కట్టిపెట్టు" యస్పీ పుల్ల విరుపుగా అరిచాడు.

"యస్ సార్"

"ఇదేనా నీ రిపోర్టు?"

"ఒక్కనిమిషం తమరు పర్మిషనిస్తే" అంటూనే ఇన్‌స్పెక్టర్ షాబేగ్ పర్మిషన్ పుచ్చుకోకుండానే వెనక్కి తిరిగాడు. దరిదాపుల్లో కనిపించే కానిస్టేబుల్ని దాష్టీకంగా కేకేసి "బుధిరామ్‌ని పిలు. ఇక్కడున్నట్టు రావాలి" అన్నాడు. వెంటనే యస్పీకేసి తిరిగి ఎటెన్షన్‌లో నిలబడి పరమానందయ్య శిష్యుడి మొహం పెట్టాడు. నేరస్థుల్ని హడలగొట్టటమన్నా, చిత్రహింసలు పెట్టటమన్నా అతనికి కొట్టినపిండి. ఎటొచ్చీ బాసులముందే ముచ్చెమటలు పోస్తాయి.

"బుధీరాం హాజర్ సాబ్"

నిటారుగా నిలబడ్డ పాములా ఉన్నాడతను. పొడుగాటి రొయ్య మీసాలు. అతను నిలబడ్డ తీరుచూస్తే చుట్టచుట్టుకున్న తాచుపాము కాటెయ్యటానికి సిద్ధంగా వున్న భంగిమ గుర్తొస్తుంది.

"విశేషమేమైనా ఉందా?"

బుధిరాం యస్పీవేపు తల తిప్పి "సాబ్, తమరు పర్మిషన్ దయచేస్తే" అంటూ ఆగాడు. యస్పీ అతని మొహంలోకి చూశాడు.

"ఖాల్సాస్కూలు పిల్లలజట్టు గుళ్ళోకి మారారు సాబ్"

"అందులో విశేషం ఏముంది?"

"వాళ్ళవెంట టీచర్లు కూడా లోపలికి చూరారు సాబ్. పిల్లకాయలేమో ఇరవై ఒక్కరే సాబ్. టీచర్లు మాత్రం అయిదుగురు. తప్పిపోకుండా లెక్క పెట్టాను సాబ్"

"అయితే?"

"వాళ్లు టీచర్లులాగా కనపళ్లేదు సాబ్"

"మరి నువ్వేం చేశావ్?"

"వాళ్ళని ఆపాను సాబ్. కాని ఆ దయ్యాలు... సారీసాబ్, పిల్లసర్దార్జీలు కృపాణాలు బైటికిలాగి సవాలుచేశారు సాబ్. పైగా ఆ అయ్యవార్లకి రక్షణగా చుట్టూ నిలబడ్డారు సాబ్. అయ్యవార్లకి పిల్లకాయలు రక్షణ ఇవ్వటం చిత్రంగా ఉంది సాబ్"

యస్పీ శ్రద్ధగా వింటున్నాడు.

"ఆ పిల్లకాయల్లో ఏ ఒక్కడిమీద్న చెయ్యిచేసుకున్నా దొమ్మీకి దిగివుండేవాళ్ళే సాబ్. అందుకని వాళ్ళని పోనిచ్చాను సాబ్"

"వాళ్ళింకా లోపలే ఉన్నారా?"

"లేదు సాబ్. పిల్లకాయలు బైటికొచ్చేసారు. అయ్యవార్లు లోపలే ఉన్నారు"

తన కమాండులోవున్న ఈ పనికి మాలిన పోలీసు మూక అసమర్థతకి రోతపుట్టి ఖాండ్రించి ఉమ్మేశాడు యస్పీ.

"ఇంకా ఒకటి జరిగింది సాబ్"

యస్పీ అతనికేసి తొడేలు చూపు చూశాడు. బుధిరాం ఆ చూపుకి గిలగిల్లాడాడు.

"ఒక పెళ్ళి పార్టీ లోపలికి వెళ్ళింది సాబ్. ఒక్కటే పెళ్ళికూతురు. ఆ పిల్ల వెంబడి ఏడుగురు మగవాళ్లు. పెళ్ళికూతురు తప్పించి వేరే ఆడకూతురు కనిపించలేదు సాబ్. స్కూలు పిల్లకాయల

యస్పీ జరిగిన పనికి బదిలీ ఉత్తర్వులిస్తే నిరభ్యంతరంగా పుచ్చుకుని వెళ్ళిపోడానికి సిద్ధపడి. అనుమానితులు స్వర్ణదేవాలయం లోకి చొరబడకుండా ఆపలేకపోవడంలో తను విఫలమయ్యాడు. తన్నీమ్‌ని కాల్చి చంపాకనైనా తను స్వయంగా అక్కడుండి తగు జాగ్రత్తలు తీసుకొని ఉండాల్సింది. తను పొరబాటు చేశాడు.

"ఒక అమ్మాయితోసహా వాళ్లు మొత్తం పన్నెండుగురు సర్. ఆ అమ్మాయి సంగతేమోగాని మిగిలినవాళ్లు ఖాయంగా మనం అనుమానించినవాళ్ళే సర్. ఇక ఆమె సంగతంటారా...మన దృష్టిని మళ్ళించడానికి ప్రవేశించిన పాత్ర కావచ్చు"

"ఇంతకీ ఏమంటావ్?"

"అనుమానితులందర్నీ నిలబెట్టి ప్రశ్నించడానికి పర్మిషన్ కావాలి"

"ఇంటరాగేషన్‌లో బుల్లి పొరపాటు జరిగిందంటే నీ యూనిఫారం ఊడదీయించి ఇంటికి పంపేస్తారు"

"యస్ సర్" యస్పీ గాలి తీసిన తిత్తిలా అయిపోయాడు.

"అలా నిలబడక కూర్చో. మీరెవరో తెలీదుగాని మీరూ కూర్చోండి" అన్నాడు డి. ఐ. జి. ఆ వెంట ఉన్నాయనకేసి చూస్తూ.

"ఈయన సిటీ సబ్ డివిజనల్ మేజిస్ట్రేటు రామావతార్ కొత్వాల్ సర్"

రామావతార్ కొత్వాల్ చెయ్యి పైకి లేపి శాల్యూట్ చేశాడు. డి. ఐ. జి. నిర్లక్ష్యంగా యస్పీ వేపు తిరిగాడు.

"నువ్వు దేవాలయంలో నీ మనుషుల్ని నింపాలి. కానిస్టేబుల్స్‌ని కాదు. నీకు విశ్వాసపాత్రులైన ఇతరమనుషుల్ని. వాళ్ళంతా ఏమీ ఎరగని అమాయకుల్లా నటించాలి. ముఖ్యంగా వాళ్లు వయస్సు మళ్ళిన ఆడవాళ్ళయితే మంచిది. కాస్త చత్వారం నటించాలి. ఇక లోపలి ఆవరణలో సీనియర్ ఆఫీసర్లు కూడా అవసరం. సాధారణంగా వాళ్లు సీనియర్ ఆఫీసర్లతో వెకిలిగా ప్రవర్తించరు"

"బ్రహ్మాండమైన వ్యూహం" డిప్యూటీ కమీషనర్ మెచ్చుకోలుగా వ్యాఖ్యానం చేశాడు.

"ఫలితాలు కనపడ్డాకగాని నిర్ణయించలేం"

"ఎవరు చెప్పగల్రు సర్"

"ఫొటోలు లేకపోవటంతోటే చెడ్డ చిక్కొచ్చి పడింది. మనకు పేర్లు మాత్రం తెలుసు. అవీ మారు పేర్లు. మనం ఎరుగని మొహాల పేర్లు. పైగా వాళ్ళంతా గెరిల్లా ఎత్తుగడలు వేస్తున్నారు. దెబ్బకొడతారు; దౌడు తీస్తారు. పారిపోయే జనంతో కలిసిపోతారు. జనంలో కలగలిసిపోయినవాళ్ళని గుర్తుపట్టలేం" యస్పీ సంజాయిషీ చెప్పుకున్నాడు.

"అది కనిపెట్టటానికే నువ్వీ యూనిఫారం వేసుకున్నావు. నువ్వు జనంతో కలిసి పారిపోవు. నేరం చేసిన వాళ్ళ వెంట పడతావ్. వాళ్ళని గుర్తుపెట్టుకుంటావ్. వాళ్ల పద్ధతి ఆకళించుకుంటావ్. వాళ్ళ ఎత్తుగడల్ని విశ్లేషిస్తావ్. అప్పుడు ఒక అభిప్రాయానికొస్తావ్. వాళ్ళని పోల్చే సే అభిప్రాయానికన్నమాట"

"యస్ సర్"

"ముఖ్యమంత్రి సాయంత్రం అయిదింటికి వస్తున్నారు. హర్‌మందిర్‌సాహిబ్ గురుద్వారాలో ఆయన పూజ చేస్తారు" అన్నాడు డిప్యూటీకమీషనర్.

"ఆయన రావటానికి పరిస్థితి అను




కూలంగా లేదు సర్" అని గొణిగాడు యస్పీ.

"ఎందుకని?"

"మనం ఆయుధాలు పట్టుకుని లోపలికి వెళ్ళలేం. పైగా యూనిఫారాలు వేసుకుని అసలు వెళ్ళలేం. వాళ్ళు స్టెన్ గన్లు పుచ్చుకెళ్ళినా లోపల ఆపేవాళ్లు లేరు. మనవరకే ఈ నిషేధాలన్నీ"

"ముఖ్యమంత్రిగార్ని రావద్దని మనం నచ్చచెప్పలేమా?" అనడిగాడు ఛల్లర్ డి.సి.ని.

"ఆయన చాలా మొండి మనిషి సార్! మనం చెప్పినా ఆయన వినరు. ఈవాళ ఉదయం రాహాన్‌లో ఆయన మీద దాడిజరిగింది. విద్యామంత్రితో సహా చాలా మందికి గాయాలు తగిలాయి. గ్రెనేడ్ వచ్చి ఛాతీకి తగిల్నా ఆయన చలించలేదు. అది నిజంగా పేలిఉంటే ముసలాయన అవశేషాలు కూడా దొరికేవి కాదు"

అప్పుడే ఓ కానిస్టేబుల్ వైర్‌లెస్ మెస్సేజ్ రాసిన చీటీ పట్టుకుని పరుగెత్తుకొచ్చాడు.

ఫగ్వారా సమీపంలో ముఖ్యమంత్రిగారి కారు మీద గుర్తుతెలీని దుండగులు బాంబు విసిరారట. అది రెండు నిముషాలు ఆలస్యంగా పేలింది. ఒక ట్రాక్టరు, ఒక ట్రాలీ నుగ్గయిపోయాయి. ముఖ్యమంత్రిగారు మాత్రం వెంట్రుకవాసిలో ప్రమాదం తప్పించుకున్నారు.

ఛల్లర్ నిద్రలో నడుస్తున్నట్లుగా టెలిఫోన్ కేసి నడిచాడు. చండీఘడ్‌కు, జలంధర్‌కు ఫోన్‌చేశాడు. మళ్ళీ నిద్రలో తూలుతున్నట్టుగా కుర్చీలో కూలబడ్డాడు. మిగతావాళ్లు ఏదో చెప్పాలని ఆగిపోయారు. అందరూ టెన్షన్‌లో ఊగిపోతున్నారు. సోఢీ కర్చీఫ్ తీసి మొహం తుడుచుకున్నాడు. యస్పీ కుర్చీలో నిటారుగా సర్దుకున్నాడు. కొత్వాలు చిన్నగా దగ్గాడు. ఛల్లర్ అతనికేసి అయిష్టంగా చూశాడు.

"ముఖ్యమంత్రి కార్యక్రమంలో మార్పు ఉండదు. ఆయన ఠంచనుగా అయిదు గంటలకల్లా హర్‌మందిర్ సాహిబ్‌లో ఉంటారు"

అందరికీ గుండెలు వేగంగా కొట్టుకున్నాయి. మొహాల్లో భయం, బెదురు, అసందిగ్ధత, కర్తవ్య విమూఢత గూడు కట్టాయి.

"ఆయనని ఎలాగైనా ఆపాలి సార్!" యస్పీ నెమ్మదిగా గొణిగాడు.

"ఎలా?"

యస్పీ లజ్జారాం కళ్లు తేలేశాడు.

"ఎలాగో నాకు తెలుసు సర్" అంటూ కొత్వాలు లేచి నిలబడ్డాడు.

అంతా అతనికేసి ప్రశ్నార్థకంగా చూశారు.

"కాలాసింగ్ ఒక్కడే దీనికి పరిష్కారం సర్"

"కాలాసింగా ?" ఎప్పుడూ వినని కొత్త పేరు వింటున్నట్లుగా ఛల్లర్ ఆశ్చర్యం ప్రకటించాడు.

"ఔను సర్. ముఖ్యమంత్రిగారి బాల్య మిత్రుడు. స్కూల్లో కలిసి చదివాడు. సి.యమ్. గారు ఇక్కడికి ఎప్పుడొచ్చినా అతన్ని కలుసుకోకుండా పోరు సర్. వారిద్దరి మధ్యా అంత గాఢ స్నేహం ఉంది. హిందూ, సిక్కు సామరస్య సభ పేరుతో పుత్లీఘర్‌లో అతనిచేత ఒక సమావేశం ఏర్పాటు చేయిద్దాం. కాలాసింగ్ సి.యమ్. ఆ సభలో ఉపన్యసించే ఏర్పాటు చేస్తాడు. సి.యమ్. గారు

అతని మాట ఎన్నడూ కాదనరు సర్".

ఓ క్షణం అందరూ నిశ్శబ్దంగా వుండి పోయారు. ఆతరవాత రైలింజన్ ఆవిరి వదిలినట్టుగా అందరూ గట్టిగా నిట్టూర్పు వదుల్తూ కొత్వాలు సూచనని ఆమో దించారు. డి.సి.యమ్. ఆ మీటింగు ఏర్పాటు గురించి హుటాహుటి బైల్దేరి వెళ్ళిపోయాడు.

అతను వెళ్ళాడోలేదో కంట్రోల్‌రూం నుంచి మరో మెస్సేజ్ వచ్చింది.

దుర్గెన మందిర్ ముందు ఎవరో ఆవు తోక నరికి విసరేశారట. కొంపలంటు కున్నాయ్!

మరుక్షణం ముగ్గురూ కుర్చీల్లోంచి ఎగిరి లేచి బైట వాహనాలకేసి పరుగు లెత్తారు. వైర్‌లెస్‌లో సమాచారం అందు కుంటూ, హుటాహుటిన ఆదేశాలు జారీ చేశాడు భుల్లర్ జీపులు, వ్యాన్లు మోత పెడుతూ మందిరం వేపు కదిలాయి.

దుర్గ గుడిముందు దృశ్యం భయం కరంగా ఉంది. హిందూ ప్రజా సందోహం రూపెత్తిన టైంబాంబులా ఉంది. ఆ టైంబాంబు సెకండ్లు టిక్కుటిక్కుమని రొదచేస్తూ గడిచిపోతున్నాయ్. జనసమూ హంలో శుద్ధ హిందూమహాసభవారి కాషాయ రంగు టోపీలు తెలివిగా చోటు చేసుకున్నాయ్. గనిలో ప్రేలుడు మందు దట్టించటానికే ఆ కాషాయ టోపీదార్లు జనంలో కలగలిసిపోయారు.

భుల్లర్ వెంటనే లౌడ్‌స్పీకరు అమ ర్చిన పోలీసు జీపు రప్పించాడు. అమాంతం లోపలికెక్కి కూర్చుని చకచకా మాట్లాడేస్తున్నాడు.

"మహాజనులారా! పోలీసులు తీసు కున్న సత్వర చర్యలేమిటో వినండి. ఇక్కడనుంచి బైటికి వెళ్లే అన్ని మార్గాల్ని మూసివేశాం. నగరం నుంచి బైటికివెళ్లే అన్నిమార్గాల్నీ మూసేశాం. బస్సులు గానీ, రైళ్లుగానీ పోలీసుల అనుమతి లేకుండా నగరం నుంచి కదలవు. ప్రతి వ్యక్తినీ సోదా చేస్తున్నాం. మీరంతా కదల కుండా నిలబడి మాతో సహకరించండి. ఈ దుర్మార్గం జరిపిన నేరస్థుడు కొద్ది గంటల్లో పట్టుబడక తప్పదు. అతణ్ణి నిర్దాక్షిణ్యంగా శిక్షిస్తామని హామీ ఇస్తున్నాం."

జనం ఎగతాళిగా కేకలు వేశారు. కొంతమంది పోలీసు జీపుల్ని తగలెట్టం డని గోలగా అరిచారు. ఒకవేపు జనం కేకలు, అరుపులు మిన్నుముడుతోందే మరోవేపు భుల్లర్ కాగితం మీద ఏదో గబగబా బరికేసి యస్పీకిచ్చి బిగ్గరగా చదవమన్నాడు.

"అకాలీ నాయకులు దిగ్భ్రాంతి వ్యక్తం చేశారు. వాళ్లంతా ఈ దురంతాన్ని ఖండించటానికి బయల్దేరి వస్తున్నారు"

సోఢీ నిస్పృహతో చేతులు నలుపు కున్నాడు. ఇటువంటి పరిస్థితుల్లో లోగడ తాము అనేక బొంకులు బొంకారు. కానీ, ఇటువంటి ఘోరమైన బొంకు బొంకినట్లు గురులేదు. చెవులు రిక్కించి భుల్లర్ చెప్పేది వింటున్నాడు. అసలు తనే మైకు లాక్కుని ఉపన్యసించవలసింది.

"మహాజనులారా! మన ముఖ్యమంత్రి గారు ఈ ఘోర వార్త విని స్వయంగా అమృత్‌సర్ చేరుకుంటున్నారు"

ముఖ్యమంత్రిగారు ఆ సమయంలో ఎక్కడ వున్నారో కూడా తెలీదు. ఆయన చండీఘడ్ నుంచి విమానంలో వస్తున్నారు కాబోలు అనుకున్నారు జనం.

"నగరంలో రాత్రి ఆరు గంటలనుంచి రేపు ఉదయం ఆరుగంటల వరకు కర్ఫ్యూ




విధిస్తున్నాం. సైన్యాన్ని సిద్ధంగా వుండ మని హెచ్చరించాం"

సైన్యం గురించి ప్రస్తావన, ముఖ్య మంత్రి హుటాహుటిన అమృతసర్‌కు బైల్దేరి వస్తున్న వార్త జనం మీద ముఖ్యంగా హిందూ నాయకుల మీద గొప్ప ప్రభావం కలిగించాయి. జనంలో దూరిపోయిన కాషాయరంగు టోపీల దూకుడు కొంత తగ్గింది. సైన్యంతో తలపడ్డం అందే వాళ్లకి జంకు పుట్టింది. పోలీసులకి వ్యతి రేకంగా అయితే ఎన్ని పొలికేకలయినా పెట్టగల్రు. ప్రచారానికి ప్రచారం జరిగి పోతుంది. న్యాయవిచారణ జరిపించమని ప్రకటనలు గుప్పించవచ్చు. అధికారుల్ని సస్పెండ్ చెయ్యమనీ, బదిలీ చెయ్యమనీ ఆందోళన మొదలెట్టవచ్చు. కాని సైన్యం దగ్గర ఈ పప్పులుడకవు; ఈ ఎత్తులేవీ పారవు.

అయినా జనం హోరు శాంతించలేదు. కేకలు, అరుపులు తగ్గలేదు. అంతా గందర గోళంగా ఉంది. డి.ఐ.జి. భుల్లర్ జీపు మీదికి ఓ రాయి వచ్చి పడి ధణ్‌మని మోగింది. చిన్న ఎత్తున రాళ్లు రువ్వడం మొదలైంది. భుల్లర్ తొణక్కుండా వైర్ లెస్ మీద ఆదేశాలు జారీ చేస్తున్నాడు.

"ఇళ్ల పైకెక్కి నిలబడండి. వెంటనే మూడు నాలుగు షాట్లు గాల్లో పేల్చండి. ఏ దిక్కు నుంచి కాల్పులు జరుగు తున్నాయో జనానికి తెలవకుండా తికమక పెట్టండి"

మరుక్షణం మూడు వేపులనుంచి మెరుపు వేగంతో కాల్పుల మోత జనా నికి స్పష్టంగా వినిపించింది. కాని ఎటు వేపు నుంచి వచ్చిందీ తెలీక తికమక పడ్డారు.

"మహాజనులారా! పరిస్థితి అదుపులో ఉంది. కంగారుపడకండి. ఆలయం ముందు ఆవు తోక పారేసి మోటర్ సైకిల్ మీద పారిపోయిన వ్యక్తిని కళ్లారా చూసిన మనిషి నేరస్థుడి ఆచూకీ చెప్పాడు. ఈ రాత్రిలోగా అతణ్ణి అదుపులోకి తీసు కుంటాం"

కాల్పుల మోతకి జనంలో కంగారు పుట్టింది. కాని జనంలో అణిగిమణిగివున్న ఉద్రేకం, రౌద్రం బాహాటంగా కన్పిస్తు న్నాయ్. సో భితో మందిరంలో గంటలు మోగించి, భజన కార్యక్రమాన్ని మొద లెట్టించమని డి.ఐ.జి. ఆదేశించాడు. ఆ ఎత్తుగడ పనిచేసింది. గుడిగంటలు గణ గణ మోగాయి. లోపల భజనకీర్తనల ఆలాపన మైక్‌లోంచి బైటికి వినిపించింది. జనంలో సగం మంది మందిరంలోకి చొచ్చుకుపోయారు. పరిస్థితి తాత్కా లికంగా అదుపులోకి వచ్చింది. డి.ఐ.జి. తక్షణం యస్పీ లజ్జారామ్‌ని అకాల్ తఖ్ వేపు ఉరికించాడు. సంత్ భండర్‌తో మాట్లాడి సిక్కు సుహృద్భావబృందాన్ని పంపించే ఏర్పాటు చెయ్యమని పూరమా యించాడు. స్థానిక పదాతి పటాలంనుంచి ఉక్కు కవచాల్తోసహా రెండు శతఘ్ని శకటాలు రప్పించే ఏర్పాటు చేశాడు.

అకాలీ సుహృద్భావబృందం వచ్చే సమయానికి జనం ఘూర్ణిల్లేసముద్రంలా ఉన్నారు. కోపోద్రేకాలు ప్రమాదస్థాయికి చేరాయి. ఏ క్షణంలోనైనా చెలియకట్టని ఛేదించుకుని ప్రమాదం ముంచుకొచ్చేలా ఉంది.

సాయుధశకటాలు ఆఘమేఘాలమీద దూసుకొచ్చాయి. జనాన్ని గిరిదాటి కదల నివ్వనట్లుగా అవి పొజిషన్‌లో నిల బడ్డాయి. శకట గోపురాలకమర్చిన భారీ మరతుపాకులు భయంకరంగా కన్పిస్తు

న్నాయ్. స్టెన్‌గన్లు ధరించిన ఉక్కు టోపీల గూర్ఖా సిపాయిలు బారులుతీరి నిలబడ్డారు. ఉద్రేకంతో ఊగిపోయే జనం కొంత శాంతించారు. శుద్ధ హిందూ మహాసభ నాయకులుమాత్రం ముందు కొచ్చి సవాళ్లు విసిరారు.

"నేరస్థుణ్ణి పట్టి మా ముందుని ల బెట్టండి. శిక్షేదో మేమేస్తాం" అన్నాడు శుద్ధ హిందూమహాసభ అధ్యక్షుడు మన్నా రామ్.

జత్తేదార్ నోరు తెరవబోయేటంతలో ఛుల్లర్ కలగజేసుకున్నాడు.

"నేరస్థుణ్ణి శిక్షించేహక్కు, అధికారం కోర్టులది. అతణ్ణి కోర్టుకే అప్పగిస్తాం"

"ఇక మీతో మాట్లాడే పన్లేదు. ఆ లంజకొడుకులకి ఎట్లా శాస్తిచెయ్యాలో మాకు తెలుసు" అన్నాడు మన్నారామ్ దూకుడుగా.

జనం ఒక్కక్షణం నిశ్శబ్దమైపోయారు. సంతోక్‌సింగ్ వెంటనే రేడియో సెట్టుతీసి "జత్తేదార్ సంతోక్‌సింగ్‌ని మాట్లాడు తున్నాను. పరిస్థితి ప్రమాదంగా ఉంది. మన ప్లాను అమల్లో పెట్టండి" అని బిగ్గరగా చెప్పాడు.

"ఏమిటా మాట్లాడింది?" అనడిగాడు మన్నారామ్ కోపంగా.

"రెండునిమిషాలు ఓపికపట్టు. నీకే తెలుస్తుంది" అన్నాడు సంతోక్‌సింగ్ తీవ్రంగా.

మన్నారామ్ వాచీ ఊడదీసి చేతుల్లో పట్టుకున్నాడు.

"సర్దార్జీ! రెండు నిమిషాలైపోయింది" అన్నాడు హేళనగా మన్నారామ్. వాచీని తిరిగి చేతికి బిగించాడు.

అదే క్షణంలో సిక్కు నినాదం దిక్కులు పిక్కటిల్లేటట్లు మోగింది.

"జో బోలే సోనిహాల్-సత్ శ్రీ అకాల్"

నీలం, పసుపుపచ్చ తలపాగాలు ధరించిన సిక్కు జనార్ణవం గోవింద్ పుర్, సర్క్యులర్ రోడ్, గోల్‌బాగ్ రోడ్లమీదికి పొంగిపొరలింది. ఉరకెత్తి వచ్చే అకాలీ ప్రజా సమూహం చప్పున ఆగిపోయి యుద్ధానికి సన్నద్ధమై నిల బడింది.

"ఇప్పుడు తెలిసిందా?" అంటూ సంతోక్‌సింగ్ విజయాట్టహాసం చేశాడు. మన్నారామ్ నిరుత్తరుడైపోయాడు. ఛుల్లర్, సోఢీలు ఊహించని ఈ పరి ణామానికి తెల్లమొగంవేశారు. యుద్ధం తప్పదు. కాల్పులు తప్పవు. ఈ శతాబ్దపు అత్యంత భయానక సంఘటనగా ఇది చరిత్రలో నిలవక తప్పదు.

"మన్నారామ్! ఇక నీ పని గోవిందా. పవిత్రమైన గుడిముందు అపుతోక విసి రేసి పారిపోయిన దుర్మార్గుణ్ని పట్టు కున్నాం" అన్నాడు సంతోక్‌సింగ్.

"నో్మ్యయ్..." మన్నారామ్ వాక్యం పూర్తికాకముందే సిక్కు యువకులు నేరస్థుణ్ని లాక్కురావటం కనిపించింది. మన్నారామ్ తక్కున నోరు మూసు కున్నాడు. ఒక నల్లటి బక్కపల్చటి హిందూ యువకుణ్ణి వాళ్లు లాక్కొచ్చారు. అతను చుట్టుకున్న నీలి తలపాగా, అతి కించుకున్న దొంగగడ్డం జీపు హుడ్‌మీద అందరికి కనిపించేలా పెట్టారు.

"పీడవంక చూడండి. ఆ ఘాతుకం జరిపిన దుర్మార్గుడు వీడే. ఈ మన్నా రామ్ వీడికి డబ్బులిచ్చి ఈ పని చేయిం చాడు. కాదంటాడేమో అడగండి"

మన్నారామ్ జనంలోంచి చల్లగా జారుకోవాలని ప్రయత్నించేశాడు. ఆ ప్రయత్నంలోనే అతను దొరికిపోయాడు.





జనం అతనిమీద విరుచుకుపడ్డారు. పోలీసులు కలగజేసుకునేటప్పటికే మన్నా రామ్ మూడు పక్కటెముకలు విరిగాయి; ఒక పన్ను రాలిపోయింది. దవడ, మణి కట్టు విరిగాయి. జనం యింకా ఎన్ని కీళ్ళు విరిచేశారో లెక్కలేదు. పోలీసులు నేరస్థుణ్ని, మన్నారామ్ని అదుపులోకి తీసుకున్నారు. సంతోక్సింగ్ జీపు టాపు మీద నిలబడి మైకులో ప్రసంగిం చాడు.

"హిందూ, సిక్కు సోదరులందరికీ ఒక్క విషయం మనవి చేస్తున్నాను. మా ఆందోళనని సాకుగా తీసుకుని మతోన్మాదం రెచ్చగొట్టే ఇటువంటి చర్యకి పాల్పడే దుర్మార్గులుంటారని మేం ముందే ఊహించాం. నగరంలోని హిందూ దేవా లయాలచుట్టూ 24 గంటలూ నిఘా ఉంచాం. దానివల్ల సత్ఫలితం కలిగింది. మొగలాయీలకి వ్యతిరేకంగా ఆత్మరక్షణ కోసం ఖాల్సా సృష్టించబడిందని హిందూ సోదరులు గమనించాలి. ఖాల్సా ఎన్నటికీ హిందువులకు హాని తలపెట్టదు. మీరు అనవసర భయాందోళనలకు గురి కావల సిన అవసరంలేదు. మీకు మేం వ్యతి రేకులంకాదు. మా పోరాటం ప్రభుత్వానికి వ్యతిరేకంగానే తప్ప మీకు వ్యతిరేకంగా కాదు. మీరు నిర్మలమైన హృదయంతో సిక్కు సోదరులపట్ల ప్రేమభావంతో మా పోరాటంలో చేతులు కలుపుతామంటే మీకు మా హృదయపూర్వక స్వాగతం. బోలేసో నిహాల్"

"సత్ శ్రీ అకాల్"

ఆకాశం ప్రతిధ్వనించింది. కొందరు హిందువులుసైతం ఆ నినాదం అందుకుని గొంతెత్తి అరిచారు. జనం నెమ్మదిగా ప్రశాంతంగా చెదిరిపోయారు. అందరి కన్నా ముందుగా నారింజ రంగు టోపీలు అదృశ్యమయ్యాయి.




ముంచుకొచ్చిన ప్రమాదం తృటిలో తప్పిపోయింది. భుల్లర్ వెంటనే నగ రంలో గస్తీ దళాల పహరాకు ఆదేశాలు జారీచేశాడు. ముఖ్యమంత్రి గ్యానీ దీప్ సింగ్ స్వర్ణదేవాలయాన్ని సందర్శించి, స్వాగత సత్కారాలు అందుకొని చండీ గఢ్ తిరిగి వెళ్ళిపోయాడు. శుద్ధ హిందూ మహాసభ తనకి జరిగిన తలవంపుల్నుంచి బైటపడ్డానికి ఆ రాత్రి సమావేశమైంది. ఆ రాత్రికి రాత్రే మహాసభ నాయకులు ప్రభుత్వాన్ని తీవ్రంగా విమర్శిస్తూ ఒక ప్రకటన విడుదల చేశారు.

"మన్నారామ్ పేరుతో ప్రభుత్వమే ఒక కీలుబొమ్మని శుద్ధ హిందూ మహాసభ వర్గంలో నాటి ఈనాటి ఘాతుకాన్ని సృష్టించినందుకు సభ తీవ్రంగా గర్హి స్తోంది. లాహోర్లో మరణించిన ఒక్క ప్రముఖ సంఘసంస్కర్త పేరు పెట్టుకొని ఈ నకిలీ మన్నారామ్ ప్రభుత్వ అండ దండల్తో మా సభ కార్యవర్గంలో దూర్చ గలిగాడు. ప్రభుత్వం తన స్వప్రయోజ నాల కోసం హిందూ-సిక్కు సమైక్యతని భగ్నం చేయటానికి నకిలీ మన్నారామ్ని పావుగా వాడుకుని మహాసభ ప్రతిష్టని

బుద్ధిపూర్వకంగా దెబ్బతీసిన నీచపు ఎత్తుగడని మేం తీవ్రంగా గర్హిస్తున్నాం. అమృత్‌సర్ సిక్కులకెంత పవిత్రమైన నగరమో హిందువులక్కూడా అంతే. కాబట్టి ప్రతి ఒక్క హిందూ, సిక్కు సోదరుడు సౌహార్ద్రభావంతో కలిసికట్టుగా దేశ, విదేశ శత్రువులకు వ్యతిరేకంగా భుజం భుజం కలిపి పోరాడవలసిందిగా మహాసభ విజ్ఞప్తి చేస్తోంది. పంజాబ్‌లో శాంతిని నెలకొల్పడానికి ముఖ్యమంత్రిని తక్షణం తొలగించమని మహాసభ కేంద్రానికి విజ్ఞప్తి చేస్తోంది"

తెల్లవారేసరికి అన్ని పత్రికల్లో శుద్ధ హిందూ మహాసభ ప్రకటన విడుదల అయింది. ప్రభుత్వం ఆ ప్రకటన పైన ఎంత సంజాయిషీ ఇచ్చినా, మన్సారామ్ ప్రభుత్వ కీలుబొమ్మ కాదని జనాన్ని నమ్మించలేకపోయింది. మన్సారామ్ కుటుంబం ఆ రాత్రికి రాత్రే అమృత్‌సర్ వదిలి చాటుగా దాటిపోయింది. లాహోరీ బజార్లో ఉన్న అతని దుకాణానికి నిప్పంటించటానికి కొందరు యువకులు ప్రయత్నించారు. పోలీసులు సకాలంలో మేలుకోవటంతో ఆ ప్రయత్నం విఫలమైంది.

* * *

ఈ పరిణామాలు ప్రజల్ని తికమక పెట్టాయి. మేధావులు, చరిత్ర విద్యార్థులు, రాజకీయపరిశీలకులు ముఖ్యంగా రాజకీయ

**The Golden Temple should not be misused**

**house of god**

**...hides in the Golden Temple**

**Safe Hideout**



నాయకులు కలవరపడిపోయారు. హఠాత్తుగా ఖలిస్తాన్ పొలికేక వినిపించడం అందర్నీ దిగ్భ్రాంతిలో ముంచెత్తింది. ఖలిస్థాన్ఎందుకు? ఇన్నాళ్ళబట్టిలేంది ఇప్పుడు ప్రత్యేకంగా ఈ నినాదం ఎందుకు తలెత్తింది? పంజాబీ సుబాని ప్రభుత్వం ఆమోదించాక కూడా ఇప్పుడీ డిమాండు ఎందుకోసం? సిక్కులు మైనారిటీ వర్గమే. అల్పసంఖ్యాకవర్గాల్లో అల్పసంఖ్యాకవర్గం. వాళ్లకేం కావాలి? తమని గురించి తాము ఏమనుకుంటున్నారు? తమదొక ప్రత్యేక జాతి అనుకుంటున్నారా? లేదు. హిందూ జాతిలో వాళ్ళు ఒక భాగం. అది వాళ్ళు స్వయంగా ఒకనాడు ఒప్పుకున్నారు. దేశ విభజన సమయంలో బ్రిటిష్‌వాళ్ళు సిక్కుల్తో కూడా ప్రత్యేకంగా సంప్రదించారు. ముస్లిములకు దేశంలో ఒక ముక్కని విడగొట్టి ఇచ్చినట్లుగానే సిక్కులక్కూడా ఇవ్వటానికి బ్రిటిషు వాళ్ళు సుముఖం. కాని ఆనాడు సిక్కు నాయకుడు మాస్టర్ తారాసింగ్ అందుకు ఇష్టపడలేదు. భారతదేశంలో సిక్కులు అవిభాజ్యభాగం అని వాదించాడు. హిందువులనుంచి విడిపోయేది లేదని తెగేసి చెప్పాడు. చేతికందిన అవకాశాన్ని ఆనాడు చేజేతులా వదులుకున్నారు. మరి ఇప్పుడెందుకీ ప్లేటు ఫిరాయింపు? ఎందుకు.. ఎందుకు?

దేశమంతటా ప్రజలడుగుతున్న ప్రశ్నలివి. మొఘల్ నిరంకుశత్వానికి వ్యతిరేకంగా హిందూ ప్రజల కోసం సిక్కులు చేసిన త్యాగాల్ని నిరాకరించే మనిషంటూలేడు. వాళ్లు స్వాతంత్ర్య పోరాటంలో నిర్వహించిన పిరోచిత పాత్రని గుర్తించని భారతీయుడంటూ లేడు. వాళ్ల పురోగామి దృక్పథాన్ని, ప్రగతిశీల చైతన్యాన్ని, శక్తి సామర్థ్యాల్ని, హుందాతనాన్ని, ఆత్మగౌరవాన్ని అందరూ ఏకగ్రీవంగా మెచ్చుకుంటారు. చరిత్రలో సిక్కులు సాధించిన ఘన కార్యాల్ని ప్రజలు గుర్తుంచుకున్నారు. కాని అకాలీల ప్రస్తుత డిమాండ్లని చూసి సిక్కుల్లో హఠాత్తుగా ఇంతటి మార్పు ఎలా పుట్టిందా అని ప్రజలు విస్తుపోతున్నారు. సిక్కుల్ని ప్రత్యేక జాతిగా గుర్తించాలనే అకాలీల డిమాండూ,ఖలిస్థాన్ అవతరణ జరిగితీరాలనే అకాలీదళ్ ఖాల్సా పోరాటం అటు ప్రభుత్వాన్ని, ఇటు ప్రజల్నీ కూడా తికమక పెట్టేశాయి. సిక్కులు ప్రముఖంగాలేని రంగమేదైనా ఉందా? వ్యవసాయంలో, వాణిజ్యంలో, పరిశ్రమల్లో,ప్రభుత్వోద్యోగాల్లో, సైన్యంలో, విదేశాంగశాఖలో వాళ్ళదే పైచేయి. కేంద్ర మంత్రివర్గంలో ప్రాతినిధ్యం ఉంది.పార్లమెంటులో గణనీయమైన సంఖ్యలో వారు ఉన్నారు. అంతర్జాతీయరంగంలో సముచితస్థానం ఉంది. మరింకా ఏం కావాలి? సిక్కులకు విశాలదృష్టి కలిగినివాళ్ళని పేరుంది. జీవితం పట్ల అనురాగం గల ప్రజలు వాళ్ళు. అటువంటివాళ్లు మత దురావేశపరులపట్ల, 'ధర్మ యుద్ధ' కాముకుల పట్ల ఎలా మొగ్గు చూపగలిగారు? హఠాత్తుగా వాళ్ళలో ఇంతటి మార్పు ఎలా సంభవించింది?

అందరి మనస్సుల్లో రేకెత్తిన అనేక ప్రశ్నలివి. పరిస్థితి రోజు రోజుకీ గడ్డుగా తయారవుతోంది. ఎవరూ ఊహించని మెరుపు వేగంతో కొన్ని సంఘటనలు సంభవించాయి. తీవ్రవాదుల కార్యకలాపాలు జోరందుకున్నాయి. ప్రముఖ పాత్రికేయుడు లాలాజగ్‌రామ్ నిర్దాక్షిణ్యంగా తీవ్రవాదుల హత్యకు





గురయ్యాడు. ఆ సంఘటన రాష్ట్రం మొత్తాన్ని, దేశరాజధానీ నగరాన్ని దిగ్భ్రమలో ముంచెత్తింది. పత్రికా ప్రపంచం కొయ్యబారిపోయింది. సామాన్య జనం భయభ్రాంతులైపోయారు.

నిరంకారీహత్యలు నిరాఘాటంగా సాగిపోతున్నాయి. ఉగ్రవాదులు మనుషుల ప్రాణాలు తియ్యడంలో పైశాచికానందం అనుభవిస్తున్నారాఅనిపించింది. పోలీసులు రంగంలోకి దూకారు. ఎన్‌కౌంటర్ల ముసుగులో ఎందరో అమాయకుల ప్రాణాలు బలిగొన్నారు.

సంత్ భిండర్ మొత్తం అమృతసర్ నగరంలో పొగాకు, మద్యం, మాంసం విక్రయాన్ని నిషేధించాలని తుది హెచ్చరిక చేశాడు. అకాల్ తఖ్త్ నుంచి ఆయన ప్రభుత్వానికి అల్టిమేటం జారీ చేశాడు.

"ఖాల్సాజీ! పవిత్ర అమృతసర్ నగరంలో పొగాకు, మద్య, మాంసాల విక్రయాన్ని నిషేధించే సమస్య మీద రాజీ అనేదిలేదు. పాత, కొత్త ప్రాంతాల ప్రసక్తి లేకుండా నగరం నాలుగు దిక్కులా ఈ నిషేధం అమలు జరగాలి. ప్రభుత్వం నిర్ణయం తీసుకుని నిషేధం ప్రకటించడానికిగాను పదిరోజులు వ్యవధి ఇస్తున్నాను. పదవరోజుకి ప్రభుత్వం గనుక నిషేధం ప్రకటించలేకపోయిన పక్షంలో మీ అందరి ముందు నిలబడి ఈ హేయమైన, ఏహ్యమైన పదార్థాల్ని అమ్మే దుకాణాల్ని తగులబెట్టే కార్యక్రమాన్ని స్వయంగా నడిపిస్తాను. అవి సిక్కులవైనా, సిక్కేతరులవైనా నేను ఖాతరు చెయ్యను"

అల్టిమేటం ప్రభుత్వానికి అందింది. అది అక్షరాలా అమలు జరిగి తీరుతుందని ప్రభుత్వానికి తెలుసు. దానివల్ల కలగబోయే పరిణామాల గురించి ప్రభుత్వం డోలాయమాన స్థితిలో పడింది. నగరం నెత్తుటి మడుగు అవుతుంది. సంత్ భిండర్ చట్టాన్ని తన చేతుల్లోకి తీసుకొంటుంటే ప్రభుత్వం మెతకవైఖరి అవలంబించదు. సంత్‌ని, అతని ఆత్మాహుతి దళాన్ని అణచడం సులువుకాదు. వాళ్ళ దగ్గరా అత్యాధునిక ఆయుధాలున్నాయి. అన్నిటికన్నా వాళ్లు మూర్ఖులు. మతోన్మాదంలో సంతోషంగా పాటలు పాడుతూ ప్రాణాలర్పిస్తారు. ప్రభుత్వం సంత్‌తో ఘర్షణకి తలపడ్డం మంచిదికాదు. ఆయనని సంభాషణకాహ్వానించాలి. ఆయన్తోపాటు అకాలీదళ్ అధినేతని, మాజీముఖ్యమంత్రిని చర్చకాహ్వానించాలి. కాని, వారు పత్తాలేకుండా మాయమయ్యారు. ప్రభుత్వం అడుసులో దిగబడిపోయింది. వాళ్ళిద్దరికోసంగాలింపు మొదలయింది. ఈలోగా ప్రభుత్వం ఉగ్రవాద వ్యతిరేక చర్యలు తీవ్రతరం చేసింది. దాంతో తాత్కాలికంగా కనుమరుగైపోయిన నాయకులిద్దరూ బైటపడ్డారు.

అప్పటిదాకా అకాలీదళ్ నల్లేరు మీద బండి లాగించింది. ఇప్పుడు నిష్కారణంగా సిక్కుయువకులు పోలీసు దురాగతాలకి బలియైపోతూంటే గట్టిగా ప్రతిఘటించక తప్పని పరిస్థితి ఎదురయింది. గ్రామలంబర్దార్లు, పంచాయితీ సభ్యుల సమక్షంలో అరెస్టయిన యువకుల్ని పోలీసులు ఎన్‌కౌంటర్ల ముసుగులో నిర్దాక్షిణ్యంగా హతమారుస్తోంటే వాళ్లు బైటపడక తప్పలేదు. అటువంటి అనేక సంఘటనల్ని ఉదాహరిస్తూ వాళ్లు ప్రభుత్వాన్ని సవాల్ చేశారు. ప్రభుత్వం ఇంత

'అతి'గా పోతుందే చేతులు కట్టుకుని కూర్చునేదిలేదని స్పష్టం చేశారు.

ఈ దారుణ హత్యల్ని ప్రభుత్వం తక్షణం ఆపకుంటే మోర్చా సాగదీస్తామని అకాలీ నాయకులు ప్రభుత్వాన్ని బెదిరించారు. వాళ్ళంతా ఇప్పుడు సంత్ భిండర్ వైఖరిని సంపూర్ణంగా సమర్థిస్తున్నారు. పొగాకు, మద్యమాంసాల విక్రయం మీద నిషేధానికి సంబంధించిన సమస్య కొండంతయింది. సిక్కు యువకుల హత్యతో సంబంధమున్న అధికారులందర్నీ తక్షణం సస్పెండ్ చెయ్యమని నాయకులు డిమాండు చేశారు. న్యాయ విచారణ జరిపించమని వత్తిడి పెట్టారు.

దానికి ప్రతిగా ముఖ్యమంత్రి గురుద్వారాల్ని రాజకీయ ప్రయోజనాలకోసం ఉపయోగించుకోడాన్ని, నేరస్థులకు శరణాలయాలుగా వినియోగించడాన్ని అతి తీవ్ర పదజాలంతో ఖండించాడు. గురుద్వారాల నిర్వహణ మీద ధ్వజమెత్తాడు.

అకాలీ లొక్కరేకాదు, సిక్కు ప్రజలు యావన్మంది ప్రభుత్వవాదాన్ని నిరాకరించారు. గురుద్వారాల పవిత్ర ఆవరణలోకి యూనిఫారాలు ధరించిన పోలీసుల్ని ఏ ప్రభుత్వమైనా ఎలా అనుమతిస్తుంది? ఒక్క సిక్కులకేకాదు, ఏ మతస్థుడికైనా, ఏ కులస్థుడికైనా గురుద్వారా ఒక పవిత్ర స్వర్గం. అందుకే స్వర్ణదేవాలయానికి నాలుగు దిక్కులా ద్వారాలు తెరిచే వుంటాయి. ప్రతి శరణాగతుడికీ అక్కడ ప్రవేశం ఉంటుంది. గురుద్వారా పవిత్ర ఆవరణలో ప్రవేశించే వ్యక్తుల పూర్వాపరాలతో పూజారికి నిమిత్తం లేదు. పోలీసులు, ప్రభుత్వోద్యోగులు నిరాయుధులుగా గురుద్వారాలో ప్రవేశించడానికి ఎటువంటి నిషేధంలేదు. వీళ్ళు మామూలు మనుషులుగా గురుద్వారాలో ప్రవేశిస్తే, వాళ్ళనెవరూ తనిఖీచెయ్యరు.

గురుద్వారాలు రాజకీయవేదికలుగా రూపొందాయనేది రాష్ట్రప్రభుత్వ విమర్శలో రెండవ అంశం. ముఖ్యమంత్రి సిక్కుమతస్థుడైవుండీ, ఒకప్పుడు అకాలీ అయివుండీ, ఒకవిధంగా చరిత్రకారుడై వుండీ సిక్కుజంలో మతం, రాజకీయాలు చెట్టాపట్టాలు వేసుకునిసాగాయనే వాస్తవం మర్చిపోయాడు. ఈ రెంటి సమ్మేళనానికి కేంద్రమే గురుద్వారా. నిజానికి సామాన్య మానవునిగా, కార్మికునిగా, రాజకీయ వేత్తగా, గృహస్థునిగా, రాజనీతిజ్ఞునిగా లేదా పండితునిగా సిక్కు జీవితం గురుద్వారాలో ఆరంభమై, అక్కడే అంతమవుతుంది.

యాభయ్యోపడిలోపడ్డ ఓ పల్లెటూరి రైతు లూధియానాలో పంజాబ్ వ్యవసాయ విశ్వవిద్యాలయంలో రెండుబస్తాలు వరి వంగడాలు కొనుక్కొని బస్టాండుకెలా చేరటమా అని ఆలోచిస్తూ నిలబడ్డాడు. మూటలు రెంటినీ రెండుభుజాలమీదా వేసుకుని నడవగలనా అని అతను ఆలోచించాడు. ఉహూఁ. సైకిలురిక్షామీద వేసుకెళదామని దిక్కులు చూశాడు.

"సర్దార్జీ! వీటిని ఎక్కడికి తీసుకుపోవాలి?" అనడిగాడు పక్కన నిలబడ్డ ఓ పెద్దమనిషి.

"మా ఊరికి. ధనీ అని ఖన్నాకు ఏడుమైళ్లు"

పంజాబీలిద్దరూ మాటల్లోకి దిగితే సగంరోజు గడిచినా పరస్పరం పేరయినా అడిగి తెలుసుకోరు. ముక్కూ, మొహం తెలీనివాడెవడో అనవసర ప్రసంగం చేస్తున్నాడని అనుకోరు.





"ఖన్నాకి ఎట్లా పోతారు?"

"బస్సులో"

"మరి అక్కణ్ణుంచో?"

"అక్కడ నా సైకిలు పెట్టివచ్చాను. ఖన్నాలో బస్సుదిగి, సైకిలుమీద ఈ మూటలేసుకుని మా ఊరు చేరిపోతాను."

"మీకు పిల్లల్లేరా?"

"లేకేం! ఇద్దరు. ఇద్దరూ కాలేజీ చదువులు పూర్తిచేశారు. దిట్టంగా నిదర తీస్తుండి ఉంటారు"

"సేద్యంలో వాళ్ళు మీకు సాయం చెయ్యరూ?"

"సత్తెకాలం మనిషిలా వున్నావే. సాయమా? ఆహా! చేస్తారు చేస్తారు. చేను దున్నుందర్రా అంటే ట్రాక్టరు తోలటం సరదాకనక తకిమని ఎక్కికూచుంటారు. ధాన్యం మార్కెట్టుకి వేసుకెళ్ళండర్రా అంటే సినిమా కొనుక్కోటానికి ఛాన్సు దొరుకుతుందని లగెత్తుతారు"

"మరయితే, సేద్యం సాగేదెలా?"

"యు.పి., బీహార్ కూలీల్ని భగమంతుడు చల్లగా చూసినంతకాలం ఆ ఇబ్బందిలేదు"

"స్థానికంగా మీకు కూలీలుదొరకరా?"

"వాళ్ళంతా మిల్లుల్లో, దాములుకట్టే కాడ పన్లు చేస్తారు"

"బావుంది. అది సరేకాని భయ్యా... మోర్చా సంగతేమంటావ్?"

"అందే?"

"మోర్చా జయప్రదం అవుతుందా అని?"

"ఏవయ్యో పెద్దమనిషీ! గురుద్వారా నుంచి మొదలయ్యే మోర్చా నెగ్గకపోవట మంటూ నేనెరగను. ఇదీ నెగ్గితీరుతుంది."

"మీ ఊళ్ళోవాళ్ళ మాటేమంటావ్"

"మాదెంత ఊరులే. అంతాకలిపి ఏడొందలమందికన్నా ఉండరు"

"మరి వాళ్ళు పాల్గొనటంలేదా?"

రైతు ప్రశ్నలడిగే పెద్దమనిషికేసి అదోలా చూశాడు. మోర్చాని వ్యతిరేకించే మనిషేమో అన్నట్టు నిరసనగా చూశాడు.

"నువ్వీప్రాంతంవాడివి కావాయేం? ఒకవేళ ఇక్కడ పుట్టినా, ఈ ప్రాంతం విడిచిపెట్టి ఎక్కడో దూరంగా బతికినట్టున్నావ్. మా ఊరునుంచి ముప్పైమంది ఖన్నా అకాలీ కచేరీలో పేర్లు నమోదు చేసుకున్నారు. రోజూ ఖన్నా నడిచిపోయి మావంతు ఎప్పుడొస్తుందని అడిగి వస్తుంటారు. ఇప్పటికి ఏడుగురికి పిలుపు వచ్చింది. ముప్పైమందేం ఖర్మ అక్కర పడితే మొత్తం దూకుతారు"

"పనిచేసేవాళ్ళంతా జైళ్ళకెళ్ళి కూర్చుంటే వరిపైరు గతేంటి?"

"కాలవలో నీళ్ళు లేకపోతే, కరెంటు లేకపోతే, పంపు సెట్టుకి డీజిల్ లేకపోతే, పైనుంచి వానలు పడకపోతే ఏమవుద్దో అదే అవుద్ది. మురుగువానలు పడీపడి కంకులెళ్ళకపోతే ఏమవుద్దో అదే అవుద్ది"

"మోర్చా ప్రాముఖ్యమేంటో మీకు బోధపడిందా?"

రైతు అతనికేసి విసురుగా చూశాడు. ఒక్కక్షణం తమాయించుకుని, "మోర్చా అంటే మోర్చాయే. గురుమహారాజ్ మోర్చా" అన్నాడు. ఇంకా సంభాషణ పొడిగించటం ఇష్టంలేక మొహం తిప్పుకున్నాడు.

పంజాబులో వాతావరణం ఇలా మారిపోయింది. జనం పోరాటపు ఊపులో ఉన్నారు. వాళ్ళు ఏ లాజిక్కూ వినే స్థితిలోనూ లేరు. ఏమిటి, ఎందుకు అని అనవసరపు ప్రశ్నలు వెయ్యకుండా

గుడ్డిగా సంపూర్ణ విశ్వాసంతో మోర్చాకు అంకితమైపోవటం సిక్కు ధర్మం. గురు గోవింద్‌సింగ్ మహరాజ్ అడిగిందే తడవుగా తలలు బలివ్వటానికి ముందు కొచ్చిన పంచప్యారేలమాదిరిగా వాళ్ళంతా ధైర్యంతో, విశ్వాసంతో తక్షణం తను త్యాగం చేయటానికి సిద్ధంగా ఉన్నారు.

ప్రభుత్వం పొగలు సెగలు కక్కు తోంది. కేంద్రం దేశ భద్రత కారణాల దృష్ట్యా చాలా ఆందోళన పడుతోంది. పంజాబు అతి సున్నితమైన సరిహద్దున వున్న రాష్ట్రం. రక్షణ బలాల్లో సిక్కులు అధిక సంఖ్యాకులు. కాబట్టి ఈ ఉద్యమం రక్షణ బలాల్లో ధిక్కార జ్వాలలు రేపే ప్రమాదం ఉంది. సమస్యని సత్వరం, సామరస్యపూర్వకంగా పరిష్కరించ డానికి కేంద్రప్రభుత్వం ఆసక్తి ప్రదర్శిం చింది. ముఖ్యమంత్రికి ఉద్వాసన చెప్ప టానికూడా సిద్ధపడింది. సిక్కు నాయకుల్తో సంభాషణలు జరపటానికి సంసిద్ధత ప్రకటించింది. దాంతో ప్రజల్లో ఆశాభావం మోసులెత్తింది. ముఖ్యమంత్రికి కసి పుట్టింది. అకాలీ నాయకత్వంలో అనుమానాలు రేకెత్తాయి. ప్రధానమంత్రి ఆహ్వానం అందింది కాబట్టి అకాలీ నాయకులు చర్చలకు అంగీకరించారు.

సంభాషణలు ఢిల్లీలో జరపటానికి నిర్ణయమైంది. సిక్కు డిమాండ్లని మొత్తంగా చర్చించడానికి అంగీకారం కుదిరింది. చర్చల్లో పంజాబ్ ముఖ్య మంత్రి పాల్గొనటానికి అకాలీ నాయకులు అభ్యంతరం తెల్పారు. కేంద్రం అందుకూ అంగీకరించింది. ఎదురులేని ముఖ్యమంత్రి కిది చెంపపెట్టు. కానీ అదే పొరపాటు. ముఖ్యమంత్రి అకాలీ ఉద్యమాన్ని కాల రాచి వెయ్యటానికి కంకణం కట్టాడు. చర్చలు భగ్నం కావటానికి ఎత్తులు వేశాడు. కార్యసాధన కోసం బ్యూరో క్రాట్లని రంగంలోకి దూకించాడు.




"దేశద్రోహికి మరణశిక్ష"

కొట్టొచ్చే ఎరుపురంగులో తాటి కాయంత అక్షరాలతో పెద్ద పెద్ద పోస్టర్లు... ఒక్కటి కాదు, వేలకు వేలు; రాష్ట్రరాజధాని చండీఘడ్‌లోనే కాదు, రాష్ట్రం నలుమూలలా అన్ని జిల్లా, తాలూకా, ఫిర్కా కేంద్రాల్లో... పోలీస్ స్టేషన్లు, హోటళ్ళు, సినిమాహాళ్ళు, మంత్రుల, సీనియర్ అధికార్ల నివాస భవనాలు, బస్‌స్టాపులు, రైల్వేస్టేషన్లు, ప్రముఖ ప్రైవేటు, పబ్లిక్ భవనాల గోడల మీద... ఎక్కడ చూసినా తెల్లవార్తూనే ప్రత్యక్షమయ్యాయి. ప్రతి నగ రంలో, పట్టణంలో వందల వేల పోస్టర్లు సెక్యూరిటీగార్డుల, రాత్రి గస్తీ దళాల కళ్ళుగప్పి అతికించబడ్డాయి. ఎలా జరిగిందిది? ఎలా... ఎవరికి తెలుసు?

దేశద్రోహికి మరణశిక్ష. ఏ దేశద్రోహికి మరణశిక్ష? ఎవరా దేశద్రోహి? ఎవరు న్యాయమూర్తులు? ఎవరిని ఉద్దేశించి ఈ నినాదం? జనం తత్తరపడి పోయారు. బిత్తరపోయారు. గడపదాటి అడుగు బైటికి వెయ్యటానికి జడుపు పుట్టింది. ఆఫీసుల్లో హాజరు పలచబడింది.




ఆస్పత్రులు రక్తరకాల రోగుల్తో కిటకిట లాడాయి. తలపోటు, నరాల ఒణుకు, ఒంట్లో వికారం వగైరా వగైరా ... గుండెజబ్బుల విభాగం పేషెంట్లతో పూర్తిగా నిండిపోయింది.

ముఖ్యమంత్రి నివాస భవనంలో మృత్యు నిశ్శబ్దం రాజ్యం చేసింది. వివిధ శాఖల పోలీసు అధిపతుల్తో సమావేశమైన ముఖ్యమంత్రి గది ఆయన గర్జనల్తో ప్రతిధ్వనించింది. పోలీసు అధిపతుల గుండెల్లో రైళ్ల పరుగెత్తుతున్నాయి.

"ప్రజల డబ్బుతో మేపబడుతున్న ఆంబోతుల్లారా! ఏమిటి మీ సంజాయిషీ?" కోపంతో పెట్రేగిపోతూ గద్దించాడు ముఖ్యమంత్రి.

పోలీసు అధిపతులు ముగ్గురూ నిశ్శబ్దంగా నిలబడిపోయారు.

"ఊఁ... చెప్పండి. ఇది డెమోక్రసీ కాకపోతే మీరీ ప్రభుత్వానికి తెచ్చిపెట్టిన కళంకానికి మీ తలలు బహిరంగంగా తీయిద్దును"

ముఖ్యమంత్రి కుర్చీలోంచి లేచి గదిలో విసురుగా పచార్లు మొదలెట్టాడు. ప్రధానమంత్రి కార్యాలయం నుంచి తాఖీదులు, సందేశాలు వచ్చే ఎర్రటి ఫోను గణగణ మోగింది. ముఖ్యమంత్రి రిసీవరు అందుకుని ఎదురుగా నిలబడ్డ ముగ్గురికేసి చూశాడు. వాళ్లు దూరంగా తప్పుకున్నారు. ఆయన దవడలు బిగబట్టి వింటున్నాడు. పరిస్థితిని అదుపులోకి తేవటం చాతకాకపోతే అనారోగ్య కారణాల మీద రాజీనామా సమర్పించమనే ప్రధానమంత్రి ఉత్తర్వుని ఆయన స్పెషల్ అసిస్టెంటు చల్లగా చెప్పాడు. 48 గంటల వ్యవధిలో ఏదో ఒకటి తేలిపోవాలి. ముఖ్యమంత్రి నీరసంగా ఫోను పెట్టేశాడు. పది సెకన్లలో మళ్ళీ తేరుకుని పోలీసు అధిపతుల్ని కేకేశాడు.

"రేపీవేళకల్లా ఈ చిక్కుముడి విప్పుతారో, మూటా ముల్లె సర్దుకుంటారో తేల్చుకోండి" అంటూ ముఖ్యమంత్రి వాళ్ళవేపు వీపు తిప్పి లోపలికి వెళ్ళిపోయాడు. పోలీసు అధిపతులు ముగ్గురూ అవమానంతో, కోపంతో, కృతనిశ్చయంతో బైటికి నడిచారు.

అకాలీదళ్ ఖాల్సా తీవ్రవాద కార్యకలాపాలకన్నా ఈ పోస్టర్లు ఇంకా తీవ్రమైన చెంపపెట్టులా తగిలాయి. ఇవి ప్రభుత్వ అశ్రద్ధని, అసమర్థతని, నిస్సత్తతని బట్టబయలు చేశాయి. వీటి వెనక ఎవరి హస్తమైనా వుండనీ, వాళ్లు ప్రభుత్వాన్ని వెంట్రుకకన్నా హీనంగా పరిగణించే బలవంతులనేది స్పష్టమైంది. ఇది అకాలీదళ్ ఖాల్సా పనే అయ్యుండాలని అనుమానించారు చాలా మంది. కాని లోగడ ఏ సంఘటన జరిగినా అది తామే చేశామని వాళ్లు ధైర్యంగా ప్రకటించారు. ఈసారి వాళ్లు మౌనంగా ఉండిపోయారు. అది వాళ్ళ తత్వం కాదు. విదేశ గూఢచారి సంస్థల మీదికి అనుమానం పోయింది. పంజాబులోని ప్రతిచిన్న టౌనుతో బైటి సంస్థలకు పరిచయం ఉండటం ఊహించలేని విషయం. తాలూకా, సమితి కేంద్రాల్లో సైతం బి.డి.ఒ., తాసిల్దారు, సివిల్‌సర్జన్, సబ్ డివిజనల్ మేజిస్ట్రేటు కార్యాలయాల గోడలమీద అతికించడమంటే బైటి సంస్థలవల్ల అయ్యే పని కాదు.

హోంసెక్రటరీ తక్షణం పోస్టర్లు తొలగించమని ఉత్తర్వులు జారీచేశాడు. సాయంత్రానికల్లా కనీసం ముఖ్యమైన




కార్యాలయాల గోడల మీంచి పోస్టర్లు తీసివేసే కార్యక్రమం ముగిసింది. రోడ్ల మీద నిలబడ్డ జనం ఆ పని చూస్తూ ఎకసక్కెంగా కేకలు, పిల్లి కూతలు వేశారు. నేరస్థుల్ని పట్టుకోడానికి మరుసటి రెండు రాత్రులు నిఘా వేశారు. అప్రమత్తంగా పహారా తిరిగారు. వందల మందిని పట్టుకుని హింసించారు. గుచ్చిగుచ్చి ప్రశ్నలు వేశారు. చిన్నచిన్న ప్రెస్సు యజమానుల్ని సైతం పట్టుకొచ్చి యమయాతనలు పెట్టారు. నేరస్థుల జాడ తెలీలేదు. మళ్లీ పోస్టర్లు కూడా గోడల కెక్కలేదు.

ప్రధానమంత్రి ఇచ్చిన 48 గంటల వ్యవధిలో ముఖ్యమంత్రి ఫలితాలు చూపించలేకపోయాడు. కాని ముసలాయన కాలాంతకుడు. కట్టకడపటి ప్రయత్నంగా ఆయన తన తురుపు ముక్క ప్రయోగించాడు. సంత్ థండర్ అత్యున్నత సలహాదారు బంగాసింగ్ అరెస్టుకి ఉత్తర్విచ్చాడు. అటువంటి చర్య రాష్ట్రమంతటా ప్రమాదకరమైన సంచలనం పుట్టిస్తుందని ఆయనకి తెలుసు. గగ్గోలు పుట్టనీ. ఆ పరి


స్థితిలో ప్రధానమంత్రి తనని పదవి
నుంచి తొలగించటం అసాధ్యం. అంత
మాత్రాన తన తొలగింపు శాశ్వతంగా
నిలిచిపోతుందని కాదు. కాస్త ఊపిరి
పీల్చుకోడానికి వ్యవధి దొరుకుతుంది.

అనుకున్నట్టుగానే బంగాసింగు అరెస్టు రాష్ట్రంలో గగ్గోలు పుట్టించింది. సంత్ భండర్ కోపంతో నిప్పులు కక్కాడు. అకాలీలు తిరుగుబాటు చెయ్యాలన్నంత తారస్థాయికి చేరారు. కేంద్రం కొయ్యబారిపోయింది. ఆ పరిస్థితిలో ముఖ్యమంత్రిని తొలగించటం అసంభవం. తొలగిస్తే, అకాలీల బలప్రదర్శనకు లొంగిపోయినట్లవుతుంది. సంత్ భండర్ శక్తి ముందు సాగిల పడ్డట్లవుతుంది. రాష్ట్రంలో అంతర్యుద్ధం ప్రజ్వరిల్లుతుందేమోనన్న భయంతో తక్షణ చర్యలు తీసుకోడానికి కేంద్రం వెనకాడింది. దేనికైనా ఇంకా కొంత వ్యవధి కావాలి.

ప్రభుత్వం పాట్లు అక్కడితో ఆగిపోలేదు. పెద్ద పెద్ద పట్టణాల్లో రాత్రులు సిక్కుల భజన కీర్తనల కార్యక్రమం ప్రారంభమైంది. నగరంలో ఒక్కచోట కాదు పెక్కుచోట్ల. లౌడ్‌స్పీకర్లు విజృంభించాయి. విచిత్రమేమంటే అన్ని పట్టణాల్లో భజనకీర్తనలు ప్రసారమయ్యే లౌడ్‌స్పీకర్లు మొత్తం ఏక కాలంలో పది సెకండ్ల పాటు హఠాత్తుగా నిలిచిపోయాయి. ఆ తరవాత అన్ని నగరాల్లో అన్ని దిక్కులనుంచి లౌడ్ స్పీకర్లు మొత్తం ఒక్కపెట్టున, ఒక్కుమ్మడిగా భయంకరంగా మోగాయి. "దేశద్రోహికి మ..ర..ణ శి..క్ష" పిక్కటిల్లిన ఆ మోత ఉక్కు సౌరంగాలగుండా ఉవ్వెత్తుగా ఉరికి వచ్చినట్టుగా ఉంది. ఆ రాత్రంతా అది వెంటాడుతున్నట్టే ఉంది. ఈతూరికూడా పోలీసులు తెల్లమొహాలు వేశారు.

జనానికి ప్రభుత్వం మీద విశ్వాసం పోయింది. ముఖ్యంగా వ్యాపారస్థులు, అందునా సిక్కేతర వాణిజ్య వర్గాలు పెట్టేబేడా సర్దుకుని రాష్ట్రం వదిలి వెళ్ళిపోవాలనే ఆలోచనలో పడ్డారు. వ్యాపారం పూర్తిగా మందగించి పోయింది. బైటి కొనుగోలుదార్లు కల్లోల ప్రాంతాలకేసి రావటానికే భయపడిపోయారు. ప్రభుత్వానికి తలవంపుగా ఉంది. ప్రజా విశ్వాసం కోల్పోతోంది. కేంద్రమే చక్రం అడ్డు వెయ్యాలి. అకాలీ నాయకుల్తో చర్చలు జరపటం కన్నా గత్యంతరంలేదు. చిట్ట చివరికి అందరికీ ఆహ్వానాలు వెళ్లాయి.

* * *

నసీబ్ కౌర్ దేశం విడిచి వెళ్ళింది. ఆవిడ పినతల్లి మరణశయ్య మీదఉంటే నసీబ్‌కోసం అర్జంటుగా పిలుపొచ్చింది. అధికారలాంఛనాలన్నీ పూర్తయి విమానం టికెట్లు,పాస్‌పోర్టు,వీసా ఇత్యాదులన్నీ సకాలంలో అందాయి. ఇదొక మాయ. నసీబ్‌కౌర్ తండ్రి డబ్బు,పలుకుబడి పుష్కలంగా ఉన్న ఓ బడాభూస్వామి. అకాలీదళ్ ఖాల్సాతో కూతురికి సన్నిహిత సంబంధాలున్న విషయమే ఆ తల్లిదండ్రులకి తెలీదు. పినతల్లిగా పిలవబడే ఆవిడ టర్కీ నుంచి కబురంపిన భోగట్టా వాళ్లకి అసలు తెలీదు. టర్కీ, భారత దేశాలు విద్యార్థుల్ని పరస్పరం మార్పిడి చేసుకునే కార్యక్రమం కింద తను టర్కీ వెళ్తున్నట్టుగా నసీబ్‌కౌర్ తండ్రికి తెలియబర్చింది. నిజానికి ఆ యాత్ర ఆఫ్ఘనిస్థాన్‌లోని కాబూల్‌తో ఆగిపోయింది. అక్కడ పాకిస్థాన్‌కు చెందిన అల్ ఫతా ఉద్యమ నాయకులు ఆమెని కలిశారు. కాబూల్ విమానాశ్రయంలో ఆమె ప్లేన్ దిగింది. ఆమె వేషంలో మరొకరు విమానం ఎక్కారు. ఆ మార్పిడి గమనించినవాళ్లు లేరు. అధికార్లకు అది గమనించటం ఇష్టం లేదు. వాళ్లకందిన ఆదేశాలవి. ప్రయాణంలో




ఆమెకు హఠాత్తుగా జబ్బుచేసింది. ఆమెని డాక్టరు దగ్గరకి తీసుకుపోయారు. ఆమెకి బదులుగా వెళ్లే అవిణ్ణి స్ట్రెచర్ మీద తెచ్చి స్లీపర్‌లో పడుకోబెట్టారు. ఆమెని మొట్టమొదట చూసినవాళ్లకి ఆ తరవాత అనుమానం కలిగే అవకాశం లేకుండా చేసేశారు.

కాబూల్ నగర శివార్లలో ఓ విశాలమైన పురాతన భవనంలో ఆమె ఓ గదిలో ప్రవేశిస్తూనే మేలిముసుగు పైకి తీసేసరికి "ఆదాబ్ అర్జ్ ఆపా!" అని అభివాదం చేశాడు మంజూర్ అహ్మద్. అతనికి 30 ఏళ్లుంటాయి. అందంగా ఉన్నాడు. అల్‌ఫతే నాయకుడతను.

"ఆపా...?నేనంత పెద్దదాన్ని కాను భయ్యా. దయచేసి నసీబ్ అని పిలవండి చాలు"

"అది మీ అభిప్రాయం ఆపా"

ఆమె మరింక వాదించలేదు. టీవచ్చింది ఇద్దరూ మౌనంగా చాయ్ సేవించారు.

దారి మళ్ళించిన భారత విమానాలు లాహోర్‌లో దిగటానికి పాకిస్థాన్ ప్రభుత్వం అనుమతి నిరాకరించిన అంశం ప్రస్తావిస్తూ ఆమె "ఎంచేతనంటారు మంజూర్ భయ్యా?" అనడిగింది.

"జియా ప్రభుత్వం కారణం"

"మరి మొదట్లో..."

"చూడండి. పౌర విమాన శాఖ సిబ్బందిలో మా మనుషులున్నారు. మొదటిసారి సహాయం చేసింది వాళ్లు. ప్రభుత్వానికా విషయం ఆలస్యంగా తెలిసింది. ఏమీ చెయ్యలేకపోయింది. తరవాత ఇండియా, రష్యాల ఒత్తిడి ఎక్కువ అయింది. మా ప్రభుత్వ సహకారం లేకుండా మా మనుషులు బయటపడి సహాయం చెయ్యాలంటే చాలా కష్టం. పైగా అది మాకిష్టంలేదు. పరిస్థితి ఇలా వుందని తస్నీమ్‌కు తెలియబర్చాం. దానికనుగుణంగా అతనెందుకు ప్రవర్తించలేదో నాకు తెలీదు"

"ఇప్పుడు నాకర్థమైంది. విమానం పేల్చివెయ్యటం కావాలతనికి. ప్రభుత్వాన్ని లొంగదియ్యటానికి విమానంలో ప్రయాణంచేసే అమాయకులందరూ చనిపోవాలనుకున్నాడు. ఫూల్‌ఫూల్"

"మీ భావం నాకు బోధపడింది. దానికి నేను మొదట్నుంచీ వ్యతిరేకిని. దానివల్ల ప్రచారం తప్ప ప్రయోజనం శూన్యం. అంచేత మేం వాటిజోలికి పోవటం లేదు. పాలస్తీనా విమోచన సంస్థ అటువంటి పనికి తెగించి చివర్లో చాలా దెబ్బతిన్నది. యావత్ ప్రపంచం పి.యల్.ఓని ఖండించింది"

"అయితే మనం ఏం చేద్దామంటారు?"

"ఒక అర్థవంతమైన పని చెయ్యాలి. అది ప్రభుత్వాన్ని గజగజ ఊపేసే అద్భుతమైన పనయి ఉండాలి"

"ఉదాహరణకు?"

"మీరు చెప్పండి"

"భయ్యా! నన్నిక్కడికి పిలిపించింది మీరు. అటువంటి పథకమేదో మీరే దాచిపెట్టి ఉంటారు. చెప్పండి. ఎందుకింకా కాలయాపన?"

మంజూర్ అహ్మద్ జేబులోంచి ఓ చీటీతీసి ఆమెకందించాడు. అందులో ఏముందో పైకి చెప్పవద్దంటూ సైగ చేశాడు. అది చదవటానికామెకి మూడు నిముషాలు పట్టింది. చదవటం పూర్తి కాగానే అతను చీటీ తిరిగి తీసేసుకున్నాడు. అగ్గిపుల్ల గీసి చీటీకంటించి ట్రేలో నలిపేశాడు. నసీబ్ ఈ తతంగాన్ని శ్రద్ధగా గమనించింది. వాళ్లు ఎన్ని జాగ్రత్తలు తీసుకుంటారో ఆమెకి అర్థమయింది. ఇక

నుండి తనుకూడా అంత జాగ్రత్తగా వ్యవహరించాలి.

నసీబ్ మూడవనాటికంతా తిరుగు ప్రయాణమయింది. విమానాశ్రయంలో ఒక ముసుగు దిగింది. మరో ముసుగు ఎక్కింది. ఆమె భారతదేశం తిరిగిరావటం ఎరిగిన ప్రాణిలేదు. కార్యాచరణదళంలో ఇద్దరికి మాత్రమే ఆమె విదేశాలు వెళ్ళి నట్లు తెలుసు. మిగిలినవాళ్ళకి ఆమె సమాధిలోకి వెళ్ళినట్టు మాత్రమే తెలుసు. తిరిగిరాగానే ఆమె సంత్ థండర్‌ని కలుసు కుందుకు స్వర్ణదేవాలయంలో ప్రవేశిం చింది. యథాప్రకారం సంత్ చుట్టూ ఆయన అంగరక్షకులు, సంహాదార్లు మూగి వున్నారు.

"సంత్‌జీ! తమతో ఏకాంతంగా మాట్లాడాలని వచ్చాను. ఇలా అడుగు తున్నందుకు నన్ను మన్నించాలి" అంది నసీబ్ చేతులు జోడించి.

సంత్ థండర్ జవాబు చెప్పేలోపే, మొలకి చిన్నతుపాకీ వేలాడే ఓ నడికారు వ్యక్తి జోక్యం కల్పించుకుని, "అసం భవం. నీకేమయినా మతిపోయిందా బీబీ! మాట్లాడదలిస్తే ఇక్కడే మాట్లాడు లేదా ఇంటికిపోయి వంటపని చూసుకో" అన్నాడు.

"ఆమెకోరినట్లే కానివ్వు బంగాసింగ్" అన్నాడు సంత్ థండర్ సౌమ్య మధుర స్వరంతో.

"సంత్‌జీ! ఇది బయటకి పొక్కితే?" అన్నాడు బంగాసింగ్ షాక్‌తిని.

సంజీత్ తన అంగరక్షకుల్లో ఒకర్ని దగ్గరికి రమ్మని సైగచేశాడు.

"సుఖాసింగ్! నన్ను చూడ్డానికి ఒక బీబీ వేచివుందని మైక్‌లో చెప్పు. కాబట్టి ఆమె నాతో ఏకాంతంగా మాట్లాడి వెళ్ళేవరకు ఎవ్వరూ లోపలికి రాకూడ దని ప్రకటించు"

డా. బంగాసింగ్! ఎదురుచెప్పాలను కునేలోపే సుఖాసింగ్ మైక్‌లో సంత్‌జీ చెప్పింది ప్రకటించాడు. హాల్లో నిలబడ్డ సిక్కులంతా సంత్‌జీముందు వినయంగా వంగి నిష్క్రమించారు. డా. బంగా కూడా వెళ్ళిపోబోతూ సవినయంగా శిరస్సు వంచటం మర్చిపోయి, అంత లోనే గుర్తుతెచ్చుకుని పశ్చాత్తాపభారంతో తలవంచి వేగంగా నిష్క్రమించాడు.

"ఇక చెప్పు బీబీ నసీబ్" అన్నాడు సంత్‌జీ హాల్లోంచి అందరూ వెళ్ళిపోయేక.

"సంత్‌జీ! మేం కొన్ని పనులు చెయ్యద లిచాం. తమ అనుమతి కావాలి"

సంత్‌జీ మౌనంగా ఉండిపోయాడు.

"మన ఆశయాన్ని ప్రపంచానికి తెలియజెప్పటానికి ఐక్యరాజ్యసమితికి ఒక ప్రతినిధిని పంపాలనుకుంటున్నాం"

"దానికి అభ్యంతరం ఎందుకుంటుంది? మన గురించి, మన పంథ్ గురించి, పంథ్ ఆశయం గురించి ప్రపంచానికి తప్పక తెలియాలి"

"రాజకీయాశ్రయంకోరే కొందరు సిక్కుల్ని మిత్రదేశాలకు పంపాలనికూడా అనుకుంటున్నాం"

"అది సిక్కు సంప్రదాయానికి అనుగుణ్యంగా లేదు. సిక్కు అన్నవాడు తనని రక్షించుకుంటాడు, ఇతర్లని రక్షిస్తాడు. అంతేకాని అతను రక్షణ యాచించడు బీబీ"

"దానివల్ల మన లక్ష్యానికి పుష్టి కలుగుతుంది సంత్‌జీ"

"గురుకృపగల సిక్కు ప్రతిష్ఠని దిగ జార్చే ఏ చర్యనీ నేను ఆమోదించను"

సంత్ కంఠంలో కాఠిన్యం ధ్వనిం




చింది.

నసీబ్ చప్పున విషయం మార్చింది.

"మరొక ముఖ్య విషయం సంత్‌జీ. ఖలిస్థాన్ కరెన్సీని విడుదల చేయాలను కుంటున్నాం. దానికి ముందు కరెన్సీ, పాస్ పోర్టు నమూనాల్ని విడుదల చెయ్యడం అవసరమనిపిస్తుంది. ఆవిధంగా ఖలిస్తాన్ ప్రవాస ప్రభుత్వం ఏర్పడబోతున్నదనే భీతి ఈ ప్రభుత్వానికి కలిగించాలన్నదే మా ఉద్దేశం సంత్‌జీ"

"అందులో వివాదాస్పదమైనదేముందీ? అలాగే కానివ్వు"

నసీబ్ వెంటనే పాస్‌పోర్టు, కరెన్సీ సమూనాల్ని బైటికి తీసింది. పాస్‌పోర్టు పైన సిక్కు చిహ్నం అంకితమై ఉంది. కరెన్సీ నోటు మీద ఓ పారశీక ద్విపద అచ్చయింది.

"దేగ్-ఓ-తేఘ్ ఫతా-ఓ-నుస్రత్
బేదరంగ్
యాఫ్త అజ్ నానక్ గురుగోవింద్
సింగ్"

[గురునానక్‌జీ నుంచి గురుగోవింద్ సింగ్ అన్నపాత్రని, ఖడ్గాన్ని (సమృద్ధినీ, అధికారాన్ని) సఫలతని, అనంత విజయాన్ని పొందాడు]

సంత్ థండర్ వాటిని చూసి చాలా ప్రశంసించాడు. ఆశీస్సులనుగ్రహించాడు.

మంజూర్ అహ్మద్ సూచించిన రహస్య పథకాన్ని సంత్‌జీకి వెల్లడించాలని నసీబ్ మనస్సు ఒక్కక్షణం ఊగింది. మళ్ళీ వెంటనే ఆ ప్రయత్నం విరమించుకుంది. దానికింకా చాలా వ్యవధి ఉంది. సమయం వచ్చినపుడు చెప్పడమే సముచితంగా ఉంటుందని సరిపెట్టుకుంది. సంత్‌జీ ఆశీస్సులు వేడి ఆమె సవినయంగా శలవు తీసుకుంది. హాలుబైట నిలబడ్డ డా. బంగాసింగ్ ఆమెకేసి ఉరుమురిమి చూశాడు. అతనిమాట చెల్లుబాటు కాని సందర్భం ఇదొక్కటే. అతను పూర్వాశ్రమంలో రాజకీయశాస్త్రంలో ప్రొఫెసరు. ప్రస్తుతం సంత్‌జీకి ప్రధాన రాజకీయ సలహాదారు. ఆవిధంగా అతను సంత్‌జీ సలహాదారులందర్లో పెద్ద. అతను లోపలికి వెళ్ళగానే సంత్ చిరునవ్వు నవ్వాడు. బంగాసింగ్ కళవళపడ్డాడు.

"బంగాసింగ్! నువ్వు కేవలం సలహాలిచ్చేవాడివే. ఆ సలహాల్ని ఆచరణలోకి మార్చగలిగినావిడ బీబీ నసీబ్. అలంకారప్రాయంగా నువ్వు మొలకు తగిలించుకున్న ఆ వస్తువుని ఎలా పేల్చాలో బహుశా నీకు తెలీకపోవచ్చు. కాని ఆవిడ ధర్మయుద్ధానికి వ్యూహం సిద్ధం చేస్తున్నది. బంగాసింగ్, మన గురుమహరాజ్ గురుగోవింద్‌సింగ్‌జీ సిక్కులు సర్వకాలాల్లో సదాసన్నద్ధులైన సైనికులుగా ఉండాలని వాంఛించాడు. సిద్ధాంతవేత్తలుగా ఉండాలని కాదు సుమా. అది నువ్వు మనసులో గుర్తు పెట్టుకున్నంత కాలం నీకు గురు అనుగ్రహం లభిస్తుంది"

సంత్‌జీ జాబితాలో తను ఎంత అల్పజీవో బంగాసింగుకు ఆ క్షణంలో అర్థమైంది. చప్పున తప్పు ఒప్పుకుని సంత్‌జీని క్షమాపణ వేడాడు. సంత్ వెండితో చేసిన సంకేతాత్మకమైన కృపాణంతో బంగాని స్పృశించాడు. బంగా మనస్సులో ఇగిరిపోయిన విశ్వాసం తిరిగి చిగురించింది. ఇప్పుడతని కళ్ళలో వెనకటి అహంకారం, గర్వం లేవు. పరిపూర్ణ నమ్రతాభావం, పవిత్ర భక్తి తొంగిచూస్తున్నాయి.

* * *

పంజాబులో ప్రతిపేటలో, ప్రతి బాటలో ప్రత్యక్షమై రాష్ట్రం మొత్తాన్ని గగ్గోలుపర్చిన పోస్టర్ల గొడవ, అర్ధ రాత్రివేళ అన్ని పట్టణాల్ని భీతావహంగా దద్దరిల్లజేసిన పోస్టర్ నినాదం సద్దుమణిగాయో లేదో ఖలిస్తాన్ కరెన్సీ, పాస్‌పోర్టు నమూనా ప్రతులు బాంబుల్లా విరుచుకుపడ్డాయి. అవి ప్రధానమంత్రికి, కేంద్ర దేశీయాంగ మంత్రికి, సెంట్రల్ పోలీసు ఏజెన్సీ డైరెక్టర్లకి, పంజాబు ముఖ్యమంత్రికి, ప్రధానకార్యదర్శికి, పోలీసు ఐ.జీ.కి పోస్టులో అందాయి. అదేరోజు జలంధర్, చండీఘడ్, ఢిల్లీ, కలకత్తా, బొంబాయి, మద్రాసు నగరాల్లో పత్రికాసంస్థలకి, సంపాదకులకి అందాయి. అనేక జాతీయ దిన పత్రికలు మర్రోజు ఆ ఫొటోల్ని ప్రముఖంగా ప్రచురించాయి. దేశంలో ఎక్కడ విన్నా ఖలిస్తాన్ కరెన్సీ చర్చే! భారతప్రభుత్వ కరెన్సీకి వాడిన కాగితం మీదే అవీ అచ్చయ్యాయి. ఆ ఒక్క పారశీక ద్విపదని మినహాయిస్తే అచ్చు నిజమైన నోట్లలానే ఉన్నాయి. ఇక పాస్‌పోర్టు ఆ ఒక్క సిక్కు చిహ్నం మినహా అచ్చు భారత ప్రభుత్వం జారీచేసిన పాస్‌పోర్టు మాదిరే ఉంది. సామగ్రి సరఫరా చేసిందెవరు? బ్లాకులు తయారు చేసిందెవరు? ఎవరు ముద్రించారు?ఎక్కడ ముద్రించారు? అంతా అయోమయం. భారత ప్రభుత్వం ఖంగుతింది. ఖలిస్తాన్ ఉద్యమాన్ని గురించి కంగారులేదు. దళ్‌ఖాల్సా తీవ్రవాద కార్యకలాపాల గురించి తల్లడిల్లటం లేదు. ఈ వ్యవహారం మొత్తంలో విదేశీ శక్తుల ప్రచ్ఛన్న హస్తం గురించే ప్రభుత్వం ఖంగుతింది.





పైగా అకాలీదళ్ ఈ రెంటితో తనకు సంబంధంలేదని ప్రకటించింది. సంత్ భిందర్ ఔననలేదు, కాదనలేదు. కేవలం మౌనంగా ఉండిపోయాడు.

ముఖ్యమంత్రి సంత్‌జీని అరెస్ట్ చేయిస్తానని బెదిరించాడు. అదేరోజు రాత్రి ముఖ్యమంత్రి నివాసభవనం మీద బాంబు పడింది. పోలీసు జీపు, ముఖ్యమంత్రి అధికార వాహనం నుగ్గయిపోయాయి. భవనం ముందుభాగంలో కిటికీ అద్దాలు తునాతునకలయ్యాయి. ముఖ్యమంత్రి బెదిరింపునకు దళ్‌ఖాల్సా చేతులు ముడుచుకుని కూర్చోలేదు. సంత్‌జీని ప్రభుత్వం తన ఇష్టం వచ్చినపుడు అరెస్టు చేయటానికి ఆయనేమీ నేరస్థుడు కాడు. ఆయన పట్ల ప్రజలకు అపరిమితమైన ఆరాధన. ఆయన దర్శనం కోసం వచ్చే భక్తులసంఖ్య ఇంకా పెరిగిపోయింది.

"సంత్ ఉత్తర్వుమీదే దుండగులు నా భవనం మీద బాంబు విసిరారు" అన్నాడు ముఖ్యమంత్రి పత్రికావిలేఖరుల గోష్ఠిలో.

"మీదగ్గర రుజువులుంటే ఆయన్ని ఎందుకు అరెస్టుచేయించరు!" అనడిగాడు ఓ విలేఖరి.

"ఆయన గురుద్వారా దాటి బైటికి అడుగుపెట్టినరోజు తప్పకుండా అరెస్టు చేస్తాం" అన్నాడు ముఖ్యమంత్రి జవాబుగా.

"ఇలా ఎన్నాళ్లు వేచివుంటారు?"

"ఎన్నాళ్లోకాదు"

"అంటే, ఆయనని అరెస్టు చెయ్యటానికి గురుద్వారాలో ప్రవేశిస్తారా?"

"అని నేను అన్లేదు"

"ఎన్నాళ్లో కాదంటే మీ భావం?"

"చట్టప్రకారం చర్యతీసుకోబడుతుందని దాని భావం"

"మీరు గురుద్వారాలో ప్రవేశించలేకపోతే, సంత్‌జీ గురుద్వారా దాటి

బైటికి రాకపోతే చట్టం చెయ్యగలిగే దేముంది?''

"వేచిచూడండి"

''ప్రభుత్వం ప్రజల్ని పరిరక్షించ డంలో విఫలమైందనేది మేం చూస్తూనే ఉన్నాం. నిష్కర్షగా చెప్పాలంటే, ప్రభుత్వం తననితాను రక్షించుకోలేక పోతోంది''

ముఖ్యమంత్రి నివాస భవనంపైన బాంబుదాడిని అన్యాపదేశంగా ఆక్షేపిస్తూ చేసిన వ్యాఖ్య అది.

"ప్రభుత్వం బలప్రయోగానికి దిగకుండా నిగ్రహం ప్రదర్శిస్తున్నది"

"అమాయకుల్ని ఎన్‌కౌంటర్ల ముసుగులో ఖతంచెయ్యటంలో ప్రభుత్వం నిగ్రహం ప్రదర్శించటంలేదు"

''ఆ ఆరోపణలో నిజంలేదు. ఒక్క ఉదాహరణ చెప్పండి. రాష్ట్రంలోని అత్యున్నత సంస్థద్వారా విచారణ జరిపిస్తాను''

''ఎంత అత్యున్నత సంస్థగానీ మీ అధీనంలో ఉన్నదేగదా!"

"నా మాటమీద మీరు విశ్వాసం ఉంచాలి''

"ఎన్‌కౌంటర్లన్నిటిపైనా న్యాయ విచారణ ఎందుకు జరిపించకూడదు?"

"దక్ఖాల్సాకి లొంగిపోయినట్లు ప్రజలు భావిస్తారు''

"న్యాయవిచారణవల్ల దక్ఖాల్సా తప్పుడు చర్యలు రుజువవుతాయి గదా!''

"మీ సూచన గురించి ఆలోచిస్తాను''

''ఇంకా జాప్యం చెయ్యకుండా తొందరగా చేయిస్తే మంచిది సర్" అన్నాడు ఓ సీనియర్ పాత్రికేయుడు.

పత్రికాగోష్టి ముగిసింది. ముఖ్యమంత్రి డీలాపడిపోయాడు. ఆ మర్రోజు ప్రతికల్లో వచ్చిన గోష్టి వివరాలు మరీ అన్యాయంగా ఉన్నాయి. ముఖ్యమంత్రి తక్షణం పౌరసంబంధాలశాఖ డైరెక్టరుని పిలిపించాడు. నిష్కారణంగా అతనిమీద నిప్పులు కక్కాడు. తనకి వ్యతిరేకంగా తలతిక్కగా రాసిన పత్రికలకి ఎడ్వర్టయిజుమెంట్లు బందుచెయ్యమనే ఉత్తర్వు ఒకటి పారేశాడు. పౌరసంబంధాలశాఖ డైరెక్టరు ముఖ్యమంత్రి ఉత్తర్వుని అమలుచెయ్యక పోగా తనని వేరేశాఖకి బదిలీచెయ్యమని అభ్యర్థన పంపాడు. అతను ఐ.ఎ.యస్. అధికారి. అతణ్ణి ఇంటికి పంపించడం ముఖ్యమంత్రి చేతుల్లో లేదు. మహాఅయితే, అతణ్ణి వేరేచోటికి బదిలీ చెయ్యగలడు. వేడి చల్లారాక ముఖ్యమంత్రి అతణ్ణి మళ్లీ పిలవనంపాడు. కింపటిరోజు వేడిలో ఇచ్చిన ఉత్తర్వుని వెనక్కి తీసేసు కున్నాడు. పత్రికలవాళ్లతో కయ్యానికి దిగి, కోరి కొరవితో తల గోక్కోవద్దని ప్రిన్సిపల్ సెక్రటరీ ముఖ్యమంత్రిగారికి సవినయంగా సలహా చెప్పాడు.

అంతలోనే కేంద్రంతో తంటావచ్చి పడింది. కేంద్ర దేశీయాంగశాఖ కార్య దర్శి పరిస్థితిని ప్రత్యక్షంగా పరిశీలన చేసేందుకు ప్రత్యేక విమానంలో వస్తున్నట్లు వర్తమానం అందింది. ప్రత్యక్ష పరిశీలన అంటే తనని ముఖ్యమంత్రిగా కొనసాగించటమా, మాన్పించటమా అనేదేనని ఆయనకి క్షణంగా తెలుసు. వెంటనే ప్రిన్సిపల్ సెక్రటరీ ఖురానాకు కబురెళ్లింది. ఖురానా రెక్కలు కట్టుకుని వాలాడు.

"ఒంట్లో బాగాలేదు. పొంగుతో కూడిన అంటు జ్వరం సోకినట్లు అనుమా నంగా ఉంది. నా కార్యక్రమాలన్నీ రద్దయినట్లు ప్రకటన ఇవ్వండి. పి.జి.ఐ.




డాక్టర్ని మెడికల్ బులెటిన్ ఇష్యూ చెయ్యమనండి. యూనియన్ హోం సెక్రటరీ హర్‌గోవింద్ జెలాఖ్‌కి అన్ని ఏర్పాట్లు చేయండి" అన్నాడు ముఖ్యమంత్రి.

ఖురానా ముఖ్యమంత్రి దగ్గర శలవు తీసుకుని సరాసరి ఇంటికొచ్చేశాడు. తనలో తను నవ్వుకున్నాడు. ముసలాయన మహా గడుసు పిండం! జెలాఖ్‌కి ముఖ్యమంత్రితో రేపటిదాకా భేటీ ఉండదు.




ఈలోగా జేలాఖ్ తను చెయ్యబోయే అతిథి మర్యాదల్తో మెత్తబడిపోతాడు. ఔరా, రాజకీయాలు....!

ఖురానా చప్పిన జేలాఖ్ సరదాల గురించి గుర్తుచేసుకున్నాడు. ఆయన షివాస్ రాయల్‌స్కాచ్ విస్కీ అంటే పడిచస్తాడు. సమస్యలేదు. ఆయన జలకాలాడ్డానికి సరిపోయినంత స్టాకుఉంది. సంగీత, నృత్యాలు ఆస్వాదించే సరసుడు, రసికుడు. కుమీ ఉండనే ఉంది. వయస్సు, అందం, అద్భుత నృత్యకళా నైపుణ్యం అన్నీ ఉన్నాయి. అన్నిటికన్నా మించి పైకి ఎగబాకాలనే ఆశ, ఆకలి ఉన్నాయి. భర్త సమాచారశాఖలో ఆఫీసరు. అతణ్ణి ఎలాగైనా రాజకీయాల్లో దింపి రాణింపుకు తేవాలనే కోరిక ఆమెలో బలీయంగా

నాటుకుంది. కాబట్టి ఇటువంటి ఛాన్సు దొరికితే వదులుకోదు. ఇక ఆయన్ని ఎక్కడ దింపితే బావుంటుంది? సర్క్యూట్ హౌస్‌లో లాభంలేదు. రచ్చవుతుంది. ఖురాన్ బ్యూరో పదునుగా పనిచేసింది. యస్... లేక్ వ్యూ బంగ్లా బేషుగ్గా ఉంటుంది. నగరానికి దూరం... బ్యూరోక్రసీకి అందుబాటులో ఉండదు. రాజకీయ రంగస్థలం రొద చెవి చేరదు.

ఖురానా చేసిన ఏర్పాట్లకు హోం సెక్రటరీ ముగ్ధుడైపోయాడు.

"సర్! ముఖ్యమంత్రిగారి అనుమతి తీసుకోకుండానే ఈ ఏర్పాట్లన్నీ చెయ్యటానికి స్వేచ్ఛ తీసుకున్నాను. దాన్ని గురించి నేను చూసుకుంటాను. రేపటి దాకా మీకు టైము ఉంది కాబట్టి హాయిగా రిలాక్సవండి. వంటవాడు నాదగ్గర పది హేనేళ్ళుగా పనిచేస్తున్నాడు. చాలా నమ్మకస్థుడు. డ్రైవరు కూడా పదేళ్ళుగా నా దగ్గర పని చేస్తున్నాడు. మహావిశ్వాసపాత్రుడు. ఒక్క కుమీశర్మ తప్పించి మిమ్మల్ని డిస్టర్బ్ చెయ్యటానికి వచ్చే వాళ్ళు లేరు. ఆమె ఒక్కత్తే వస్తుందిసర్. టేప్ మ్యూజిక్ పెట్టుకుని డాన్సు చేస్తుంది. టేపులు ఆమె దగ్గరే ఉన్నాయి"

"గుడ్. నేను ఢిల్లీ తిరిగి వెళ్ళే ముందు నీతో ఒకక్షణం మాట్లాడాలి"

"యస్ సర్" ఖురానా గాల్లో తేలిపోతూ నిష్క్రమించాడు.

మర్రోజు జెలాఖ్ ముఖ్యమంత్రి కోరిన రీతిలో నివేదిక తయారుచేశాడు. స్థానిక తీవ్రవాద ముఠాల్ని రెచ్చగొడుతూ విదేశీ హస్తం ప్రచ్ఛన్నంగా పనిచేస్తోందని ఆయన నివేదికలో రాసుకున్నాడు. ముఖ్యమంత్రి ఊపిరి పీల్చుకుందుకు కొంత వ్యవధి కలిసివచ్చింది. కాని ఆయన పొందిన మనశ్శాంతి 24 గంటలు గడిచేసరికి మాయమైంది. అకాలీదళ్ ఖాల్సా ఖతం చెయ్యదల్చుకున్న జాబితా విడుదలయింది. ఆ జాబితాలో అతిగా వాగే కాంగ్రెస్ మంత్రులు, ఉన్నతాధికార్లు, నిరంకారీ నాయకులు, పాత్రికేయులు, సంపాదకుల పేర్లు ఉన్నాయి. ముఖ్యమంత్రికి ఆ జాబితాలో తన పేరు లేనందుకు ఆగ్రహం వచ్చింది. సంత్ ఫండర్ తనని హత్యచేయించటానికి కుట్ర చేస్తున్నాడని పదేపదే చేసిన ఆరోపణలో పస చచ్చిపోయిందే అని ముఖ్యమంత్రి కుళ్ళిపోయాడు. వెంటనే సంత్ ఫండర్ని, ఆయన సలహాదార్లనీ అరెస్టు చెయ్యటానికి వారెంట్లు జారీచేయించాడు.

ఆ అరెస్టు వారెంట్ల వార్త బైటికి పొక్కటంతో రాష్ట్రంలో గగ్గోలు పుట్టింది. సంత్ అభిమానులు యావన్మంది ఎక్కడపన్లు అక్కడ కట్టిపారేసి అప్పటికప్పుడు హుటాహుటి అమృత్ సర్‌కు ప్రయాణం కట్టారు. విచిత్రమేమంటే ఉద్యమం ప్రారంభమైన ఇన్నాళ్ళ తరవాత మొట్టమొదటిసారి మహిళాలోకం విజృంభించింది. సంత్‌జీ నిర్బంధాన్ని ఆపుచెయ్యటానికి ఆడవాళ్ళు చెంగులు బొడ్లో దోపి అమృత్‌సర్ చలో అంటూ సాగారు.

గురుదాస్‌పూర్ జిల్లాలో ధోడా గ్రామంలో భాగ్‌సింగ్ తల్లి డెబ్బైయేళ్ళ సదాకౌర్ మూటాముల్లె కట్టి అమృత్ సర్ ప్రయాణమైంది. తలకి పాగా బిగించింది. భుజంమీదుగా క్రాస్‌బెల్టు వేసుకుంది. బెల్టులో కృపాణం పెట్టుకుంది. కొడుకు భాగ్‌సింగ్ తల్లి వేషం, ధోరణి చూసి విస్తుపోయాడు. తన భార్య ప్రీతికౌర్ తల్లి మనస్సు నొప్పించిందేమోనని




తల్లడిల్లిపోయాడు.

"అమ్మా! ఈవాళ నువ్వు మాయ్ భాగోలా ఉన్నావు" అన్నాడు భాగ్ సింగ్ ఆమెని మెప్పించటానికి.

"ఆమెలాగా అగుపడనేమోగాని ఆమె ఆవేశం నేను మోసుకుపోతున్నాను బాబూ" అంది సదాకౌర్.

"కాని నీ మనస్సు సంతోషపర్చ టానికి ఈవాళ గురుగోవింద్‌సింగ్‌జీ లేడుగా అమ్మా" అన్నాడు భాగ్‌సింగ్.

"సంత్ థండర్ ఉన్నారుగా"

భాగ్‌సింగ్ అదిరిపోయాడు. అంటే తన తల్లి సంత్‌థండర్‌తోపాటు అరెస్టు కావటానికి వెళ్ళబోతోందన్నమాట. ఒక తమ్ముడు ఐ.ఎ.యస్. ఆఫీసరు, మరో తమ్ముడు సైన్యంలో జనరల్, తను గ్రామ సర్పంచి.ఇరవైఎకరాల సుక్షేత్రం, ట్రాక్టరు, జీపు. ఒకేఒక తోబుట్టువు. డాక్టరు, బావ లీడింగ్ లాయరు. తన తల్లికి ఏం తక్కువైందని పొలోమని అమృత్‌సర్‌కి బైల్దేరుతోందో భాగ్‌సింగ్‌కు అర్థంకాలేదు.

"అమ్మా! నువ్వు చేసేది పచ్చి పిచ్చి పని" అన్నాడు భాగ్‌సింగ్ చిరాకు పడుతూ.

"నీకు అలా అనిపిస్తుంది. ఇది నా గురుమార్గం"

"అమ్మా! దీనివల్ల నీ బిడ్డల ఉద్యోగాలకు ఎసరొస్తుంది. నీ బిడ్డలు ఉద్యోగాలు పోగొట్టుకుని అవమానాలపాలు కావటం నీకిష్టమా?"

"పంథ్‌కోసం గురువులు ఇంతకన్నా ఘోరమైన కష్టాలు పడ్డారు"

"అమ్మా! నే చెప్పేది నీకర్థంకాదు. నువ్వంటే మా అందరికీ ఎంతో అభిమానం, అపేక్ష. నీ బదులు నేను వెళ్ళి అరెస్టవుతా. నువ్వు మాత్రం ఇల్లు కదలొద్దమ్మా"

"నేను ఏం నిర్ణయించుకున్నానో నిర్ణయించుకున్నాను. నీ తల్లి మనస్సుకు విరుద్ధంగా ఇంకేం మాట్లాడకు. గురు మహరాజ్ పేరుమీద నిన్ను క్షమిస్తున్నాను. అయినా క్షమించటానికి నేనెంత దాన్ని. హేయ్! భగవంతుడా... నా దశమగురువు గోవింద్‌సింగ్‌జీ! నేను నాలిక జారినందుకు నన్ను క్షమించు. బాబూ...ఆ గురువులే నిన్ను క్షమిస్తారు. మరేమీ మాట్లాడకు. బోలే సోనిహాల్ - సత్‌శ్రీఅకాల్"

సర్దారిణి సదాకౌర్ సంచి భుజానికి తగిలించుకుని గడపదాటింది. భాగ్‌సింగ్ తల్లివెంట బైటికి నడిచాడు. అయితే అమృత్‌సర్‌కి కాదు–టెలిగ్రాఫ్ ఆఫీసుకు. జలంధర్‌లో డెప్యూటీ కమిషనర్‌గాఉన్న తమ్ముడికి తల్లి ప్రయాణం గురించి తంతి ఇవ్వటానికి.

అన్న ఇచ్చిన టెలిగ్రాం అందుకుని గురుమోహన్‌సంగ్ అమృత్‌సర్ పరుగెత్తుకొచ్చాడు. స్వర్ణ దేవాలయంలో అకాల్‌తఖ్ వేపు దారితీశాడు. సంత్‌జీ బసచేసే మేడగది మెట్లవరస కింద సదాకౌర్ మార్షల్‌లాగా నిలబడివుంది. మూడడుగుల కత్తి ఆమె చేతిలో మెరుస్తోంది. గురుమోహన్‌సింగ్ వినయంగా తల్లి పాదాలు స్పృశించాడు.

"అమ్మా! ఇది నీకు తగిన పనికాదు. నిన్ను పోగొట్టుకోలేం" అన్నాడు గురుమోహన్‌సింగ్ నెమ్మదిగా.

"గురుమహరాజ్ గురుగోవింద్ సింగ్ పంథ్ కోసం నలుగురు బిడ్డల్ని పోగొట్టుకున్నాడు. మీరు ఒక్క మీ అమ్మనే పోగొట్టుకుంటారు. బాబూ....

నువ్వు గర్వపడాలి"

గురుమోహన్‌సింగ్ మరింక మాట్లాడ లేకపోయాడు. తల్లి దృఢనిశ్చయంతో ఉంది. ఎవరెన్ని చెప్పినా ఆమె సంకల్ప బలం సడలదు. అసలు సిక్కు అంకురమే అటువంటిది. కష్టాలు, కడగళ్లు, లేమి వాళ్లకి మృష్టాన్నం. నెత్తురొలికించటం వాళ్లకిష్టం. ఇతర్ల నెత్తురు కాదు, శత్రువుల నెత్తురు కాదు-తమ స్వీయ రక్తం. స్వధర్మం కోసం తనుత్యాగంలో విశ్వాసం కలిగిన వంగడం వాళ్లది.




రాష్ట్రం నలుమూలల నుంచి సంత్ థంపర్ భక్తులు ప్రవాహంలా వచ్చి పడి అమృత్‌సర్‌ని ముంచెత్తారు. ఆ ప్రవాహాన్ని ఆపటం అధికార్ల వల్ల కాలేదు. అమృత్‌సర్ వచ్చే బస్సుల్ని మధ్యలో వెనక్కి తిప్పిపంపాలని చేసిన ప్రయత్నాలు బెడిసికొట్టాయి. జనం రెచ్చిపోయి రెండు ప్రభుత్వ బస్సులకు నిప్పంటించారు.

గ్రామాల్లో జనం మీద నిర్బంధాలు మోపయ్యాయి. రుణాలు తీర్చమని ఒత్తిడి ఎక్కువైంది. ఎరువుల పంపిణీ నిలిపేశారు. అధిక దిగుబడి వంగడాలు పంపిణీ కాలేదు. పొలాలు బీడు పెట్టమని సంత్‌జీ ఆదేశాలు జారీ చేస్తున్నాడని వదంతులు పుట్టాయి. అదే జరిగితే సర్వనాశనం.

కేంద్రానికి కనువిప్పయింది. స్వయంగా చుక్కాని పడితే గాని నావ దరిచేరే ఉపాయం కనిపించలేదు.

* * *

జైల్‌సింగ్ సాంధ్యా తనని కలుసుకోవాలని వచ్చాడని పి.ఎ. చెప్పగానే ముఖ్యమంత్రి కొంచెం కంగారుపడ్డాడు. సందర్శకులు ముఖ్యమంత్రిని కలుసుకునే సమయం కాలేదింకా.

"ఏం పని మీద వచ్చిందీ చెప్పాడా?"

"లేదు సర్! కదిలిస్తే కరిచేట్టున్నాడు"

"సరే... లోపలికి పంపు"

"ఇక్కడికా సర్!" పి.ఎ.విస్తుపోతూ అడిగాడు. ముఖ్యమంత్రి అప్పుడు పడకగదిలో ఉన్నాడు.

"అవును. ఇక్కడికే" అన్నాడు ముఖ్యమంత్రి కటువుగా. పి.ఎ. గడగడలాడ్తూ గదిలోంచి పరుగుతీశాడు.

"రా,రా జైల్‌సింగ్. నువ్వు రావటమే గొప్ప ఆశ్చర్యం" అన్నాడు ముఖ్యమంత్రి మంచం దిగి లేచి నిలబడి చెయ్యిచాస్తూ.

జైల్‌సింగ్ కడ్డీలా నిటారుగా నిలబడి, చాచిన చెయ్యికేసి చూడనైనాలేదు.

"రా, కూర్చో. ఏవిటి విశేషం?"

"నా పాతమిత్రుడిమీద చెయ్యెత్తే అవకాశం లేకుండా నన్ను ఉరి తీయించు"

"ఏవిటా పిచ్చి మాటలు జైల్‌సింగ్! చెప్పేదేదో సూటిగా చెప్పు"

"నా కొడుకు బక్షీ గురించి వచ్చా. నువ్వు వాణ్ణి పెంపు తీసుకుందామనుకున్నావ్! లేదా నీ కుటుంబంలో పిల్లనిచ్చి వాడికి పెళ్లి చేద్దామనుకొన్నావ్"

"నువ్వు ఊఁ అంటే ఇప్పటికి నేను సిద్ధమే"

జైల్‌సింగ్ ఆ గది దద్దరిల్లేలా దగ్గాడు.

"అయితే చట్టం ప్రకారం రాతకోతలు పూర్తి చెయ్యటానికి ఇప్పటికీ తయారుగానే ఉన్నానంటావ్ గ్యానీ. ఇప్పుడెట్లా సాధ్యమవుతుంది? నువ్వు సరేనన్నా చట్టం ఒప్పుకోవద్దూ?"

"స్పష్టంగా చెప్పు జైల్. బక్షీ ఎక్కడున్నాడు? ఏం చేస్తున్నాడు?"

"నీ యూనిఫారం గూండాలు వాణ్ణి నిన్న రాత్రి పట్టుకుపోయారు. వాళ్లనే అడుగు"

"బక్షీ ఏంతప్పు చేశాడు?"

"వాడు నాకు కొడుకుగా పుట్టిన తప్పుకి, నువ్వు నాకు పాత మిత్రుడివని తెలవని తప్పుకి"

"ఆగు ఇప్పుడే కనుక్కుంటాను" ముఖ్యమంత్రి తన ఆఫీసుగదిలోకి పరిగెత్తి ఫోనెత్తాడు. బక్షీ గురించి ఉన్నపాటున సమాచారం తెలియపర్చమని ఐ.జి.ని ఆదేశించాడు. ఒక్కక్షణం బక్షీ ఆయన మనస్సులో మెదిలాడు. ఒకప్పుడు తన మనస్సు దోచుకున్న ముద్దుల పసికందు. "నాకిచ్చేయ్ యూ.నే పెంచుకుంటా" అనడిగాడు తను. జైల్‌సింగ్ ఒప్పుకోలేదు. ఒక్కగానొక్క బిడ్డడిని పెంపకానికివ్వటం అతనికిష్టం లేకపోయింది. కనీసం తనకె ఆడపిల్ల పుడితే అతనికే కట్టబెట్టాలనుకున్నాడు. కానితనభార్య సంతానభాగ్యానికి నోచుకోలేదు. తను పెద్దయ్యాక డాక్టరై పల్లెల్లో పేద ప్రజలకి సేవచేస్తాననేవాడు. తెలిసీ తెలీని వయస్సులో చేసిన వాగ్దానం నిలబెట్టుకుందుకు మెడిసిన్ చదివాడు. ప్రస్తుతం యమ్.డి. చేస్తున్నాడు.

టెలిఫోన్ మోగింది. చప్పున ఎత్తాడు. మరుక్షణం రిసీవరు చేతుల్లోంచి జారి పడింది. ఆ ఉదయమే నక్సలైట్ జైల్‌సింగ్ కొడుకు గురుబక్షీసింగ్ పోలీసుల్తో జరిగిన ఎన్‌కౌంటర్లో మరణించాడని ఐ.జీ. చావుకబురు చెప్పాడు. అమాయక సిక్కుయువకుల హత్యల్లో వాస్తవం ఉంపన్నమాట! జాలువారే గడ్డం, నీలం, నలుపు, పసుప్పచ్చ తల పాగలు ధరించిన వాళ్లనల్లా కీర్తనీదళ సభ్యులని పోలీసులు అనుమానించారనేది ముఖ్యమంత్రికి అప్పుడు బోధపడింది. కట్టలు తెంచుకున్న ఉద్రేకాన్ని కప్పిపుచ్చుకోడానికి కింది పెదవి కొరుక్కుని చీఫ్ సెక్రటరీని ఫోన్‌లో పిలిచాడు. ఎన్‌కౌంటర్ల పేరుతో జరిగే మారణకాండ గురించి చీఫ్ సెక్రటరీ మీద అమాంతం ఎగిరిపడ్డాడు. వాస్తవాలు తనదాకా రాకుండా మభ్యపెడుతున్నందుకు చడమడా చీవాట్లు పెట్టి ఐ.జి.పి.ని తక్షణం అక్కణ్ణుంచి ఊడబెరికి వేరే వ్యక్తిని వెయ్యమని హుకుం జారీచేశాడు. అవతలివేపు నుంచి నీళ్లు నమలటం వినిపించింది. "నేను పట్టించుకోను. ముందు నేను చెప్పింది చెయ్యండి" అన్నాడు ముఖ్యమంత్రి కటువుగా.

మళ్లీ మామూలు మనిషి కావటానికి ఆయనకి ఓ అరనిమిషం పట్టింది. నెమ్మదిగా పడగ్గదిలోకి వచ్చాడు.

"వెంటనే వాకబు చెయ్యమని డి.ఐ.జి.కి ఆర్డరిచ్చాను. యస్పీని తక్షణం బదిలీ చెయ్యమని ఉత్తర్వు చేశాను" అన్నాడు ముఖ్యమంత్రి గదిలోకి వస్తూనే.

"చనిపోయినవాడిస్థానంలో బతికున్న వాణ్ణి ఎపడినేనా పెట్టమనికూడా ఆర్డరు వేశావా?" అన్నాడు జైల్‌సింగ్ తొణక్కుండా.

హేయ్, భగవాన్? అసలుసంగతి

ఏడికి తెలుసన్నమాట! ముఖ్యమంత్రి గ్యానిదీప్‌సింగ్ మనస్సులో బెరుకు పుట్టింది. బక్షి మరణవార్తవింటూ తనే సంభించిపోయాడు. బక్షికి చదువుతప్ప వేరేయావ లేదని తనకి తెలుసు. ఏం చెప్పాలో తోచక నిరుత్తరుడై నిలబడిపోయాడు.

"గ్యానీ! నువ్వు మళ్ళీ నన్ను హింసామార్గం వేపు తోసేస్తున్నావని చెప్పటానికే ఈరోజు నీదగ్గరకొచ్చాను. ఆ దోవనుంచి తప్పుకుని నా మడి నేను దున్నుకుంటూ నా సంసారం నేను దిద్దుకుంటూ గడుపుతున్నాను. కాని నువ్వు మళ్ళీ నన్నా మార్గంలోకి బలవంతంగా తోసేశావు. ఇంకా నేనెవరికోసం బతకాలి? గుడ్‌బై గ్యానీ. భగవంతుడు నీకు మేలుచేస్తాడు" జైల్‌సింగ్ సుడిగాలిలా బైటికి దూసుకుపోయాడు. ముఖ్యమంత్రి గ్యాని దీప్‌సింగ్‌కి హఠాత్తుగా వణుకు పుట్టింది. ఆయన గుండె దడదడలాడిపోయింది. తనమీదికి సూటిగా గ్రెనేడు విసిరిన రోజుకూడా ఇంతటిపడ పుట్టలేదు. గ్రెనేడు తన ఛాతీకి తగిలినాగాని పేలలేదు. జైల్‌సింగ్ ఏ అఘాయిత్యానికి తలపడతాడో అని ఆయన భయపడిపోయాడు. అతను హైస్కూల్లో, కాలేజీలో చదువుకునే రోజుల్లోనే కమ్యూనిస్టు, పైగా తీవ్రవాది. అతనివి నిర్దాక్షిణ్యమైన పద్ధతులు. అతనొక్కడూ దక్‌ఖాల్సాలో సగంపెట్టు. ఈ స్థితిలో అతణ్ణి స్వేచ్ఛగా వొదిలెయ్యటం ప్రమాదం. గ్యానీ దీప్‌సింగ్ వెంటనే తన సెక్రటరీకోసం బజర్ నొక్కాడు.

"కొత్త ఐ.జి.పి. ఎవరైనాగానీ జైల్‌సింగ్‌ని వెంటనే నిర్బంధంలోకి తీసుకోమని నా ఆర్డర్‌గా తెలియజెయ్యి. మళ్ళీ నా ఉత్తర్వు అందేవరకు అతను విడుదల కాగూడదు. నిర్బంధంలో అతనికెటువంటి హాని జరక్కూడదని కూడా తెలియజెయ్యి"

ఆ తరవాత నాలుగ్గంటలకి గ్యానీకి సమాచారం అందింది. ముఖ్యమంత్రి స్వగ్రామంలో ఆయన ఇంటిమీద బాంబు పేలి దగ్ధమైపోయింది. ఆయన తండ్రి మంటల్లో కాలి మరణించాడు. ప్రహరీ గోడమీద 'ఎక్స్' ఆకారంలో రెండు ఎముకలు, వాటిమీద పుర్రె నిలిపిన మృత్యు సంకేతం చిత్రించబడింది.

గ్యాని దీప్‌సింగ్ దీర్ఘంగా నిట్టూరుస్తూ పడగ్గదిలోకి తూలూ వెళ్ళాడు. అది జైల్‌సింగ్ జండా గుర్తని ఆయనకి అర్థమైపోయింది. ఆయన మంచంమీద వాలిపోయి ఏడ్చేశాడు. తన తండ్రి పోయాడని కాదు— బక్షి కోసం, వయస్సు పైబడ్డాక ఇటువంటి దుర్గతి ప్రాప్తించిన జైల్‌సింగ్ కోసం ఆయన విలపించాడు. ఇక ఇప్పుడు జైల్‌సింగ్ హింసామార్గం నుంచి తప్పుకోడని ఆయనకి తెలుసు. అతనిప్పుడు చంపుతాడు, విధ్వంసకాండ సాగిస్తాడు. అతనూ ఆ విధ్వంసానికే బలైపోతాడు. తన చేతులు బక్షి నెత్తురుతో రక్తసిక్తమైపోయాయన్న క్షోభ, ఆవేదన ఆయన్ని పట్టిపీడించాయి. ఏదెలా జరగాలో అలా జరుగుతుంది. జైల్ ఆపుతె పోతాడు. అతణ్ణి మృత్యువు వెన్నంటే వుంది. అతను మరణించబోతున్నాడనే భావన మనస్సుని పట్టి కుదుపుతోంది. ఆ భావనతో పాటు మనస్సుని నమిలేసే బాధ, వేదన. అది డాక్టర్లకి అందని బాధ, మందులకు లొంగని నొప్పి. ఆ నొప్పి సిలువ లాంటిది. శరీరాన్ని, మనస్సుని నలగ్గొట్టే రాకాసి సిలువ ... కాని దాన్ని తను మోయక తప్పదు.







అదేరాత్రి నగరం నడిబొడ్డులో ఫగ్వారా పోలీస్ స్టేషన్ మీద రెండు బాంబులు పేలాయి. ఆరడజను మంది పోలీసులు తీవ్రంగా గాయపడ్డారు. ఆయుధాల్లో సగం బూడిదయ్యాయి. పోలీసులు కోపంతో పిచ్చెక్కిపోయారు.

ఆ తరువాత ఒకటి రెండురోజులు అచ్చు అలాంటి సంఘటనలే నగరంలో పునరావృతమయ్యాయి. కొంత ప్రాణ నష్టం సంభవించింది. అకాలీదళ్, సంత్ థండర్, అకాలీ దళ్ ఖాల్సా, ఇంకా ఇతరేతర అనుబంధ సంస్థలు ఆ సంఘటనల్ని నిర్ద్వందంగా ఖండించటం జరిగింది. వీటన్నిటికీ కారకుడెవరో ముఖ్యమంత్రికి స్పష్టంగా తెలుసు. కాని, ఇవన్నీ అకాలీ దళ్ ఖాల్సా జరిపిన దురంతాలేనని ఆయన పాటపాడాడు.

ప్రధానమంత్రికి, అకాలీ నాయకులకు మధ్య సంభాషణలు జరిగే భవనం మీద బాంబు విసిరే ప్రయత్నమే జైల్‌సింగ్ హింసోన్మాదపు అంతం చూసింది. కేంద్ర ప్రభుత్వ బలాన్ని అతను తక్కువ అంచనా వేశాడు. కేంద్ర పోలీసు సంస్థల నిఘాని, కేంద్ర గూఢచారుల చాతుర్యాన్ని, చాకచక్యాన్ని అంచనా కట్టడంలో అతను పొరపడ్డాడు. పంజాబులో విజృంభించాడంటే అదివేరు. అక్కడ జనసమ్మర్దం జాస్తి. తప్పించుకుపోయే మార్గాలు కోకొల్లలు. పంజాబులో ప్రజల్లో కలిసిపోయి పోలీసుల కన్నుగప్పటం సులువు. ఎందుకంటే ఎక్కువ మంది సిక్కులు అందరూ ఆ తలపాగాల్లో, గడ్డాల్లో ఒకేమాదిరి కనిపిస్తారు. పైగా పంజాబులో బ్రిటిష్ వాళ్ళ కాలంనుండి పోలీసులంటే ప్రజలకి సద్భావం లేదు. లూటీ చేసినవాడు కళ్ళెదుటే వున్నా, పట్టుకోడానికొచ్చినవాడు పోలీసువాడయితే నేరస్థుడి వైపు వేలెత్తి చూపించరు.

ఢిల్లీ వాతావరణం వేరు. జైల్‌సింగ్ తన కర్తవ్యం పూర్తి చేసేలోపే ఇండియా గేటు లాన్సులో గూఢచారులతణ్ణి పసిగట్టారు. జైల్‌సింగ్‌కు తను తల పెట్టిన కార్యం పూర్తి చెయ్యటానికి పార్లమెంటు భవనం ఆవరణలోకి ప్రవేశించాలనే ఉద్దేశం లేదు. గ్రెనేడుని వెయ్యి గజాల దూరం వరకు విసిరెయ్యగల ఓ వడిశెల తయారుచేశాడతను. నిలబడి విసరటానికి అనువైన జాగా కోసం గాలిస్తూ పోలీసుల దృష్టిలో పడ్డాడు. చప్పున వాళ్ళతణ్ణి చుట్టుముట్టేశారు. అతను మహానేర్పుగా పోలీసు వలయంలో మధ్యలో నిలబడ్డాడు. చుట్టూరా నిలబడ్డ పోలీసుల్లో ఒక జట్టు అతణ్ణి సమీపిస్తోంది. అతను వదులుగా వేసుకున్న షరాయి అడుగున బెల్టుకు కట్టిన గ్రెనేడు పిన్నుని తాపీగా లాగాడు. పోలీసులు అతని మీద విరుచుకు పడేసరికి గ్రెనేడు పేలింది. ఆరుగురు కానిస్టేబుళ్ళు తునాతునకలై పోయారు. వాళ్ళతోపాటే జైల్‌సింగ్ నుగ్గయిపోయాడు. అతను తన కొడుకు హత్యకి ప్రతీకారం తీర్చుకున్నాడు. అతను గ్రెనేడు పేలి తునాతునకలై పోయాడన్న వార్త విన్నప్పుడు గ్యానీ

దీప్‌సింగ్ ఆ రాత్రంతా రోదించాడు. ఆ మర్రోజు కాయిలాపడి కార్యక్రమాలన్నీ రద్దు చేసుకున్నాడు. ముఖ్యమంత్రి తీవ్ర రక్తపు పోటుతో, ఆయాసంతో అస్వస్థత చెందినట్లు మెడికల్ బులెటిన్ వెలువడింది.

* * *

నేటి చరిత్రలో మేటిరోజది. పత్రికలకి పండగ. దేశం అంతటా సందడి. ఏదో అపూర్వమైంది, అసాధారణమయింది సంభవించబోతున్నది ఆరోజు. దేశ ప్రధాని ఓ చిన్నరాష్ట్రములో సంక్షోభం పరిష్కరించే సంకల్పంతో ఓ ప్రాంతీయ పార్టీతో స్వయంగా సంప్రదింపులకు కూర్చుంటున్నాడు. అంచేత అది అపు దయినరోజని ప్రజలు భావించారు. వెన కటి సంప్రదాయం వేరు. ఏ సీనియర్ క్యాబినెట్‌మంత్రిగారో, పార్టీనాయకుడో, లేదా వాళ్ళ నాయకత్వంలో అధికార ప్రతినిధుల వర్గమో ప్రధానమంత్రి తరఫున సంప్రదింపులభారం భుజాన వేసుకోడం పరిపాటి. అటువంటి సంభాషణల పర్వంలో రాష్ట్ర ముఖ్యమంత్రి ప్రధానపాత్రధారిగా వెలిగేవాడు. ఈతూరిప్రధానమంత్రి ఆ నలిగినదారి కాదని క్రొత్తపుంత తొక్కాడు. సమావేశస్థలం దరిదాపుల్లో ఎక్కడా రాష్ట్ర ముఖ్య మంత్రిదిగాని, కేంద్రహోంమంత్రిదిగాని



పీడపడ్డంలేదీసారి.

పర్యవసానం ఎలా ఉంటుందోనని ప్రతిఒక్కరూ ఆతృతతో ఎదురుచూస్తున్నారు. ప్రధానమంత్రికి—అకాలీలకు మధ్య జరుగుతున్న ఈ సంప్రదింపులు భవిష్యత్ రాజకీయ సమస్యల పరిష్కారానికి ఒరవడి దిద్దుతాయి.

సంభాషణలు ప్రారంభమయ్యేరోజు ఉదయానికంతా అకాలీనాయకులు ఇద్దరిద్దరుగా, ముగ్గురు ముగ్గురుగా ఢిల్లీలో దిగారు. వాళ్ళతోపాటు వాళ్ళ అభిమానులు లేదా అనుచరులుకూడా దిగారు. భోజనాలవేళకి నాయకులు యావన్మంది విచ్చేశారు. కపుర్తలా భవన్‌లో అందరికీ విడిది ఏర్పాటయింది. గదులు మొత్తం నిండిపోయాయి. మాన్‌సింగ్ రోడ్డులో కపుర్తలా భవన్ సర్వసామాన్యంగా ఖాళీగా కళావిహీనంగా కనిపించటం కద్దు. ఒకనాటి సువిశాల సుందర రాజప్రాసాదం దిక్కూ దివాణం లేనట్టుగా బోసిగా దీనంగా కనిపించేది. దానికి పక్కన నిత్యనూతనంగా సందడిగా కళకళలాడే తాజ్ హోటలుంది. బహుశా ఆ కారణంవల్ల కూడానేమో కపుర్తలా భవన్ నిర్జనంగా, నిర్జీవంగా కనిపిస్తూ వుండవచ్చు. అటువంటిదీరోజు శోభాయమానంగా కళకళలాడుతోంది. నలుపు, నీలం, పసుపుపచ్చ తలపాగాలతో, జాలువారే గడ్డాలతో, క్రాస్‌బెల్టులకి వేలాడే మూడడుగుల ఖడ్గాలతో,రెండంగుల కృపాణాలతో, లాఠీలతో యమసందడిగా ఉంది. ఆవరణ కార్లతో, జీపులతో నిండిపోయింది. దడదడలాడే ఇంజన్ల మోతతో, మూసీ తెరిచే కారు దోర్ల చప్పుళ్ళతో ఆవరణ మోగిపోయింది.

ఛోటానాయకులకి పత్రికలవాళ్ళతో మాట్లాడాలని మహాదురదగా వుంది. కాని జతేదార్‌లొంకే అటువంటి పిచ్చిపని చెయ్యొద్దని ముందుగా హెచ్చరించాడు. నాయకుడి మాట కాదని నోరుమెదిపే ధైర్యం ఎవరికీలేదు. మాటల్లోపెట్టి కూపీలు లాగుదామని వచ్చిన పాత్రికేయులకి కొద్దిగా నిరాశ కలిగింది.

"మా జతేదార్లు మాలువాల్, ఇస్సాపురీలు ఏం నిర్ణయించారో మాకే కచ్చితంగా తెలీదు. వాళ్లు సంభాషణలు సాగించటానికి ఏ పద్ధతి యోగ్యంగా ఉంటుందనుకుంటారో ఆ పద్ధతిలో సాగించటానికి అకాలీదళ్ కార్యవర్గం వాళ్ళకి అధికారం ఇచ్చింది" అన్నాడు ఓ ఛోటానాయకుడు.

"అయితే మీరంతా ఎందుకొచ్చారు?"

"అదేం ప్రశ్న? మేం మొత్తం మా జతేదార్ వెనక సమైక్యంగా, సంఘటితంగా ఉన్నామని ప్రదర్శించటానికి వచ్చాం" అన్నాడు ఛోటా లీడరు అట్టహాసంగా.

"అంటే, ఇంతకుముందు మీలో మీకు విభేదాలున్నయ్యా?"

ఛోటానాయకుడు గతుక్కుమన్నాడు.

"ఇప్పుడు, ఎప్పుడూ విభేదాలు లేవు. సిక్కులు ఎప్పుడూ సమైక్యంగానే ఉన్నారు. అది గుర్తుంచుకోండి"

"కాని ఢిల్లీలోమాత్రం ఒక్కటిగా లేరని మీకు తెలీదా?"

"ఢిల్లీలో, దేశం మొత్తంలో, ప్రపంచం అంతటా సిక్కులంతా ఒక్కటిగా జతేదార్‌ని సమర్థిస్తున్నారు"

"మరయితే, జతేదార్ కాలాసింగ్ రసోయ్ గురించి ఏమంటారు? ఆయన వేరే పాట పాడుతున్నాడే?"

"చూడండి. మీరేం ప్రశ్నలు వేసినా




మా నాయకుణ్ని వెయ్యండి. మావరకు మాకేం తెలీదు. జవాబులిచ్చే పూచీ ఆయనదే" అంటూ నౌలాఖ్‌సింగ్ బంతిని సుఖాసింగ్ వేపు నెట్టాడు. నౌలాఖ్‌సింగ్ సామాన్యుడుకాదు. తన చాపకిందికే నీరుతెచ్చే సత్తాఉన్నవాడు.

"రంగ్‌సాబ్! ఢిల్లీ గురించి ఏమంటారు?"

"భాయిసాబ్! మీరంతా కలిసి నన్ను ఇరకాటంలో పెట్టకండి. నేనూ మీలో ఒకణ్నే. సమయం, సందర్భం కలిసి వచ్చినప్పుడు సమస్తం చెప్పేస్తాను. ఇప్పుడుమాత్రం కాదు. సంభాషణలు ప్రారంభం కాబోయేముందు అటువంటి విషయాలు మాట్లాడ్డం మంచిదికాదు. వివేకం ప్రదర్శించటం సభ్యతా లక్షణం" అన్నాడు రంగ్ గంభీరంగా.

"రసోయ్ విషయంలో మీరే చెప్తానన్నారు"

"సరే ఒక్కమాట చెప్తా. జత్తేదార్ రసోయ్ కూడా సంభాషణల్లో పాల్గొంటున్నాడు. ప్రభుత్వం ఆయనకి ఢిల్లీ గురుద్వారా ప్రబంధక్ కమిటీ అధ్యక్ష పదవి కట్టబెట్టింది. ఆయన ప్రభుత్వ తొత్తు. ఆయన్ని తొలగించి మళ్ళీ న్యాయ సమ్మతంగా ఎన్నికలు జరగాలని మేం పట్టుబడుతున్నాం. పరిస్థితేమిటో ఇప్పుడు మీకే తెలుసు. రండి..కాఫీ, కూల్‌డ్రింక్సు తీసుకుందురుగాని"

కాని పత్రికా విలేఖరులు ఆయన చెప్పింది రాసుకుని చకచకా వెళ్ళిపోయారు. సుఖాసింగ్‌రంగ్ తన తెలివి తేటలకి తనే ఉబ్బిపోయాడు.

కాని జత్తేదార్ లౌకే తన గదిలో తలుపులు బిడాయించి కూర్చున్నాడు. బైటివాళ్ళతో సంబంధంలేదు. మాజీ ముఖ్యమంత్రిగారేమో లేసచుట్టాల్ని పలకరించి వచ్చే మిషతో పత్తాలేకుండా పోయాడు. అయితే ఆయన ఎక్కడున్నాడో పత్రికలవాళ్ళకి తెలుసు. రంగీన్ హోటల్లో ఉన్నట్లు తెలిసినా అక్కడ వెంటబడ్డం కుదరదు. ఎంచేతందే ఆయన అక్కడ బసచేసినట్టు హోటలువాళ్ళు అస్సలు ఒప్పుకోరు. ఏ చపలాక్షితోనో కూర్చుని స్కాచ్ విస్కీ సేవిస్తూ వుండవచ్చు; లేదా సర్వీసు డోరుగుండా బైటికి జారుకునీ వుండవచ్చు. ఎవరు చెప్పగల్గలు? ఎమర్జన్సీ రోజుల్లో అకాలీలు మోర్చా తీసినప్పుడు ప్రభుత్వం ఈయన్ని తిలక్ నగర్‌లో తాత్కాలికంగా ఓ జైల్లో ఉంచింది. నిజానికి ఆయన కారాగార వాసం చెయ్యలేదు. ఈ రంగీన్ హోటల్లోనే దర్జాగా ఉన్నాడు. చండీఘడ్‌లో కూడా రంగీన్ బ్రాంచి ఉంది.

ప్రధానమంత్రితో జరిపే చర్చల్లకు ఏ పంథాని ప్రాతిపదిక చేసుకోవాలనేది అకాలీ నాయకులకు ఇప్పటికీ స్పష్టం కాలేదు. అవులిస్తే పేగులు లెక్కపెట్ట గలడు ప్రధాని. ఆయనతో సంభాషణలకు కూర్చోవడమంటే సులువైన వ్యవహారంకాదు. పైగా అకాలీనాయకులకు తమవి ఫలానా డిమాండ్లు, వాటిగుర్చించి పట్టుబట్టాలనే స్పష్టమైన అభిప్రాయం లేదు. మతత పేచీలు పెట్టి వ్యవహారం తమకి అనుకూలంగా తిప్పుకోగలమనే దురభిప్రాయం కూడా వాళ్ళకుంది. ఇదమిద్ధంగా ఒక పాలసీ, ఒక పంథా లేకుండా ఎప్పటికేది తోస్తే అది పత్రికలవాళ్ళముందు కక్కటంవల్ల ఎక్కువగా అనర్థమే జరిగింది. వాళ్ళు విడివిడిగా, సంయుక్తంగా పత్రికలకి విడుదలచేసిన ప్రకటనలు వివాదాస్పదంగా తయా

రయ్యాయి. ప్రతిసారి ఏ సంత్ జీయో, ఏ జత్తేదారో నానా ప్రయాసపడి వివరణ ఇస్తేనేగాని గందరగోళం సమసిపోదంలేదు. అందరి తరఫునా అధికారికంగా మాట్లాడగలిగిన ప్రతినిధిలేదు. అందరూ నాయకులే. అదే అసలుతంటా. అకాలీ ప్రభుత్వం ఏర్పడితే ఎవరికివారు ముఖ్యమంత్రి పదవి తన్నుకుపోవాలని తాపత్రయపడేవాళ్ళే. స్వంత నియోజక వర్గాల్లోనో, జిల్లాల్లోనో తప్ప రాష్ట్రం మొత్తంమీద రాణింపు ఉన్నవాళ్ళుకారు. అందరూ కూడబలుక్కొని కచ్చితమైన పంథాకి కట్టుబడి సమైక్యంగా వ్యవహరించలేకపోవటమే వాళ్ళ బలహీనత, ఓటమి.

ప్రధానమంత్రి నుంచి పిలుపు వచ్చీ రాగానే హోంశాఖ కార్యదర్శి ఆయన నివాస భవనానికి రెక్కలు కట్టుకుని వాలాడు. అకాలీల వైఖరి గురించి, రాష్ట్రంలో వాళ్లకున్న రాజకీయబలం గురించి ప్రధానమంత్రి అతణ్ని కదిపాడు.

"వాళ్లకిప్పుడు ఎదురులేదు సర్. సమస్త సిక్కు ప్రజానీకం అకాలీల వేపే వుంది. తరతరాలుగా కాంగ్రెస్ సంస్థని అంటిపెట్టుకున్న సిక్కులు కూడా లోపాయికారీగా అకాలీల్నే సమర్థిస్తున్నారు సర్" అన్నాడు ఔలాఖ్.

"రాష్ట్రం మొత్తాన్ని చుట్టచుట్టి మిన హాయింపనేది లేకుండా మాట్లాడేస్తున్నారు మీరు?"

"లేదు సర్. నేను ప్రత్యక్షంగా చూసివచ్చినదాన్నిబట్టీ, మన గూఢచారి శాఖలు ఇచ్చిన సమాచారాన్ని బట్టీ నేను ఆ నిర్ణయానికొచ్చాను సర్"

"ఈ క్షణంలో వాళ్ళ బలం ఎంత?"

"మతపరంగా నూటికి నూరు పాళ్లు సర్. రాజకీయంగా ఫిఫ్టీ-ఫిఫ్టీ"

"స్పష్టంగా చెప్పండి"

"జత్తేదార్ లొంకే సమయం చూసుకుని సమస్య సృష్టించడంలో మహా ఘటికుడు సర్. రావి-బియాస్ నదీజలాల సమస్యకి అతను మతం రంగు పులిమాడు సర్. రాష్ట్ర ఆర్థిక పరిస్థితి, రైతాంగం పరిస్థితి ప్రమాదంలో పడిందని వాళ్లు భావించడం లేదు. మతం ప్రమాదంలోపడిందని వాళ్లు అనుకుంటున్నారు. ముస్లిములకన్నా సిక్కులే మహామత దురభిమానులు సర్. మతం మాట ఎత్తితే చాలు వాళ్లు విభేదాలన్నీ మర్చిపోయి ఏకమవుతారు. మతం కోసం ప్రాణాలు అర్పించటానికి తయారవుతారు సర్"

"అవన్నీ అందరూ చెప్పుకునే విషయాలు. మీరు నిర్దిష్టంగాచెప్పండి"

"సమస్యని అమీతుమీ తేల్చుకుండా నాన్చటానికి వాళ్లంతా శాయశక్తులా ప్రయత్నిస్తారని నా అభిప్రాయం సర్. మొత్తం సిక్కు ఓట్లన్నీ గుంజుకోగలమని వాళ్ల ధీమా సర్"

ప్రధానమంత్రి మౌనంగా ఊరకుండిపోయాడు. కాయితాల బొత్తిలో ఏదో కాస్సేపు గెలికాడు. ఔలాఖ్ కి ముళ్ళమీద కూర్చున్నట్లుగాఉంది. ఉండాలో,వెళ్లాలో తెలీదు. చివరికి ఉంటానికే తీర్మానించుకున్నాడు.

"మనం వేటిని ఒప్పుకుంటే వాళ్లు సంతృప్తి పడతారంటారు?" అనడిగాడు ప్రధానమంత్రి కాయితాల బొత్తి మీంచి కళ్లెత్తకుండా.

"అన్నిటికీ మనం ఒప్పుకోందే వాళ్లకి సంతృప్తి ఉండదని నేననుకుంటున్నాను సర్. వాళ్ళ ప్రధానమైన డిమాండ్లు

కొన్ని మనం ఒప్పుకున్నా, మిగతా డిమాండ్ల కోసం మళ్లీ ఆందోళన మొదలెడతారు. ప్రజాభిమానం పోగొట్టుకోకుండా ఉండాలన్నా, అందరూ సంఘటితంగా ఉండాలన్నా వాళ్ళకి అదొక్కటే మార్గం సర్"

"అయితే ఏంచేస్తే బావుంటుం దంటారు?"

"వాళ్ల డిమాండ్ల జాబితాని ఒక కనీస పరిమితికి వాళ్లనే కుదించుకోమనాలి. ఆవిధంగా మనది పైచెయ్యి అవుతుంది. తమ 46 డిమాండ్లని వాళ్ళంతట వాళ్ళే అయిదుకో పదికో తగ్గించేసుకున్నారన్న వార్త బైటికివస్తే సిక్కు ప్రజల దృష్టిలో ఆ నాయకుల పరపతీ కుదించుకు పోతుంది"

ప్రధానమంత్రి తలెత్తి బొలాఫ్‌కేసి చురుగ్గా తేరిపారజూశాడు. బొలాఫ్ ఆ చూపుకి తట్టుకోలేక లోపల గిలగిలలాడి పోయాడు.

"హుఁ" గుర్రుమంటూ ప్రధానమంత్రి మొహం తిప్పుకుని కాయితాల బొత్తి విప్పాడు.

తనిక సెలవు తీసుకోవచ్చని ఆయన అంత కటువుగా, పెడసరంగా సూచించ డంతో బొలాఫ్ మనస్సు గాయపడింది. ఆ అవమానం మింగలేకపోయాడు. అయినా మింగక తప్పలేదు. రాజకీయ బాసుల పథకాల్ని తను ఇంతకాలంగా తలకిందులు చేస్తూ రాగలిగినా వాళ్లతో ముఖాముఖి ఘర్షణకు దిగగలిగే దమ్ముల్లేవు. లోపల ఏడ్చుకుంటూ లేచి నిలబడి సమస్కారం చెప్పి నీరసంగా బైట పడ్డాడు.

బొలాఫ్ వెళ్లిపోగానే ప్రధానమంత్రి ప్రిన్సిపల్ కార్యదర్శి రావోన్‌కర్ లోపలికి అడుగుపెట్టాడు.

"గుడ్‌మానింగ్ సర్" అన్నాడు రావోన్‌కర్ ఉత్సాహంగా. ప్రధానమంత్రి అతనికేసి తలెత్తి చూసి కూర్చోమని సైగ చేశాడు.

"అకాలీలు వచ్చేశారు సర్"

"మీ సూచనలేంటో చెప్పండి"

"వాళ్ల డిమాండ్లకి కోరలూడి పోయాయి సర్"

ప్రధానమంత్రి ప్రశ్నార్థకంగా తలెత్తి చూశాడు. బొలాఫ్ చెప్పింది ఇతను తిరగేసి చెప్తున్నాడు!

"పరిస్థితి నాకు అర్థమైనదాన్ని బట్టి అకాలీలు 1980 ఎన్నికల్లో ఓడిపోయాక వాళ్ళకి పలుకుబడి పోయింది. మళ్లీ సిక్కు ప్రజల్లో పూర్వప్రతిష్ఠ సంపాదించుకో డానికి ఏదో ఒక ఆందోళన రెచ్చగొట్టే అవకాశం కోసం కాచుకున్నారు. ఇప్పుడా అవకాశం వచ్చింది"

"అంటే వాళ్లు రాజీ ధోరణిలో లేరనా అర్థం?"

"కాదు సర్. వాళ్లు బాగా రాజీ ధోర ణిలో ఉన్నారు. ఏవో కొన్ని లాభాలు గుంజి ఆందోళన విరమించి ప్రజల్లో పరువు నిలబెట్టుకోవాలని వాళ్లు తాపత్రయపడుతున్నారు సర్"

"మనం ఏ డిమాండ్లు ఒప్పుకుంటే వాళ్ళు రాజీకి వస్తారు?"

"ముఖ్యంగా మతపరమైన డిమాండ్లు సర్. అఖిలభారత గురుద్వారా చట్టం, ఇండియన్ ఎయిర్‌లైన్స్ విమానాల్లో ప్రయాణం చేసే సిక్కులు కృపాణాలు ధరించడానికి అనుమతి, సాయుధ దళాలలో గురుగ్రంథ సాహిబ్‌కి సముచిత గౌరవం, పంజాబుకు చండీఘడ్ బదిలీ, ఓ ఎక్స్‌ప్రెస్ రైలుకి స్వర్ణ

మందిర్ ఎక్స్ప్రెస్ అని పేరు పెట్టటం, స్వర్ణదేవాలయంనుంచి సిక్కు కీర్తనల్ని ఆకాశవాణిద్వారా ప్రసారం చేయటం వగైరా వగైరా స్వల్ప కోరికల్ని మీరు అంగీకరించిన మరుక్షణం వాళ్లు పంజాబులో రెక్కలు కట్టుకుని వాలిపోయి తాము సాధించిన విజయాన్ని, ఖాల్సా ప్రతాపాన్ని ఘనంగా చాటుకుంటారు"

"సమస్యని అతి సింపుల్ గా తేల్చేశారు"

"వాస్తవం అంతే సర్"

"మరి ఖలిస్తాన్ మాటేమిటి?"

"సిక్కు ప్రజానీకాన్ని ఆకట్టుకోటానికి అదే అంతిమ వేదిక అనుకుంటే తప్ప వాళ్లు ఖలిస్తాన్ కోర్కెని భుజాన వేసుకోరు. సిక్కు జాతి సిద్ధాంత గుర్తింపునకు సంబంధించి మనం చేయవలసిందల్లా వాళ్ళ ప్రత్యేక వ్యక్తిత్వాన్ని గుర్తిస్తున్నామని చెప్పడమే సర్. దాన్నే వాళ్ళు తమ జాతికి గుర్తింపుగా భావిస్తారు"

"రాజకీయాలు బ్యూరోక్రాటిక్ రూల్సు కావు రావోన్ కర్! రాజీలు, పరిష్కారాల్ని మించిన చాలా జటిలమైన అంశాలు అందులో ఉన్నాయి"

"నిజమే సర్. పంజాబు పరిస్థితికి సంబంధించి నాకు తోచిన విశ్లేషణ మీకు మనవి చేశాను"

"ఔను..." ప్రధానమంత్రి మళ్ళీ కాయితాల బొత్తి కేసి కళ్లు తిప్పుకున్నాడు.

"మరిక నేను శలవు తీసుకుంటాను సర్. ఈ సాయంత్రం జరగబోయే సంభాషణలకు సంబంధించి అన్ని ఏర్పాట్లు పూర్తి చేసుకోవాలి. ప్రభుత్వం తరఫు ప్రతినిధులుగా ఎవరెవర్ని పిలవమంటారు సర్?" అనడిగాడు రావోన్ కర్ లేచినిలబడి.

"క్యాబినెట్, హోం కార్యదర్శుల్ని పిలవనంపండి"

"హోం మినిష్టరుగార్ని సర్?"

"అవసరంలేదు"

"పంజాబీ యంపీల్నిగానీ, మేజర్ నౌనిహాల్ సింగుగార్నిగానీ?"

"వద్దు"




బీబీ నసీబ్, దళం సభ్యులు బైరాగి గదిలో సమావేశమయ్యారు. గత కొద్దివారాలుగా బొత్తిగా కదలికలేదు. అంటే ప్రభుత్వానికి బెడదలు సృష్టించలేదనేగానీ చాప చుట్టేశారని కాదు. దళంలో దక్షులనుకున్న సభ్యులకి ఆమె వేరేపనులు పురమాయించింది. ఆ పనులకి సంబంధించి ఎవరెవరు ఎంతవరకు కృతకృత్యులైందీ తెలుసుకోడానికి ఆ సమావేశం ఏర్పాటయింది.

నసీబ్ రాకముందే సభ్యులు యావన్మంది గదిలో హాజరుగా ఉన్నారు. ఆమె యధావిధిగా హర్ మందిర్ నుంచి ఆకు దొప్పలో కడా ప్రసాదం నింపుకుని వచ్చింది. ప్రసాదం పంచిపెట్టాక ఆమె వాళ్ళకెదురుగా ఎగువనఆశీనురాలయింది. అందరూ మామూలుగా నేలమీదే కూర్చున్నారు. ఆమెకేసి ఒక్కక్షణం అభిమాన పూర్వకంగా, ఆరాధనాభావంతో చూశారు. అతి చిన్న వయసు




లోనే ఆమె ఇంత గట్టి నాయకురాలు ఎలా కాగలిగిందా అని వాళ్ళ కళ్ళల్లో ఆశ్చర్యం తొంగిచూసింది. ఆమె కేవలం గట్టిపింతం మాత్రమే కాదు— దళ్ ఖాల్సా కార్యాచరణ బృందానికి ఆవేశం, ఊపిరి ఆమే. తస్నీమ్ పోయాక అతని అనుయాయులంతా ఆమెని నెత్తిన పెట్టుకున్నారు. అన్ని విధాలా ఆమె ఇతర్లకన్నా భిన్నంగా, విలక్షణంగా కనిపిస్తుంది. వస్త్రధారణలో, కేశాలంకరణలో, మాటలో, ప్రవర్తనలో ఆమె స్వంత బాణీ సృష్టించుకుంది. చాలా మంది యువతుల్లో కనిపించే ఆడంబరం, అలంకరణ ఆమెలో అసలు కనిపించవు. ఆఖరికి సున్నిపిండి తప్ప సువాసనసబ్బు కూడా ఉపయోగించదు. అందరిమాదిరిగా కృపాణం క్రాసుబెల్టుకి వేసుకోదు. అలా ధరించినందుకు దళం సభ్యుల్ని మందలించి సరిదిద్దింది.

"గురుమహరాజ్ కృపాణాన్ని ధరించమన్నది ఆడంబరం కోసంకాదు; అలంకారం కోసం అంతకన్నా కాదు. మీరు దాన్ని ధరించే పద్ధతి కూడా సరయింది కాదు. అవతలి వ్యక్తి దృష్టి మీ ఆయుధం మీద పడగానే, అతనది గుర్తుపెట్టుకుని మీ మీదికి దూకుతాడు. అది మీ చేతికి అందకుండా ఉండాలని చూస్తాడు. కాని నేను ధరించిన పద్ధతి చూడండి. ఆయుధం ఉన్నట్టే తెలియనివ్వకుండా, బైటికి కనిపించనివ్వకుండా చొక్కా అడుగున మొలలో దోపుకున్నాను. మీరూ ఇకనుంచి ఇదే పద్ధతిలో పోవాలి" అంది కిందటిసారి సమావేశంలో.

వెంటనే వాళ్ళంతా ఆమె పద్ధతిలో కృపాణాలు ధరించారు. అప్పుడు పోలీసుల దృష్టి చప్పున వాళ్ళమీద పడదు. కీర్తనీ దళంవాళ్ళ కోసం, దళ్ ఖాల్సా తీవ్రవాదులకోసం వెయ్యి కళ్ళతో గాలిస్తున్న పోలీసుల కన్నుగప్పటంసులభమైంది.

తరువాత కిందికి జాలువారే గడ్డాల్ని ముడిచి కట్టుకొమ్మని హెచ్చరించింది. ఆ విషయంలో ఆమె సంత్ జీని ఒప్పించి ప్రత్యేకానుమతి సంపాయించవలసి వచ్చింది. మారువేషం గానీ, వేషంలో మార్పుగానీ పంథ్‌కి, సిక్కు ధర్మానికి వ్యతిరేకం కావని ఆమె సంత్ జీతో వాదించింది. అవసరమనుకున్నప్పుడు పదవ గురువు గురుగోవింద్ సింగ్ జీ అంతటివాడే మారువేషం కట్టిన ఉదంతం గుర్తుచేసింది. సంత్ జీ ఒప్పేసుకున్నాడు. కాని గడ్డాల్ని కురచగా కత్తిరించటానికి మాత్రం ఆయన వ్యతిరేకత వెలిబుచ్చాడు.

కుర్తా, పైజామాలు వేసుకోవడం మీద కూడా ఆమె తన అభిప్రాయాలు నిష్కర్షగా ప్రకటించింది. కుర్తా పైజామాలు మానేసి దర్జాగా కనపడేటట్లు సూటూ బూటూ వేసుకొమ్మని దళంలోని సభ్యులందరికీ ఆమె సలహాయిచ్చింది. వాళ్లు పల్లెటూరి రైతులుకారు. విద్యార్థికులు; సంపన్న కుటుంబాలనుంచి వచ్చినవాళ్లు. "హైజాకర్ లాగా, తీవ్రవాదిలాగ కనపడే వ్యక్తిమీద గూఢచార్ల కళ్లు పడ్డట్టుగా నీటుగా సూటుబూటు వేసుకుని ఫస్ట్‌క్లాస్‌లో ప్రయాణం చేసే వ్యక్తిమీద పడవు" అంది నసీబ్. అందరూ ఆమెతో ఏకీభవించారు. ఆమె చెప్పినట్ల మేరకి డ్రెస్ మార్చారు. జాలువారే గడ్డాలు ముడిచి కట్టుకున్నారు. తలపాగా రంగు మార్చారు. డాబుగా, దర్జాగా కనిపించసాగారు. వాళ్ల కార్యకలాపాలిప్పుడు నిరాటంకంగా సాగిపోతున్నాయి. వాళ్ల మీద పోలీసువాళ్ల కళ్లు పడ్డం లేదు సిటీలో తిరిగినా, సిటీ బైట తిరిగినా వాళ్లని

అనుమానించేవాళ్లు లేరు. పోలీసులు తారసిల్లినచోట వాళ్లే ఇప్పుడు పని గట్టుకుని ఒకటి రెండు క్షణాలు లోకాభి రామాయణం ముచ్చటిస్తున్నారు. వాళ్ల పబ్లిక్ స్కూలు చదువు, నిర్దుష్టమైన ఇంగ్లీషు ఉచ్చారణ పోలీసు ఆఫీసర్లని సునాయాసంగా బోల్తాకొట్టిస్తున్నాయి. ఉన్నత కుటుంబాల్లో పుట్టి పెరిగి, పబ్లిక్ స్కూళ్లలో చదువు వెలిగించిన యువకులు అల్లరిచిల్లరి తీవ్రవాదుల్తో, కిర్తనీల్తో నేస్తం కడతారనేది పోలీసులు కలలోనైనా ఊహించలేని సంగతి.

ఆమె అందరి మొహాలకేసి చూస్తూ జోగాసింగ్ మీద చూపు నిలిపింది.



''ఖాల్సాజీ! ఇకచెప్పండి ఒకరి తర్వాత ఒకరు''

''దీదీ! వాళ్ల బసకోసం గంగానగర్‌లో ఒక బ్రహ్మాండమైన చోటు చూశాను. పూర్వం అది ఓ నవాబుగారి హవేలీ. దాన్ని ఓ జమీందారు కొనుక్కున్నాడు. కొనుక్కున్నాడే గాని ఖాళీగా ఉంచేశాడు. పోతే - వాళ్లంతా పొలంపని చేసే వ్యవసాయ కూలీల్లాగా బట్టలు వేసుకుని హవేలీలోనే మకాం ఉంటారు. లోపల వాళ్లు కోరే సమస్త సౌకర్యాలు ఉన్నాయి. బైటమాత్రం పనిపాట్లు చేసుకునేవాళ్ల మాదిరిగా వ్యవహరించాలి. అంటే



చెమటలు కక్కుతూ కష్టం చెయ్యాలని కాదు. కనీసం నటించగలగాలి'' అన్నాడు జోగాసింగ్.

"ఆ హవేలీ యజమాని సంగతి?''

"అతను బబ్బర్ అకాలీ ఉద్యమ నాయకుని సంతతిలోవాడు. అది చెప్పుకుని గర్వపడిపోతాడు. వాళ్ళు ఉన్నన్నాళ్ళు అన్ని ఖర్చులు అతనే భరిస్తానన్నాడు. అంతేకాదు - మనకి అవసరమైతే యాభైవేలు ఇస్తానంటున్నాడు. నేను ఒప్పుకోలేదు. అది మీ నిర్ణయానికి వదిలేశాను'' అన్నాడు.

"మంచిపని చేశావు జోగాభాయ్! మనం డబ్బు అంగీకరిస్తే బైటపడిపోయే ప్రమాదం ఉంది. డబ్బు వద్దన్నాం కాబట్టి అతనికి మనమీద గౌరవం పెరుగుతుంది. ఇంకా మంచిగా మనతో సహకరిస్తాడు" అంది దీదీ నసీబ్.

"నేను మూడు రకాల వాహనాలు రెడీ చేశాను దీదీ" అన్నాడు జైసింగ్.

అతను నాసిక్ యూనివర్సిటీలో పాలిటిక్స్ ప్రొఫెసరు.

"ఢిల్లీలో మనం వాడబోయేవి మామూలు డొక్కు కార్లు. పాత ఫియట్, అంబాసిడర్లు. వెలిసిపోయిన రంగులు, గాట్లుపడ్డ పెట్లు. వాటిమీద రాసింది చదవాలంటే తాతలు దిగొస్తారు. అటువంటి పాత డొక్కులు మనకు హర్యానా అంతటా కనపడ్డాయి. కంగారులేకుండా తాపీగా వాటిల్లో కూర్చున్నంతసేపూ ఎవడూ పట్టించుకోడు.

"ఇక రెండవరకం ఇంపోర్టెడ్ కార్లు- మెర్సిడెజ్, టొయోటా వగైరాలు. అవి వేగానికి మారుపేరు. చూపులక్కూడా అంతే! కళ్ళు చెదిరిపోతాయి. ఢిల్లీ ప్రాంతం దాటి హిస్సార్ ఏరియాలోకి వెళ్ళామంటే జనం రిజిస్ట్రేషన్ నంబరుకేసి కూడా చూడరు. వాటి షేపూ, సైజూ అట్లాంటివి. చూస్తూనే జనం నిశ్చేష్టులైపోతారు.

"పోతే మూడవరకం జీపులు. అవి ఎట్లాంటివనంటారు? మన రైతులు చాలా మంది వాడుతున్నారు చూడండి అట్లాంటివి. ప్రత్యేకంగా గుర్తుపెట్టుకోడానికి వీలుపడనివి. అవి కేవలం గంగానగర్‌లో వాడుకోడానికే. ఎందుకంటారా? హవేలీ చేరాలంటే జీపులు, ట్రాక్టర్లు తప్ప వేరేవి పనికిరావు. అందుకని జీపులు ఖాయం చేశాను"

జైసింగ్ చెప్పడం పూర్తికాగానే నసీబ్ ఖడక్‌సింగ్ వేపు ప్రశ్నార్థకంగా చూసింది.

"మెటడార్ వ్యానుగురించి మీరేమీ బెంగ పెట్టుకోవద్దు దీదీ. ఆసియా క్రీడల్లో పాల్గొనడానికొచ్చే క్రీడాకారుల్ని రోజూ బైటికి తీసుకుపోడానికి ఉపయోగించే వ్యాను ఎలా ఉంటుందో అచ్చుఅలాంటిదే తయారవుతోంది. దానికి సంబంధించిన సకల ఏర్పాట్లు పకడ్బందీగా సిద్ధం చేస్తున్నాను" అన్నాడు ఖడక్‌సింగ్.

"ఆసియా క్రీడల్తో మనకేమిటి సంబంధం?" అనడిగాడు డాక్టర్ మహాసింగ్. ఆయన గొప్ప చరిత్రకారుడిగా పేరున్నవాడు. ఇంత చిన్న వయసులో అంతటి పేరు సంపాయించినవాడు బహుశా అతనొక్కడే కావచ్చు. చటాల్న అడిగాడేగాని వెంటనే నాలుక కర్చుకున్నాడు.

"అక్కడ బాంబు విసరాలని మేం అనుకుంటూ వుండొచ్చు మహాసింగ్‌జీ!" అంది నసీబ్ నమ్రతగా.

"మీరు చేస్తున్న ఏర్పాట్లు చూస్తే బాంబుని మించిందే ఏదో తలపెట్టిన





ట్లున్నారు" అన్నాడు డా. మహాసింగ్.

"ఔను. కాని దాన్ని దళ్ ఖాల్సాతో ముడిపెట్టదల్చుకోలేదు" అంది నసీబ్.

"మరి దానివల్ల ఉపయోగమేముంది?"

"ఏదో ఒక కార్యక్రమం సాగించాలి. చాలా రోజులుగా ఏ కార్యక్రమం లేకుండా ఊరకుండిపోయాం"

"దానికి నువ్వే కారణం. నీకు ఎవరితోనూ సంప్రదించే అలవాటులేదు. తస్లీమ్ అలాకాదు. అతనికొక కార్యక్రమం ఉంది. దానికి, తనకి అంకితమైపోయిన విశ్వాసపాత్రులైన అనుయాయులు అతనివెనక ఉన్నారు"

"అంటే నాకలాంటి అనుయాయులు లేరనేగదా అర్థం?"

"అని నా ఉద్దేశంకాదు నసీబ్. నీ ఆలోచనలు నీలోనే దాచుకుంటావు. ఇతరులతో పంచుకోవు. నీ దృష్టిలో మేం నోరుమాట్లాడకుండా నీ వెంటపడి వచ్చే గొర్రెలమంద"

"నేను చెప్పినట్లుగా వ్యవహరించాల్సిన బాధ్యత మీకులేదా?"

"లేదు. ఏ కార్యాచరణనిగాని నిర్ణయించవలసినవాళ్ళు పంచప్యారేలు"

"వాళ్ళలో మీరొకరా?"

"అవును"

"మా పథకం మొత్తం మీకు తెలుసుకోవాలని ఉంది...ఔనా?"

"నేను అంతరంగిక ముఖ్యుల్లో ఒకణ్ని. కాబట్టి తెలుసుకోవాలనుకోటం సహజం"

"తస్లీమ్ బతికున్నప్పుడు మీరు అంతరంగికులా?"

"నిస్సందేహంగా. అతనికి నామీద విశ్వాసం ఉండేది"

"అయినా మీరతనికి ద్రోహంచేశారు"

"ఏంటి నీ ఉద్దేశం?"

"ఏముంది హైజాకింగ్ కార్యక్రమాన్ని మీరు చెడగొట్టారు. మీరతణ్ని వెన్నుపోటు పొడిచారు. అతను బైటికి వెళ్ళిపోగానే మీరు కూడా తక్షణం ఉడాయించారు"

"ఇటువంటి ఆరోపణని నేను సహించేది లేదు. సంత్‌జీ సమక్షంలో నీ ఆరోపణ నిజానిజాలు తేల్చుకుందాం. ఎవరు రైటో అప్పుడు తేలిపోతుంది"

"అలాగే భాయిసాబ్! పదండిపోదాం" అంది నసీబ్ లేచి నిలబడి.

"ఇప్పుడే వెళ్ళామని నా ఉద్దేశం కాదు. ఎప్పుడైనా వెళ్ళి తేల్చుకోవచ్చు"

"లేదు భాయిసాబ్! వ్యవహారం వాయిదా వెయ్యటం మంచిదికాదు. వెంటనే వెళ్ళి సంత్‌జీ సమక్షంలో తేల్చుకుందాం"

"గోరంత విషయాన్ని నువ్వు కొండంత చేస్తున్నావ్. ప్రస్తుతానికది మర్చిపో. ఇప్పుడు మనం చర్చించే విషయం పూర్తికానివ్వు" అన్నాడు డా. మహాసింగ్ పెద్దగా.

"ఆ చర్చ ఇప్పుడుకాదు" అంది నసీబ్ దృఢంగా.

"ఏంటి నీ ఉద్దేశం నీ చు రా లా" డా. మహాసింగ్ ఉద్రేకంతో ఊగిపోతూ ఆమెవేపు దూకాడు. చెయ్యి చొక్కా అడుక్కిపోయింది. అప్పటికే అతను చాలా లేటు చేశాడు. దళంలో ఇద్దరు అతని చేతుల్ని వెనక్కి విరిచి పట్టుకున్నారు. మూడో వ్యక్తి అతని తొంటిలో చెయ్యిదోపి గ్రెనేడు బైటికి లాగాడు. డా.మహాసింగ్ రెండు క్షణాలు గింజుకుని వెంటనే శాంతించాడు.

"ఖాల్సాజీ! మీ ఆశయానికి, తస్లీమ్ ఆశయానికి ద్రోహం చేసిందెవరో మీ

కిప్పుడు అర్థమైంది. మన కార్యకలాపాలన్నీ ఈమధ్య ఎందుకు నిలిపివేశానో మీకు అర్థమై ఉండాలి. ద్రోహి కోసం వలవేశాను. ఇప్పుడు పట్టుబడ్డాడు"

"ఇతణ్ని ఏం చేద్దామంటారు దీదీ?"

"వదిలెయ్యండి"

"వదిలెయ్యటమా?" అనేక గొంతులు ఒకేసారి మోగాయి.

"అవును. ఒక ద్రోహి రక్తంతో మన చేతులు పాప పంకిలం కాకూడదు"

"కాని, ఇతనికి చాలా తెలుసు దీదీ"

"కావచ్చు. బహుశా అదే అతని బలహీనత; అదే అతని నాశనం కూడా కావచ్చు"

ఆమె ఆ చర్చని అక్కడితో ముగించింది. డా. మహాసింగ్‌ని బైటికి వెళ్ళనిచ్చారు. అతను గదిలోంచి బైటపడి స్వర్ణ దేవాలయం వేపు ఉరికెత్తాడు. మళ్ళీ ఏమనుకున్నాడో అటుకేసి పరుగు ఆపి బాబా అతల్ వేపు మళ్లాడు. అతను తన విధి లిఖితమైన గమ్యం వేపు మళ్ళటం చూసి నసీబ్ చిరునవ్వునవ్వింది. దళ సభ్యులంతా షాక్‌తో దిమ్మరపోయారు. తమ అందర్లో మహా ఉత్సాహపరుడైన డా. మహాసింగ్ ద్రోహి అయ్యాడంటే వాళ్ళు నమ్మలేకపోయారు. అందరూ మాటా పలుకూ లేకుండా మౌనంగా కూర్చుండిపోయారు.

"పేలుడు వినిపించినట్టుగా వుంది" అంది నసీబ్ విషాదంగా. మళ్ళీ రెండు సార్లు కాల్పుల మోత వినిపించింది.

"ద్రోహులెప్పుడూ తమ పాప ఫలం అనుభవించడానికి నోచుకోరు" అంది నసీబ్ భారంగా.

"మిత్రే ప్యారేనూన్ హాల్ మురిదా..." ఆమె కీర్తన ఎత్తుకుంది.

అందరూ గొంతు కలిపారు. కీర్తన పాడ్డం పూర్తికాగానే వాళ్ళకి పునరుత్సాహం కలిగింది. మబ్బు విడిపోయింది. వెలుగు వెల్లువెత్తింది.

"ఖడక్‌సింగ్ భయ్యా వాళ్ళెంతమంది?"

"పదకొండుగురు దీదీ. ఎక్కువమంది క్రీడాకారులు. అందులో ఒకరిద్దరికి అసలు సంగతి తెలిసి వుండదు. వాళ్ళేదైనా సమస్య తెచ్చి పెట్టవచ్చు. అయినా, అది మేం చూసుకుంటాం"

"మంచిది భయ్యా! నేను సంత్‌జీ దర్శనం చేసుకోవాలి. ఆయన ఆశీస్సులు పొందాలి. మన పథకానికి ఆయన అనుమతికూడా సంపాయించాలి. వాహే గురూజీకా ఖాల్సా-వాహే గురూజీకిఫతే"




నసీబ్ తన పథకానికి సంత్‌జీ చేత సరే అనిపించుకోడానికి చాలా ప్రయాసపడవలసి వచ్చింది. ప్రస్తుతం తనే స్వయంగా ప్రభుత్వానికి అల్టిమేటం పంపించి ఆత్మాహుతికి సిద్ధపడిన తరుణంలో ఇతర్లు అనవసరంగా ప్రాణాల మీదికి తెచ్చుకునే పనికెందుకు పూనుకోవాలని ఆయన ప్రశ్న. పైగా ఆ పనిలో ప్రాణప్రమాదం ఉండటంటే ఆయనకి నమ్మకం కలగలేదు. అమాయకుల ప్రాణాలు తియ్యటానికి ఆయన బద్ధ వ్యతిరేకి. అయినా నసీబ్ చిట్టచివరికి ఆయనని

ఒప్పించగలిగింది. స్వభావరీత్యా ఒకే మాదిరివి రెండు పథకాలు భారత - పాకిస్థాన్ దేశాల్లో ఏ క కా లం లో జరగనున్నాయని నసీబ్ వాదించింది. ఇటువంటి సమయంలో దళం మాటతప్పి వెనకడుగువేస్తే తమ్ముని పిరికిపందల్లాగా, ద్రోహుల్లాగా అవతలివాళ్లు భావిస్తారని ఆమె ఆవేశంతో చెప్పింది. ఆ రెండు విశే షణాలంటే ఆయనకి పరమ అసహ్యం ఒక సిక్కు పిరికిపందగానీ, ద్రోహిగానీ కావటమన్నది ఆయన కలలో కూడా ఊహించలేని విషయం.అదే ఆమె వాదనని నెగ్గించింది. అపహరించబడే వ్యక్తులకు ఎటువంటి హాని జరగకూడదని సంత్‌జీ మాటతీసుకున్నాడు. వాళ్లకి సకల అతిథి మర్యాదలు జరపాలని వాగ్దానం చేయిం చాడు. నసీబ్ కూడా వేరేవిధంగా ఆలో చించలేదు. సంత్‌జీదీ, ఆమెదీ ఒకే ఆలో చన.తను సిక్కుజాతి లక్ష్యానికైపోరాడూ వుండవచ్చు; కాని అంతర్జాతీయంగా దేశ ప్రతిష్టని ఆమె ఎన్నడూ నిర్లక్ష్యపెట్ట లేదు.

నసీబ్ తక్షణం బైరాగి గదికి తిరిగి వెళ్లింది. అంతా ఆమెకోసం ఆత్రతతో ఎదురు చూస్తున్నారు. లక్ష్యసాధనలో పునరంకితం కావాలనేది ఎంత పటు తరంగా వాళ్ల మనస్సులో నాటాలా అని మనస్సులో తర్జనభర్జన చేసుకుంటూ ఆమె గుమ్మంలో ఒక్క క్షణం నిలబడి పోయింది. ఆమెకు తెలుసు—ఆమెని ఏదో ఆవేశం పూనింది.

"ఖాల్సాజీ! అందరం దర్బార్ సాహిబ్‌లో ప్రార్థన చేద్దాంపదండి" అంటూ నసీబ్ దారితీసింది. అందరూ లేచేదాకా కూడా ఆమె ఆగలేదు. ఆమె చకచకా ముందు నడుస్తోంటే అందరూ ఆమెని అనుసరించి నడిచారు.

ఆమె భక్త్యావేశంతో పదవ గురువు గురుగోవింద్ సింగ్ మహరాజ్ దివ్య నామాన్ని స్తోత్రం చేసింది.

"ఓ మహానుభావా, ఖడ్గావతారా, కరు ణాంతరంగా... నీ దాసుల్ని దీవించు. మా ఈ అల్ప ప్రాణాల్ని పంథ్ సేవలో తృణప్రాయంగా సమర్పించటానికి ధైర్యం ప్రసాదించు. నీ దివ్యబోధలో ఈ దీసు లెన్నడూ విశ్వాసం కోల్పోకుండా ఉండే టట్లు అనుగ్రహించు. గురునానక్ ఆవి ష్కరించిన ధర్మానికి, ఆ తరువాత అష్ట గురువులు పెంచి పోషించిన ధర్మానికి పరాకాష్టవైన ఓ గురుగోవింద్ సింగ్ మహ రాజ్...మా పథకానికి నీ అంతిమ ఆమోద ముద్ర ప్రసాదించు. మేం నీ సేవాదారులుగా, మృత్యువుని ధిక్కరించే నీ సైనికులంగా, సకలమానవాళి సుఖశాంతులు ఆకాంక్షించే నీ దూతలుగా ఉండాలని మాత్రమే వాంఛి స్తున్నాం. బోలో సో నిహాల్ సత్ శ్రీ అకాల్"

ప్రార్థన ముగిశాక ఆమె అందర్నీ అక్కడే కొద్దిసేపు ఆగమని కోరింది. ఆమె మనస్సులో మెరుపులా ఓ నిర్ణయం తోచింది. భద్రత దృష్ట్యా వ్యూహం మొత్తం దళంలో యావన్మందికి తెలపడం క్షేమం కాదు. ఆమె వెంటనే ఒకరితర్వాత ఒకర్ని విడివిడిగా లోపలికి పిలిచి ఆదేశా లిచ్చింది. వాటిని మనస్సులో హత్తుకో వాలె తప్ప కాగితం మీద పెట్టకూడదు. ఎవ్వరికీ, ఆఖరికి సహచరులకైనా సరే వాటిని వెల్లడి చెయ్యకూడదు. బైట రంగంలో దిగి పనిచేసేవాళ్లు ఏవో అను కోని కొత్త పరిణామాలు సంభవించి వివ రణలు కావాలనుకుంటే ఆమెని నేరుగా కలుసుకోడానికి వీల్లేదు. ఆమెకి, వాళ్లకి



మధ్య వారధిలా పనిచేసే ఇద్దరు కార్యకర్త లకి ఆ బాధ్యత అప్పగించింది. వాళ్లు ఎక్కడెక్కడ అందుబాటులో ఉంటారో సూచించింది. టెలిఫోన్లు, ఉత్తరాలు నిషిద్ధం. దళంలో ఒకరెవరైనా చిక్కుల్లో ఇరుక్కుపోవచ్చు, లింకువ్యక్తి సకాలంలో అందుబాటు కాకపోవచ్చు. పథకంలో కొద్దిమార్పు అనివార్యం కావచ్చు. అటువంటి పరిస్థితుల్లో ఆ సభ్యుడే పంథ్ లక్ష్యంకోసం స్వతంత్రంగా చొరవతీసు కోవాలి. కాని, ఎట్టి పరిస్థితుల్లోనూ పంథ్ ప్రతిష్టకు మచ్చ రానీయరాదు.

అందరికీ ఆదేశాలందాయి. అందరూ ఆప్యాయంగా పరస్పరం కౌగలించు కున్నారు. ఒకరికొకరు వీపుతట్టుకున్నారు. అప్రయత్నంగా అమాంతం వంగి ఆమె పాదాలు స్పృశించారు. ఆమె ఆదర పూర్వకంగా వాళ్ల తలపైన చెయ్యి ఉంచాక గాని వాళ్లు పైకి లేవలేదు. ఆమె ఒక్కటే మాటంది - "ఈ చెయ్యే మీకు నా రక్షాబంధం"

అదొక ఉద్రేక భరిత సన్నివేశం. యధావిధిగా ఎవరికివాళ్లు ఒక్కొక్క రుగా తలొక దిక్కుగా నిష్క్రమించారు. ఆరోజు వాళ్లు పూర్తిచెయ్యాల్సిన పనులు చాలా ఉన్నాయి. ఫ్యాషనబుల్ బట్టలు, ఖరీదైన జోళ్లు, కొత్త తలపాగాలు కొను క్కోవాలి. కొత్త సూటు, బూటు, తల పాగాల్తో సంపన్నకుటుంబాల బిడ్డల్లా కనపడాలి. ఆందోళన కారులనే అనుమానం కలక్కూడదు. తలపెట్టిన కార్యక్రమం భయంకరమైంది. దానికోసం కొత్త అవతారమెత్తాలి.

అందరూ వెళ్లిపోయాక ఆమె తిరిగి ప్రార్థనలో లీనమైపోయింది. ఎంత ఏకా గ్రతగా లీనమైపోయిందంటే, ఆమె కళ్లవెంట రాలిన కన్నీటి చుక్కలు చెక్కిళ్లమీదుగా జారి దర్బార్ సాహిబ్ ముందు పూల రెబ్బల్ని తడిపాయని ఆమెకి తెలీదు.

ప్రార్థన పూర్తయ్యాక ఆమె లేచి నెమ్మదిగా అకాల్ తఖ్త్ వేపు సాగింది. సంత్‌జీని కలుసుకోవాలని కాదు - ఊరక ఆ దారంట బైటికి వెళ్లిపోదామని. ఆమె ఆ దరిదాపుల్లోకి చేరేసరికి అక్కడంతా మహాకోలాహలంగా ఉంది. చీమలపుట్ట పగిలినట్టు జనం కిక్కిరిసి ఉన్నారు. మోర్చా మొదలవుతోంది. మొదటి జట్టుకి జత్తేదార్ మాలువాల్ నాయకత్వం వహించాడు. అది హృదయాన్ని కదిలించే దృశ్యం. కిక్కిరిసిన ఆ జనం మోర్చాలో పాల్గొంటున్న మొదటి జట్టుని స్పృశించ డానికి ఎగబడ్డారు. శుభాకాంక్షలు తెల్ప డానికి కాదు. ఆ అదృష్టవంతుల ఆశీస్సు లందుకోడం కోసం. జట్టులోని ప్రతి ఒక్కరి మెడలో మోయలేనన్ని దండలు. ఆగకుండా దండలు పడుతూనే ఉన్నాయ్. ఊపిరి సల్పకుండా దండలు తీసి పక్కన కుప్ప పోస్తూనే ఉన్నారు. జనం కీర్తనలు పాడుతున్నారు; 'వాహే గురూజీకీ' ఫతే అంటూ నినాదాలు చేస్తున్నారు. అంతటి కోలాహలం క్షణాల్లో హఠాత్తుగా సద్దు మణిగింది. ఊరేగింపు సాగిపోయింది. ఆవరణ ఖాళీ అయింది. స్వేవాదార్లు కూడా ఊరేగింపులో కలిశారు. నసీబ్ ఊరేగింపు సాగిపోయిన వేపు చూస్తూ ఒంటిగా నిలబడిపోయింది.

ఊరేగింపు కనుమరుగైపోయినదాకా ఆమె అలానే నిలుచుండిపోయింది. ఆమె ఏదో ఆధ్యాత్మిక తాదాత్మ్యంలో పరిసరాల స్పృహకోల్పోయి నిలుచుండిపోయింది. ఎవరో ఆమె తలమీద చెయ్యివేసినప్పుడు





మళ్లీ ఈ లోకంలో పడింది. తలెత్తిచూస్తే ఎదురుగా శతవృద్ధ బాబా బుడ్డాసింగ్. తను చూస్తున్నది నిజమేనా అని రెప్పలాడించింది. బాబా బుడ్డాసింగ్ రామదాస్ గ్రామంలో ధ్యాన సమాధిలో ఉన్నారు. ఆయనిక్కడికి ఎలా వచ్చారు? తనకళ్లని తనే నమ్మలేకపోయింది. ఆయన అక్కడే భూగర్భగృహంలో అర్ధశతాబ్ది పైచిలుగ్గా ధ్యానంలో ఉన్నాడు. ఆయన శతాధిక వృద్ధుడు. ఆయన వయస్సు నూటయాభై పైచిలుకుంటాయని కొందరంటారు. ఆయన నిటారుగా నిలబడ్డాడు. జాలువారే తెల్లటిగడ్డం, పసుపుపచ్చ తలపాగా, క్రాస్ బెల్టుకి వేలాడే కృపాణం, కుడిచేతి మణికట్టుకు దళసరి ఇనుపకడియం, ఎన్నడో భక్తులు అభిమానంతో సమర్పించిన పర్షియన్ నూలు తావళం, కాళ్లకు కొయ్యపాదరక్షలూ....

"ఇది కలకాదు బిడ్డా" అన్నాడు బాబా బుడ్డాసింగ్ మధురస్వరంతో. ఆమె చప్పున వంగి, ఆయన పాదాలకు నుదురు తాకించింది. కాని బాబా నిటారుగా నిలబడే వున్నాడు – వినోదం చూస్తూన్నట్టుగా, క్షమిస్తున్నట్టుగా. ఆమె పైకి లేచింది. బాబా ఆశీర్వదించనందుకు బిత్తరపోయింది. ఆయన చిరునవ్వు నవ్వాడు.

"బిడ్డా... ఒక్కటి గుర్తుంచుకో. గురువుల సాన్నిధ్యం అనుభవించాలని అనిపించినప్పుడు, వాళ్ల స్పర్శానందాన్ని పొందాలని అనిపించినప్పుడు సిక్కు సంగత్ సభ్యుల జోళ్లు స్పృశించు. స్పృశించడంమాత్రమే చాలదు. వాటిని శుభ్రంచెయ్యి. ఒక్కొక్క జతతీసి వరసగా పేర్చి పెట్టు. నావి కేవలం మనిషి పాదాలు బిడ్డా. వాటిని తాకినందు వల్ల పుణ్యం కలగదు" అంటూ ఆయన ఒక్కక్షణం ఆగి ఆమెకేసి నిశ్చల దృష్టితో చూశాడు.

"నీ శ్రద్ధాభరితమైన విశ్వాసానికి నేను తాకాలి నీ పాదాలు. అయినా తాకను. ఎంచేతనంటే నీ భక్తిశ్రద్ధలు తప్పుదోవలో ఉన్నాయి"

"ఏవిధంగా బాబాజీ? నాకు తెలియ జెప్పండి. మీరు ఆదేశించే విధంగా నన్ను నేను సరిదిద్దుకుంటాను" అంది నసీబ్ చేతులు జోడించి. ఆ క్షణంలో ఆమె మనస్సులో భయం తోచింది. తనవల్ల తప్పేమైనా జరిగిందేమో! తను తలపెట్టిన కార్యానికి గురువుల సమ్మతి లేదేమో! పంథ్ సిద్ధాంతాలకు విరుద్ధమైందేమో....!

"నా పిలుపు వినపడేదాకా ఓపిక పట్టు. అప్పుడు ఆ ప్రకారం చెయ్యి. గురువులు నీ అజ్ఞానాన్ని క్షమిస్తారు" అంటూ బాబా బుడ్డాసింగ్ హర్‌మందిర్ లోకి వెళ్ళిపోయాడు.

నసీబ్ శిలానుభవం పొందినట్టుగా నిలబడిపోయింది. ఆమె కళ్ళలోనీళ్లు నిలిచాయి. బాబా ఇప్పుడిక్కడికి ఎందుకొచ్చారనేది ఆమె మనస్సులో శేష ప్రశ్నగా మిగిలింది. ఆయన ఈ ప్రపంచాన్ని పరిత్యజించారు. సమాధి పొందినట్లుగా రామ్‌దాస్ గ్రామంలో ఉండిపోయారు. ఏడాదికొక్కసారి గురునానక్ జన్మదినం నాడు తన గుహ వదిలి సంగత్‌కు అభివాదాలు చెప్పడానికి బైటికివస్తారు. అదయినా అర్ధగంటసేపుండి అదృశ్యమైపోతారు. అటువంటిది ఆయనీరోజు ఎవరికీ తెలియబర్చకుండా, ఎవరి తోడూ లేకుండా, అజ్ఞాతంగా హఠాత్తుగా ఇక్కడ ఊడిపడ్డంలో ఆంతర్యమేమిటి ? ఏ కార్యార్థం ఆయనిలా రావలసివచ్చిందో? జరగబోయే హఠాత్సంఘటన ఏదో ఆయన



నిక్కడికి రప్పించిందేమోనన్న శంక ఆమె మనస్సులో చెలరేగింది.

తన శ్రద్ధాభరితమైన విశ్వాసం తప్పుదోవలో ఉందని ఆయన చేసిన వ్యాఖ్య, తన పాపం క్షాళనచేసుకోడానికి ఆయన పిలుపుకోసం వేచివుండమని చెప్పిన హితవు ఆమెని చికాకు పెట్టే శాయి. మనస్సంతా ఆందోళనతో నిండి పోయింది. గురువచనాన్నిగాని, సిక్కు మతధర్మ సూత్రాల్నిగాని ఏ కొంచెం కూడా అతిక్రమించే ప్రయత్నమే తనెన్నడూ చెయ్యలేదే! అయినా, బాబా మాటని నమ్మకుండా వుండలేదు. ఆయన వెంటపడి పరిగెత్తాలనిపించింది. ఆయన పాదాలమీద పడిపోయి క్షమాభిక్ష అడగా లనిపించింది. తను చేసిన తప్పేదో తనకి తెలీకపోయినా ఆయన ద్వారా గురువుల క్షమాభిక్ష పొందాలని తహతహలాడింది. అంతలోనే తననితాను నిగ్రహించుకుంది బాబా బుద్ధాసింగ్ సాధారణ యోగి కాదు. ఆయనని తొందరపెట్టటం సాధ్యంకాదు. పశ్చాత్తాపంతో ఆయన పాదాల మీద నిస్సహాయంగా, దీనంగా వాలిపోయి అనుగ్రహించమని బలవంతపెట్టటం సాధ్యం కాదు. ఆయన చెప్పిన ప్రకారం ఆయన పిలుపు కోసం తను వేచివుండాలి. అదే సరైన మార్గం. అదే సత్ప్రవర్తన.

కాళ్ల పీకుతున్నట్టుగా, కళ్లు తిప్పి నట్టుగా ఉండి ఆమె నేలమీద చతికిలబడి పోయింది. బరువెక్కిన గుండెతో, బాధ నిండిన మనస్సుతో ఆమె అలా కొద్దిసేపు కూర్చుండిపోయింది. తరవాత జపసాహిబ్ పఠించింది. ఉత్సాహం, శక్తి మళ్లీ చేకూరినట్లుగా అనిపించింది. ఓ అరగంట గడిచేక ఆమె నెమ్మదిగా లేచి ఇంటికి దారితీసింది. పక్కమీద మేనువాల్చినా నిద్ర పట్టలేదు. బాబా విగ్రహమే కళ్ల ముందు నిలిచింది. కన్ను మూసినా, తెరిచినా ఆయన మూర్తే కనిపించింది. అది ఆయన మూర్తి కాకుండా వుండా లనుకుంది. కాని కాదనుకోలేకపోయింది. సందేహ–విశ్వాసాల మధ్య ఆమె చితికి పోయింది. వేకువజామున ఆయన ఆమెకి కలలో కనిపించాడు. ఆయన ఆమె కను బొమల్ని చేత్తోస్పృశించాడు. ఎంతో ఊరటకలిగినట్లుగా అనిపించింది. మరు క్షణం నిద్రలోకి జారిపోయింది. మర్రోజు మధ్యాహ్నందాకా మెళకువ రాలేదు.

అప్పుడు లేచి స్నానం చేసింది. గుర్బాణీ చదివింది. తిండిగురించి స్పృహ లేకుండా స్వర్ణమందిర్ వేపు ఉరుకెత్తింది. కోనేటి చుట్టూ తిరిగింది. ఆయనెక్కడా కనిపించలేదు. మందిరం లోపలికి వెళ్లింది. అక్కడా లేడాయన. అకాల్‌తఖ్ వేపు వెళ్ళింది. మెట్లెక్కి పైకి వెళ్దామనుకుంది. మెట్లదగ్గర జవాన్‌లాగా సదాకౌర్ నిల బడుంది. ఆవిడెవరో నసీబ్ ఎరగదు. లోపలికి వెళ్ళడానికి ఆమె తన పేరు చెప్పుకోవలసి వచ్చింది. అలా చెప్పటం ఆమెకి సుతరామూ ఇష్టంలేదు.

"లోపల ఏంపని?" అనడిగింది సదా కౌర్. ఆమె కంఠం అంత పెడసరంగా లేదు. సంత్‌జీ అంతరంగిక వర్గంలో నసీబ్ స్థానమేమిటో ఆమెకి తెలుసు.

"పెద్దమ్మా! నువ్వేమీ అనుకోనంటే అది బైటికి చెప్పకూడదు" అంది నసీబ్ నమ్రతగా. ఆ నమ్రత సదాకౌర్‌కి నచ్చింది. నిజానికి ఆ పిల్లపట్ల అట్లా ప్రవర్తించినందుకు సిగ్గుపడింది. వెంటనే పక్కకి తప్పుకుని దారి విడిచిపెట్టింది.

నసీబ్ సంత్‌జీ బసచేసిన గది దాటి పోయి కొట్టకొస గది ముందుకు నడిచింది. పహరా తిరిగే సేవాదారు ఆమెని చప్పుడు చెయ్యొద్దని మౌనంగా సైగ చేశాడు. అతను గదివేపు వేలెత్తి చూపించి బొటన వేలు, చూపుడువేలు కలిపి కదిలిస్తూ జపమాలలోని పూసల్ని లెక్కిస్తున్న భంగిమ సూచించాడు. ఆమెకర్థమైంది. బాబా బుడ్డాసింగ్ గదిలో ధ్యానంలో లీనమై ఉన్నాడు.

బాబాని గురించి ఎవరితోనైనా ముచ్చ టించాలని ఆమెలో తహతహ పుట్టింది. మామూలు మనుషులకు ఆయనని గురించి తెలీదు. రామ్‌దాస్ సాహిబ్‌లో ఉండ కుండా ఇప్పుడు అర్ధాంతరంగా స్వర్ణదేవా లయంలో బసచెయ్యడంలోని విశేషం వాళ్లకి అర్థంకాని విషయం. మెట్లు దిగి సదాకౌర్‌తో ముచ్చటించాలనిపించింది.

"పెద్దమ్మా! బాబా బుడ్డాజీ ఇక్క డున్నారని తెలుసా నీకు?" అనడిగింది నసీబ్.

"తెలవదు తల్లీ. అయినా ఆయన ఇక్కడెందుకుంటారు?" అని ఎదురు ప్రశ్న వేసింది సదాకౌర్.

అంటే చాలామందికి ఆయన రాక తెలీదు. అదే విచిత్రం. అయినా ఆయనని అకాల్‌తఖ్ లోపలికి వెళ్లనివ్వటమే కాకుండా ఆయనకి అక్కడుండే గదు లన్నిట్లో అతిమంచి గది చూపించి, బైట





కాపలా కూడా పెట్టారు. ఈ వ్యవహారం మొత్తం ఇంత గోప్యంగా ఎందుకున్నట్లు? అదేదో తను ఆరాతియ్యాలి.

ఆమె ఆ సాయంత్రం మళ్ళీ స్వర్ణ దేవాలయానికి వచ్చింది. కిందటిరోజు బాబా తనని అనుగ్రహించినచోట నిల బడింది. ఆయన బైటికి రాలేదు. ఆయన బైటికొచ్చేవరకు అక్కడే వేచివుండాలని నిర్ణయించుకుంది. దాదాపు కళ్ళు మూతలు పడుతున్నాయి. ఆమె తలమీద చల్లని చెయ్యి పడింది. తప్పకుండా బాబాయే అనుకుంటూ కళ్ళు విప్పింది. ప్రణామం చేసింది.

"మనస్సు అన్వేషిస్తూనే వుంటుంది బిడ్డా" అంటూ ఆయన ముందుకు సాగాడు. ఆమె ఆయన వెంట నెమ్మదిగా అడుగులు వేసింది. ఆ మహర్షిని చుట్టి వేసిన ఆధ్యాత్మిక తేజస్సు తనని తాకు తున్నట్టుగా తోచింది. ఆయన నెమ్మదిగా ముందుకు సాగిపోతోంటే దారిలో తారసిల్లే జనం గౌరవపూర్వకంగా నిలబడిపోయి భక్తితో తలలు వంచారు. ఆయనెవరో నిజంగా వాళ్ళకి తెలీదు. బహుశా ఆయన మహత్వమేదో వాళ్ళందర్లో ప్రసరించి వుండవచ్చు.

"మూసిపెట్టిన గదిలోంచి తప్పించుకు రావాలని పిచ్చుక చేసే ప్రయత్నంలాంటిది ఆ అన్వేషణ. అది గదంతా ఎగురుతూ తిరుగుతుంది. కిటికీ చట్టానికి, దానికి వేసిన గాజుపలకకి రెక్కలు కొట్టుకుంటూ ప్రయాసపడుతుంది. కాని ఆ గాజుపలక చాలా గట్టిది. దానికి కనికరంలేదు. పిచ్చుకది వ్యర్థప్రయత్నం, తెలివిలేని పని, గుడ్డితనం"

ఆయన కాసేపు మౌనంగా నడిచాడు. దారిలో ఓ చిన్న జగడమవుతోంది. మందిరం చుట్టూ జనం ప్రదక్షిణం చేసే పాలరాతి బాటమీద ఏడాది పిల్లడు ఒంటేలు పోశాడని పిల్లడి తల్లిమీద సేవా దారు కేకలు వేస్తున్నాడు.

"భగతా" అని పిలిచాడు బాబా గంభీరస్వరంతో. సేవాదారు గిరుక్కున బాబాకేసితిరిగి ఆయన మొహంలోకి చూసి చివాల్న ఆయన పాదాలపై వాలిపోయి క్షమాపణ వేడాడు.

"లే. నువ్వు ఎవరి మనస్సు గాయ పర్చావో వాళ్ళని క్షమాపణ అడుగు. ఒక గురు సిక్కుని నొప్పించటమంటే సాక్షాత్తు గురువుని నొప్పించినట్లే. ఇది గుర్తుంచుకో"

అతను లేచి నడుముకు చుట్టిన బట్ట విప్పి పిల్లడు మూత్ర విసర్జన చేసిన భాగాన్ని శుభ్రం చేశాడు. ఆ పిల్లడు, అతని తల్లిదండ్రులు సేవాదారుకేసి చకితులయిపోయి చూశారు. పెద్దవాళ్ళు నిజంగా కళవళపడిపోయారు. అతను వెంటనే రెండు లోటాలనిండా చల్లటి తియ్యటి మంచినీళ్లు తెచ్చి వాళ్ళ కందించాడు. మొదట కొంచెం సంకోచించి తరవాత కృతజ్ఞతలు చెబుతూ స్వీక రించారు. బాబా ముందుకు నడిచాడు. ఆయనవెనక అడుగులో అడుగువేస్తూ నసీబ్ అనుసరించింది.

"మూసిన గదినుంచి బయటపడ్డానికి ప్రయత్నంచేసే పిచ్చుక మాదిరే నువ్వూ వెతుకులాడుతున్నావు. జ్ఞానోదయంకోసం 'వాడి'కేసె ఎందుకు తిరగవు? 'వాణ్ణే' నిన్ను ముక్తిపథంలో నడిపించనివ్వు"

ఆమె అపరాధభావంతో కుంగిపోవ డానికి బదులు ఆయన విజ్ఞతకి ముగ్ధురా లయిపోయి తలాడించింది. ఒకవిధంగా తన బతుకుబాటపైన ఇతోధిక ఆత్మ

విశ్వాసం అంకురించింది.

వాళ్ళిద్దరూ అకాల్ తఖ్త్‌కు తిరిగివచ్చే సరికి చాలామంది గుమిగూడారు. అందరూ చేతులుజోడించి తలలువంచారు. నడవాలో సదాకౌర్ గ స్త్రీదళం బారుతీరి నిలబడ్డారు. నసీబ్ ఒక అంతస్థు ఎక్కాక ఆయనకి ఓ అడుగు దూరంగా ఆగిపోయింది. ఆయన తన గది చేరుకోవాలంటే ఇంకో వరస మెట్లెక్కాలి. ఆయనకి నసీబ్ ఆసరా కావాలి. నసీబ్ భుజంమీద చెయ్యి ఆనించాడు. వయోభారంతో ముడతబారి గరుకుగా ఉండవలసిన ఆయన చెయ్యి మెత్తగా, వెచ్చగా ఉంది. నసీబ్‌కి ఆశ్చర్యం వేసింది.బాబా బుడ్డాజీ ముఖంలో ముడతనేది కనపడదని వెంటనే గుర్తు తెచ్చుకుంది.

బాబాని గదిలో వదిలిపెట్టి నసీబ్ మెట్లు దిగి రాగానే సదాకౌర్ ఆమెని కౌగిలించుకుంది. బాబా స్పర్శభాగ్యంతో నసీబ్ పుణికిపుచ్చుకున్న పుణ్యంలో తనూ పాలుపంచుకోవాలని ఉన్నట్టుగా ఆమెని చుట్టేసింది. చుట్టూ వున్న జనం యావన్మంది ముందుకు తోసుకొచ్చారు. ఆ మహర్షి పవిత్రసన్నిధిలోకి తమనీ తీసుకెళ్ళమని అర్థించారు. ఆ జనాన్ని తప్పించుకుని షంషీర్ సాహిబ్ గురుద్వారాకి వెళ్ళటానికి ఆమె సదాకౌర్ సహాయాన్ని అర్థించింది.

ఆ రాత్రి నసీబ్ ఇంటికి వెళ్ళలేదు. రాత్రంతా మేలుకుని కూర్చుని గురు గ్రంథ్ సాహిబ్ పఠించింది. బిగ్గరగా రాగయుక్తంగా ఆలాపించింది. గది శ్రోతలతో నిండిపోయింది. వేకువదాకా జాగారం సాగింది. తెల్లవారబోయేముందు గ్రంథపఠనం ముగించి, ప్రార్థన కార్యక్రమం నిర్వహించింది. భక్తులందరికీ ప్రసాదంగా పంచిపెట్టటానికి చాలినన్ని పూలరెబ్బలు పోగుపడున్నాయి. ఎక్కడి విన్ని ? తను గురద్వారాలో ప్రవేశించినప్పుడు పూలు, పూలరేకులు అక్కడ లేవు. తను స్పష్టంగా చూసింది. బాబా బుడ్డాసింగ్ హితవు జ్ఞాపకం తెచ్చుకుని దాన్ని గురించి ఆలోచించడం విరమించింది.




జ్యోతిష్కులు అభివర్ణించే జగత్ప్రళయాన్ని జ్ఞాపకంచేసేఫక్కీలోపంజాబులో గొడవలు జరుగుతున్నాయి. ప్రభుత్వం అకాలీ మోర్చాని చాలా తక్కువ అంచనా వేసింది. మోర్చా మొదలై వారం తిరక్కముందే జైళ్లు క్రిక్కిరిసిపోయాయి. మరిక జైళ్లలో అడుగు పెట్టేదిలేదని ఆందోళనకారులు మొరాయించారు. రాజకీయ ఖైదీలకిచ్చే సకల సౌకర్యాలు తమకూ ఇవ్వాలని పట్టుపట్టారు. జైలు సిబ్బంది హడలిపోయారు. మామూలు నేరగాళ్లతో,అంపర్ ట్రయల్స్‌తోవ్యవహరించినట్లుగా అకాలీలతో వ్యవహరించటం కుదరదని వాళ్లకి తెలుసు.కాని జైళ్లకికేటాయించిన బడ్జెటు చాలా తక్కువ. ఆ కొద్ది బడ్జెటులో అకాలీలు డిమాండు చేసే సౌకర్యాలు సమకూర్చాలంటే జరిగే పనికాదు. ఇలా హఠాత్తుగా వరదెత్తే వేలాది ఖైదీల కోసం నిధుల కేటాయింపు జరగలేదు.

సాధారణ ఖైదీలకు పెట్టేనాసిరకంభోజనం ముట్టం పొమ్మన్నారు. ఖైదీకి రెండు చొప్పున శుభ్రమైనదుప్పట్లు తెమ్మన్నారు. పత్రికలు, రేడియోలు కావాలన్నారు. టేబులు భోజనం ఏర్పాటుచేస్తారా, చస్తారా అని మొండికెత్తారు. ఫలితంగా జైళ్లంటే అర్థంలేకుండాపోయాయి. అకాలీలు అస్తమానం జైళ్లలో లోపలికి, బైటికి యధేచ్ఛగా తిరుగుతున్నారు.చుట్టుపక్కల గ్రామాల నుంచి జనం వాళ్లకి భోజనం తెస్తున్నారు. ఈ రకమైన రాకపోకలకి జైలు నిబంధనలు ఒప్పవు. కాని రూల్సు మాట ఎత్తితే పులుసుకారిపోతుంది. జైళ్లు తగలబెట్టి ఖైదీల్ని బైటికి వదిలేస్తాం అని బెదిరించారు అకాలీ ఖైదీలు.

దానికితోడు అకాలీల ఫిర్యాదు పురస్కరించుకుని హైకోర్టు న్యాయమూర్తి జైళ్లని తనిఖీ చేసి ప్రభుత్వాన్ని అభిశంసించాడు. జైళ్లలోని పరిస్థితులుఅమానుషం అని తీర్పు చెప్పాడు. క్రిక్కిరిసిపోయిన ఖైదీలతో జైళ్లు చీకటి బొరియల్లాగా ఉన్నాయని వ్యాఖ్యానించాడు.

కాని ముఖ్యమంత్రి వైఖరి వేరుగా ఉంది. అకాలీ మోర్చా తీవ్రస్వరూపాన్ని ఆయన నిరుకారుస్తూ మాట్లాడాడు. ఢిల్లీలో జరిపిన పత్రికావిలేఖరుల గోష్టిలో మోర్చా చప్పబడిపోతోందని ప్రకటించాడు. ఖరీఫ్ పంటకోత, రబీ పైరు నాట్లు పూర్తిచెయ్యాలని రైతులు తహతహలాడుతున్నారే గాని మోర్చా గురించి పట్టించుకోవటంలేదని ఆయన వెల్లడించాడు. మోర్చా నియంత జత్తేదార్ లౌకేన్నీ,సంత్ భందర్నీ అరెస్ట్ చేయించలేనానని సవాళ్లు విసిరాడు. రాష్ట్రంలో శాంతిని పరిరక్షించాల్సిన దృష్ట్యా పోలీసులు గురుద్వారాలలో ప్రవేశించి నేరస్థుల్ని నిర్బంధంలోకి తీసుకోడానికి వీలుగా గవర్నరు చేత ప్రత్యేక ఆర్డినెన్సు జారీచేయించబోతున్నానని ప్రకటించాడు. నిజానికి ఆ ప్రకటన వల్ల అప్పటిదాకా మోర్చాకిదూరంగా ఉన్న వాళ్లు కూడా ఆవేశపడిపోయి అరెస్టులకి సిద్ధమయ్యారు.

సంత్ భందర్ మరో చరిత్రాత్మక ప్రసంగం చేశాడు.

"ఖాల్సాజీ! ఈ ముఖ్యమంత్రి, ఈ దారితప్పిన సిక్కు, నిజం చెప్పాలంటే సిక్కు వేషంలో ఉన్న ఈ గంగూ తన పోలీసు బలగాన్ని బూట్లతో, హెల్మెట్లతో ఆయుధాల్తో,యూనిఫారాలతో గురుద్వారాల్లోకి ప్రవేశింపజెయ్యటానికి సంప్రదాయ చట్టం నుంచి మినహాయింపు అడుగుతున్నాడు. భగవంతుని మందిరంలో ప్రవేశించేవాడు నేరస్థుడట! ఒక నేరస్థుడు దైవమందిరంలోకి అడుగుపెట్టాక ఇంకేమాత్రం నేరస్థుడు కాదనేది ఆ మూర్ఖుడికి తెలీదు. దైవసందర్శనమే ఎవరి పాపాలకైనా ప్రాయశ్చిత్తం. ఎవరైనా సరే నిర్మల హృదయంతో, పరిశుద్ధమైన ఆత్మతో గురుద్వారాలో ప్రవేశిస్తారు. అలాకాని పక్షంలో దానికి ఫలితం అనుభవిస్తారు.

ఖాల్సాజీ! ముఖ్యమంత్రి సిక్కు అయి వుండీ, జ్ఞానినని చెప్పుకుంటూకూడా మహా అజ్ఞాని. నిజానికి మనిషిపూస్తూ, తన సాయుధ బలగం గురుద్వారాలలో ప్రవేశించటానికి చట్టసమ్మతమైన మినహాయింపు అర్థించడం ద్వారా దైవద్రోహాన్ని కొనసాగించడానికి ప్రయత్నం చేస్తున్న ఈ ముఖ్యమంత్రే రాష్ట్రంలో అసలు నేరస్థుడు. ఈ తెలివితక్కువ సిక్కు ముఖ్యమంత్రికి విజ్ఞత ప్రసాదించమని మన దశమ గురువు గురుగోవింద్‌సింగ్ మహారాజ్ ని



ప్రార్థిస్తాను. లేదు ఖాల్సాజీ... ఇతనికి తన ధర్మం సక్రమంగా నిర్వర్తించాలని లేదు. భగవంతుని మందిరాన్ని అపవిత్రం చెయ్యటానికి పూనుకున్నాడు. ఇతను మరో అబ్దాలీ. అబ్దాలీ సిక్కు మందిరాన్ని తుపాకి మందుతో బద్దలు కొట్టించాడు. పవిత్ర సరోవరంలో పశువుల కళేబరాలు, కశ్మలం నింపి అపవిత్రం చేయించాడు. హర్‌మందిర్ చుట్టూ కాపలా పెట్టి సిక్కుల్ని లోపలికి అడుగు పెట్టనీకుండా అడ్డుకున్నాడు. కాని ఏమైంది? అతని పైశాచిక వాంఛ తీరలేదు. భగవంతుని మందిరానికి వ్యతిరేకంగా అతను చేసిన పాపాలకు హీనమైనచావు చచ్చాడు.

ఖాల్సాజీ! పానగోష్టల్లో, వేశ్యల నృత్య గానాలతో పవిత్ర మందిరాన్ని మైల పర్చిన మస్సారంగడ్‌ని మర్చిపోయారా? అతనికేగతి పట్టిందో మీకు తెలుసు. మెహతాబ్‌సింగ్, సుఖాసింగ్‌లు ఆ పాపి తలని తెగనరికి మైల కడిగేశారు.

ఆ బలమదాంధులు చెయ్యలేని పనిని ప్రధానమంత్రి దయాభిక్షతో గద్దెఎక్కిన ఈ ముఖ్యమంత్రి చేయగలననుకుంటు న్నాడు. ఢిల్లీ దర్బారు పెద్దలు ఇతనితో అవసరం తీరిపోయిందనుకుంటే రేపీ పాటికి అరటి తొక్కని రోడ్డు మీదికి విసిరేసినట్టుగా ముఖ్యమంత్రిని తోసి పారేస్తారు. ఇతగాడు మోర్చాని అణచి వెయ్యాలనుకుంటున్నాడు. గురుద్వారా లను మైలపర్చాలనుకుంటున్నాడు. ఖాల్సా ఆత్మశక్తిని నేలమట్టం చేయాలనుకుంటు న్నాడు. కాని, సిక్కు ఆత్మశక్తిని అణచి వెయ్యటం ఎవ్వరితరం కాదని ఈ తెలివి తక్కువ సిక్కు ముఖ్యమంత్రికి నిరూ పించాలి. అందుకై గురునానక్‌జీ జన్మ

 

దినంనాడు బ్రహ్మాండమైన ప్రజా ప్రదర్శనకు నాయకత్వం వహించడానికి నాకు అనుమతి ప్రసాదించమని చేతులు జోడించి సంగత్‌ని అర్థిస్తున్నాను"

సంత్ భందర్ చేతులు జోడించి లేచి నిలబడి అక్కడ చేరిన సిక్కు సంగత్ సమక్షంలో తలవంచాడు. శ్రోతలు ఉద్రేకంతో ఊగిపోయారు. పంథ్‌కి, సంత్‌కి, పవిత్ర లక్ష్యానికి జయజయ ధ్వానాలు చేశారు. సంత్‌జీ అభ్యర్థనని సంగత్ అనుగ్రహించింది; ఆశీర్వదిం చింది. సంత్‌జీ తన బసకి వెళ్ళిపోయాడు. కాని సిక్కు ప్రజావాహిని గంటల తరబడి అక్కడనుంచి కదలలేదు. సంత్‌జీ పున ర్దర్శనం ఇస్తాడని వేచే వుంది. ఆయన గురు గోవింద్‌సింగ్ మహరాజ్ అవతారం అన్నారు కొందరు.

మరునటిరోజు పత్రికలు సంత్ భందర్ ప్రసంగాన్ని అక్షరం బీరుపోకుండా పూర్తిగా ప్రచురించాయి. ముఖ్యమంత్రి గంగవెర్రులెత్తిపోయాడు. తక్షణం భారీ ఎత్తున జిల్లా, పోలీసు అధికార్ల బదిలీలకు ఉత్తర్వులు జారీచేశాడు. మోర్చాని అణచి వెయ్యలేకపోవటమే వాళ్ళ తప్పిదం. మోర్చా ఒక్కదాంతోటే ఊపిరాడక గిలగిల లాడ్తోంటే దాన్ని మించిన అనర్థం ఇంకొకటి సంభవించింది. నభా అనే చోట పాడుబడ్డ ఓ పాత భవనం తాలూకు కారాకాసుని ఉధృత సంఖ్యలో అరెస్టయ్యే అకాలీ ఆందోళనకారుల కోసం అధికార్లు తాత్కాలిక జైలుకిందమార్చారు. అది కాస్తా కుప్పకూలింది. యాభై ఒక్కరు ఖైదీలు దుర్మరణంపాలయ్యారు. దాంతో సిక్కు ప్రజలు యావన్మంది తిక్కరేగి ఒక్కుమ్మడి ప్రళయరుద్రులై విజృంభించారు. సమయానికి బాబా బుద్ధా సింగ్ అడ్డుపడకపోతే యావత్తు పంజాబు

కణకణ మండే కాగడా అయ్యేది. అయినా దాని పరిణామాలు దారుణంగా పరిణమించే ప్రమాదం తప్పిపోలేదు. జైలు సంఘటనలో చనిపోయిన మృతవీరుల చితాభస్మ పాత్రతో నభానుంచి ఢిల్లీకి ఒక బ్రహ్మాండమైన ఊరేగింపు తియ్యాలని అకాలీలు నిర్ణయించారు. ఆ పాత్రని ఢిల్లీలోని రికాబ్‌గంజ్ గురుద్వారాలో శాశ్వతంగా భద్రపరుస్తారు. ఊరేగింపు ఢిల్లీ చేరే రోజునే ఆసియా క్రీడల ప్రారంభోత్సవం. కేంద్ర ప్రభుత్వం కలవరపడిపోయింది. అది కాకతాళీయమే అయినా జైలు సంఘటనలో మరణించిన వారి చితాభస్మంతో సాగే ఊరేగింపు లాంటి దానివల్ల ప్రతిష్ఠాకరమైన ప్రారంభోత్సవం అభాసుపాలు కావటం ప్రభుత్వానికి ఇష్టంలేదు. ఊరేగింపుని కేంద్ర పాలిత ప్రాంతంలో ప్రవేశించనివ్వకుండా ఆపాలంటే టాంకులతోసహా సైన్యాన్ని దింపాలి. అది చాలా అవాంఛనీయం. ప్రపంచ పాత్రికేయులంతా ఢిల్లీలో బస చేసివున్న సమయంలో అటువంటి తీవ్ర చర్య బెడిసికొడుతుంది. ఆసియా క్రీడల ప్రారంభోత్సవం మరుగునపడిపోయి అకాలీ ఊరేగింపు గొడవ ప్రపంచ వ్యాప్తంగా ప్రచారమవుతుంది.

హోం మంత్రి, హోం కార్యదర్శి, వివిధ గూఢచారి సంస్థల అధిపతులతో ప్రధానమంత్రి సమావేశమయ్యాడు.

"ఈ పరిస్థితిలో సరయిన తరుణోపాయమేదో చెప్పండి" అన్నాడు ప్రధానమంత్రి. అనవసరపు ఉపోద్ఘాతాలతో నాన్చకుండా ఏ విషయాన్నయినా సరాసరి సూటిగా కదపటం ఆయన ప్రత్యేకత.

"దాన్ని మనం ఆపేయాలి" అన్నాడు హోం మంత్రి తపీమని.

ప్రధానమంత్రి అతని మొహంకేసి చూడనైనాలేదు. ఇంటెలిజెన్స్ బ్యూరో డైరెక్టరు కేసి చూశాడు.

"ఊరేగింపు సాగే రూటుకు ఏసియాడ్ ఏరియాతో ఎటువంటి సంబంధం వుండదు సర్. తగుమాత్రపు జాగ్రత్తలో ఊరేగింపుని సాగనివ్వవచ్చు" అన్నాడు ఐ.బి. డైరెక్టరు.

ప్రధానమంత్రి 'రా' అధిపతికేసి చూశాడు.

"ఆ సూచనతో నేను ఏకీభవిస్తున్నాను సర్. ప్రారంభోత్సవానికి భంగం కలగనిమేరకి మనం ఊరేగింపుని అనుమతించవచ్చు సర్"

"సరే. పత్రికల సంగతి ఏంచేద్దామంటారు? ప్రపంచ పాత్రికేయులంతా దిగారు. ఇక మన పత్రికలవాళ్లు ఉండనే ఉన్నారు"

"ముందు జాగ్రత్తలంటూ తీసుకోవాల్సిన అవసరంలేదని నా అభిప్రాయం సర్. విదేశ పత్రికల విలేఖర్లకు ఊరేగింపు చూడాలని వుంటే వెళ్నిద్దాం. ప్రారంభోత్సవ వేడుకలు మానేసి ఊరేగింపు చూడ్డానికి వెళ్తారంటే నేను నమ్మను. అథవా వెళ్తారే అనుకుందాం. అది మన ప్రజాస్వామ్యాన్ని గురించి ఘనంగా ప్రచారం చేసుకోడానికి ఉపయోగపడుతుంది. ప్రభుత్వానికి వ్యతిరేకంగా నిరసన ప్రదర్శనలు జరపటానికి, ఆందోళన సాగించటానికి, ఊరేగింపులు తియ్యటానికి ప్రజలకు సంపూర్ణ స్వేచ్ఛ, అవకాశాలు ఇచ్చే మా ప్రజాస్వామ్య వ్యవస్థని చూడండి అంటాం. మీ ప్రసంగంలో ఊరేగింపు గురించి అతి క్లుప్తంగా ప్రస్తావిస్తే బావుంటుంది సర్.



ఆ సంఘటనపట్ల గాఢ సంతాపం వ్యక్తం చేసి ఉన్నతస్థాయి విచారణకు ఆదేశాలు ఇచ్చినట్లుగా రెండుముక్కలు చెబితే సముచితంగా ఉంటుందని నా అభిప్రాయం సర్. ప్రభుత్వం ప్రజాస్వామ్యానికి కట్టుబడి ఉందనీ, అల్పసంఖ్యాకవర్గాల వారితోసహా ఏ ప్రజల ప్రాథమిక హక్కుల్ని గానీ హరించడానికి ప్రభుత్వం వ్యతిరేకమని కూడా మీరు ప్రస్తావిస్తే బాగుంటుంది" అన్నాడు 'రా' అధినేత.

ప్రధానమంత్రి అతనికేసి చిరునవ్వు నవ్వాడు. అదే 'భారతరత్న' బిరుదిచ్చిన పెట్టు. సమావేశం ముగిసింది. 'రా' అధినేత సూచనని ప్రధానమంత్రి తు.చ. తప్పకుండా పాటించాడు.

ప్రారంభోత్సవం అనుకున్న మాదిరిగా వైభవోపేతంగా జరిగిపోయింది. అకాలీ ఊరేగింపు ప్రశాంతంగా సాగింది. అడిగిందే తడవుగా కేంద్ర ప్రభుత్వం అనుమతి ఇవ్వటం అకాలీలకు ఆశాభంగం కలిగించింది. అధికార్లు అడ్డంకులు పెడితే ఊరేగింపుకు గొప్ప ప్రాముఖ్యం వచ్చి వుండేదే. కాని ప్రభుత్వం ఆ అవకాశం దొరకనివ్వలేదు. అక్కడక్కడా అకాలీలు పోలీసుల్ని కవ్వించారు. కయ్యానికి కాలు దువ్వారు. కాని పోలీసులు నిగ్రహం ప్రదర్శించారు. ఏ దశలోనూ రెచ్చిపోలేదు. ఊరేగింపు బాంగ్లాసాహిబ్ గురుద్వారా దగ్గర ప్రశాంతంగా ముగిసింది.

క్రీడోత్సవాలు ప్రారంభమై వారం దాటింది. ఏ గొడవలూ లేవు. అంతా ప్రశాంతంగా ఉంది. క్రీడల మైదానాన్ని ముంచెత్తుతామని ప్రకటించిన అకాలీ బెదిరింపు పేలలేదు.

ఎనిమిదవరోజు. పాకిస్థాన్ క్రీడాకారులు తమకి కేటాయించిన మెటడార్ వ్యాను లో స్థానిక విహారయాత్రకి బైల్దేరారు. వ్యాను బాడీమీద 'ఏసియాడ్-82' అధికార చిహ్నం ఆకర్షణీయంగా కనిపిస్తోంది. పోలీసులు నిరభ్యంతరంగా వదిలేశారు. క్రీడాకారులు, మేనేజర్లు రోజూ నగర సందర్శనకి బైటికివెళ్ళి క్షేమంగా, సంతోషంగా తిరిగివస్తున్నారు.

మెహరాలీ రోడ్డులో ఐ.టి.ఐ. క్రాసింగు దగ్గర్లో మెటడార్ హఠాత్తుగా చెడిపోయింది. డ్రైవరు కిందికిదిగి ఫాల్టు కనుక్కొందుకు

శతవిధాల ప్రయత్నం చేశాడు. లాభంలేక పోయింది. ఆ సమయంలో అదృష్టం కరుణించినట్టుగా ఓ ఫియట్ కారు మెటడార్ పక్కనే ఆగింది. ఫియట్ డ్రైవరు లిఫ్టు ఇవ్వటానికి సంతోషంగా ముందు కొచ్చాడు. క్రీడాకారుల్లో నలుగురు ఫియట్‌లోకి మారారు. దానికి వెనక రెండు పాత డొక్కు అంబాసిడర్లు ఆగాయి. మిగిలినవాళ్లు అందులోకి మారారు.

మూడు వాహనాలూ క్రాసింగ్‌దగ్గర కుడిచేతివేపు తిరిగి దౌలాకౌన్ దిక్కుగా దూసుకుపోయాయి. గుర్గాం దాటగానే తళతళ మెరిసిపడే మెర్సిడెజ్ ఇంపోర్టెడ్ కార్లు రెండు ఫియట్, అంబాసిడర్లకు కొద్ది దూరంలో ముందు ఆగాయి. చెడిపోయిన మెటడార్ డ్రైవరు ఆరెంటిలో ఒకటి నడుపుతున్నాడు. పాకిస్తాన్ క్రీడాకారులు మళ్ళీ ఆ పోష్‌కార్లలోకి మారారు. బీరు, తిండి సమృద్ధిగా ఏర్పాటై ఉన్నాయి. కొత్త కార్లలోకి మారీమారగానే వాళ్లు బీరు సీసాలు నోటిక్కరుచుకున్నారు. గంగానగర్ దరిదాపులకి చేరేసరికి అందరూ మత్తులో జోగుతున్నారు. అక్కడ జీపులు సిద్ధంగా ఉన్నాయి. అర్ధచేతనావస్థలో వాళ్లు తూలూ జీపుల్లోకి మారారు. అదే స్థితిలో హవేలీ ముందు దిగి, లోపలికి నడిచారు. లోపల కోరుకున్నన్ని వసతులు, సౌకర్యాలు వాళ్ల కోసం సిద్ధంగా ఉన్నాయి.

సాయంత్రానికి టీము తిరిగి రాకపోయేసరికి అసలు విషయం బైటికి పొక్కింది. ఐ.టి.ఐ. క్రాసింగు దగ్గర వదిలేసిన మెటడార్ గురించి పోలీసులు ఏసియాడ్ అధికార్లకి తెలియజేశారు.

పాకిస్తాన్ క్రీడాకారుల గల్లంతు గురించి ప్రసారం చెయ్యొద్దని ఆకాశవాణి, దూరదర్శిని కేంద్రాలకు అర్జంటుగా తాఖీదులు వెళ్లాయి. పత్రికలవాళ్లకి ఎటువంటి ప్రకటనలు ఇవ్వవద్దని క్రీడల అధికార్లకు ఆదేశాలు అందాయి. విలేఖరులెవ్వరికీ ఇంటర్వ్యూలు అనుమతించే ప్రశ్న లేదు. అయినా అన్ని పత్రికలూ పాకిస్తాన్ క్రీడాకారుల అపహరణ సమాచారం తాటికాయంత అక్షరాల్లో ప్రచురించాయి. సమాచారం ఒక్కటేకాదు- ఫోటోలు సైతం ప్రచురించాయి. సమాచారం బైటికెలా పొక్కిందో, ఫోటోలు ఎక్కణ్నుంచి అందాయో అంతుపట్టని రహస్యం.

దీనికి ప్రతీకారంగా పాకిస్తాన్ అల్‌ఫతా సంస్థ భారత హైకమీషనర్ని, ఆయన కుటుంబాన్ని కిడ్నాప్‌చేసిన వార్త కూడా అదేరోజు పత్రికల్లో వచ్చింది.

"భారత ప్రభుత్వం పాకిస్తాన్ క్రీడాకారుల్ని క్షేమంగా, ఆరోగ్యంగా అప్పగించే వరకు హైకమీషనర్ని, ఆయన కుటుంబాన్ని విడుదల చెయ్యబోమని" అల్‌ఫతా నాయకుడు మంజూర్ అహ్మద్ కాబూల్‌లోని విదేశ పత్రికా ప్రతినిధులకి ప్రకటన ఇచ్చాడు.

భారత, పాకిస్తాన్ ప్రభుత్వాలు రెండూ నురగలు కక్కాయి. హామీ ఇచ్చిన మేరకి భద్రత సమకూర్చలేకపోయినందుకు భారత ప్రభుత్వం, అల్‌ఫతా సంస్థ దుందుడుకు అవివేక చర్య వల్ల ఇరకాటంలో పడ్డందుకు పాకిస్తాన్ ప్రభుత్వం రెండూ గందరగోళంలో పడ్డాయి. రెండు ప్రభుత్వాలూ ఈ సంక్షోభం గడిచి గట్టెక్కే ఉపాయం కోసం గాలిస్తున్నాయి. అదే సర్దుకుంటుందిలే అని వదిలేస్తే ప్రజలు తనని




బలహీనుడి కింద జమకట్టి, పరిస్థితి తన అదుపుతప్పి పోయినట్టుగా భావిస్తారేమోనని జనరల్ సలాల్ ఉల్లాఫౌద్ బింకం తెచ్చిపెట్టుకున్నాడు. భారత ప్రభుత్వానికి తీవ్రపదజాలంతో నిరసన ప్రకటించాడు. భారత ప్రభుత్వం జరిగిన సంఘటనకు క్షమాపణలు చెప్పి, 48 గంటలలోగా పాకిస్తాన్ జట్టుని క్షేమంగా అప్పగించని పక్షంలో పాక్ సాయుధ బలాలు ప్రత్యక్ష చర్యకి దిగటం అనివార్యం కావచ్చునని బెదిరించాడు. తనది ఉత్తి బెదిరింపు కాదని సమర్థించుకోడానికి సరిహద్దుల్లోకి భారీ స్థాయిలో సైన్యాన్ని తరలి వెళ్లమని ఉత్తర్వులు జారీచేశాడు.

జనరల్ ఫౌద్ అక్కడితో ఆగిపోలేదు. మళ్లీ ఇంకొక ప్రకటన చేశాడు. అల్‌ఫతా సంస్థకు ఆర్థిక, తదితర సహాయ సహకారాలు అందిస్తున్నట్లుగా భారత ప్రభుత్వం మీద ఆరోపణ చేశాడు. ఆసియా క్రీడల్లో భద్రత ఏర్పాట్లు చెయ్యలేని తన అసమర్థతని కప్పిపుచ్చుకోడానికే పాకిస్తాన్‌లో భారత హైకమీషనర్ని కిడ్నాప్ చేయించి నాటకం ఆడుతోందని భారతప్రభుత్వం మీద బాంబు వేశాడు.

భారతప్రభుత్వం ఆ ఆరోపణల్ని తిప్పికొడుతూ తమ రాయబారి అపహరణ పట్ల తీవ్ర నిరసన తెలియజేసింది. అంతర్జాతీయ దౌత్య సంప్రదాయాల్ని, చట్టరీత్యా తీసుకోవలసిన చర్యల్ని ఉద్ఘాటించింది.

ఈలోగా పాకిస్తాన్ క్రీడాకారుల కోసం గాలింపు మొదలయింది. మెహరౌలీ రోడ్డులో ఐ.టి.ఐ. క్రాసింగు దాటి పోలీసులు ముందుకి వెళ్లలేకపోయారు. రోహిణిలో చపలమైన మబ్బు జల్లుపడి బీటలువారిన నేల వాసన మటుమాయమైపోయినట్టుగా పాక్ క్రీడాకారుల జాడ తెలియకుండాపోయింది.

నసీబ్ రాజసాన్సీ విమానాశ్రయానికి దగ్గర్లో పెత్తల్లిగారి ఊరు లోహి చేరుకుంది. ఓ కమ్మరిని బట్టి ఆ ఊరుకు ఆ పేరు వచ్చింది. తుంటి సంబంధమైన వాతపు నొప్పుల చికిత్సకి పేరుపొందిన ఊరది. ఎడమ తుంటికి సోకిన వాతరోగం బాగు చేయించుకోడానికని నసీబ్ ఆ ఊరు చేరింది. కుంటుకుంటూ వీధినే నడుస్తూ పెత్తల్లిగారి ఇంట్లో దూరింది. ఒకవేపు కాలు నొప్పిపెడుతున్నా బరువైన సూట్‌కేసు పట్టుకుని బస్‌స్టాపు నుంచి గ్రామంలోకి ఆమె నడిచిరావటం ఊళ్లోవాళ్లెవరూ చూడకపోవటం ఒక అదృష్టం.

ఆ పెత్తల్లికి నసీబ్‌కౌర్ అంటే తగని ముద్దు. ఆమెకి ఆడపిల్లల్లేరు. ఒక్కడే కొడుకు. అతనికి చెల్లెలంటే తెగమురిపెం.

కుశల ప్రశ్నలయ్యాక నసీబ్ పెత్తల్లి పెళ్లిప్రస్తావన ఎత్తింది. ఆవిడ అప్పటికే ఓ సంబంధం నిర్ణయించింది. పిల్లవాడి ఊరు ఛీనా. యాభై ఎకరాల సుక్షేత్రం, తాతలు కట్టించిన ఓ హవేలీ, ట్రాక్టరు, జీపు, మోటార్‌సైకిల్ వగైరా హంగులన్నీ కలవాడు. మెట్రిక్‌తో చదువు ఆపటం ఒక్కటే లోటు. అయినా అది లోటుగా ఆమెకి కనిపించలేదు. ఒక్క వరిపంట మీదే సాలీనా యాభైవేలు వచ్చి పడతాయి. వరి కాక ఇంకా గోధుమ, చెరకు, పత్తి పుష్కలంగా పండిస్తారు. వరి ఊకని తగలబెట్టినట్టుగా డబ్బు తగలెయ్యగల స్తోమత ఉంది. నసీబ్ అన్నీ శ్రద్ధగా వింది.

"పెద్దమ్మా! నువ్వు, అమ్మ, నాన్న

చూసిన సంబంధం తప్ప నేను వేరేది చేసుకోను. సరేనా? మరి నా కాలేమో తీపు పుడుతోంది. నే వెళ్ళి కాస్సేపు పడుకుంటా. రేపు అన్నయ్యతోపాటు కమ్మరి వైద్యుడి దగ్గర చూపించుకొస్తాను" అంది నసీబ్ అమాయకంగా.

"ఆ వెధవకి నేనే కబురుపెడతాను. వాడే నా బిడ్డముందు రెక్కలు కట్టుకు వాలాడు"

"పెద్దమ్మా! ప్రతివాళ్ళమీదా పెత్తనం చెలాయిస్తానంటే ఎట్లాచెప్పు. గురుగోవింద్ సింగ్ మహరాజ్ ఏమన్నాడో తెలుసా? ఎవరుగానీ గర్వంగా, దురుసుగా ఉండకూడదన్నాడు. ఎదుటివాళ్ళకి మర్యాద చూపాలన్నాడు"

"ఓసి పిడుగా! నువ్వు పదిక్లాసులు చదివావ్...ఒప్పుకున్నా. అయినా మీ అమ్మకన్నా నీకెక్కువ తెలుసటే? నువ్వింకా ఎన్నో ఏళ్ళు గడపాల్సినంత జీవితం నేనిప్పటికే చూసేశాను. నువ్వు తాతకి దగ్గులు నేర్పుతావుటే?"

"అమ్మా! నువ్వు దాన్ని కాస్సేపు విశ్రాంతి తీసుకోనివ్వు. పడుకోబోయే ముందు అది కాస్సేపు చదువుకోవాలి కూడా" అన్నాడు కొడుకు సత్బీర్.

నసీబ్ అతని వంక కృతజ్ఞతాపూర్వకంగా చూసింది. చప్పున లేచి తన గదిలో దూరింది. పెత్తల్లిగారు కొడుకుతో కాస్సేపు పంటలు గురించి, చేలు గురించి మాట్లాడి ముసుగు తన్నింది.

సత్బీర్ నెమ్మదిగా నసీబ్ గదివేపు నడిచాడు. తలుపు తెరిచేవుంది. నసీబ్ అతనికోసమే కనిపెట్టుకుని వుంది.

"సిబూ! ఏంటి నీ రాచకార్యం?" అనడిగాడు సత్బీర్ కాస్త కటువుగానే.

"ఏం లేదన్నయ్యా" అంది నసీబ్ ఏమీ ఎరగనట్టు.

"నీకు నా సహాయం కావాలా వద్దా?" అనడిగాడు మళ్ళీ దూకుడుగా.

నసీబ్ కోపంగా లేచి నిలబడింది. ఏవిటి అన్నయ్య ఉద్దేశం?

"ఇక్కడికి రావటం నాదే పొరపాటు. ఇప్పుడే వెళ్ళిపోతా"

"చాలా సంతోషం" అన్నాడు సత్బీర్ వ్యంగ్యంగా.

"అన్నయ్యా ఆదరణ ఇదన్నమాట!"

"చెల్లెలే అబద్ధం చెబుతుంటే ఏ అన్న మాత్రం ఏం చేస్తాడు?"

"అంటే...? నీకు... నీకు...."

"నాకంతా తెలుసు. తస్నీమ్ మొదలు బాబా బుద్ధాసింగు వరకు..."

"కాని... కాని... ఎట్లా తెలుసు నీకు?"

"నాకెట్లా తెలుసో నువ్వు తెలుసుకోక తప్పదా?"

"తెలుసుకోగలిగితే నా పనిగురించి నాకొక కచ్చితమైన అవగాహన కలుగుతుంది. అయినా నిన్ను ఇరుకున పెట్టటం నాకిష్టంలేదు. అట్లాగే నిన్ను అగౌరవపర్చటం కూడా నాకిష్టం కానిపని. నీకెట్లా తెలుసనేది ఎందుకు తెలుసుకోవాలనుకుంటున్నానో నాకే తెలీదు. కానీ తెలుసుకోవటం నా మట్టుకి నాకు అవసరం"

"సిబూ! ఆడవాళ్ళ నోట్లో నువ్వుగింజ నానదంటారు. మనస్సులో ఉన్నది బైటికి కక్కెయ్యకపోతే వాళ్ళకి కడుపు వుబ్బిపోతుంది. వార్తాప్రసారంలో వాళ్ళముందు ఆలిండియా రేడియో బలాదూరు" అన్నాడు సత్బీర్ హాస్యంగా.

"అవన్నే అన్నయ్యా! నువ్వు మాత్రం బైటికి చెప్పవు. సర్లే... నేను మాత్రం రేపు ఉదయం పెట్టే బేడా





సర్దుకుని చెక్కేస్తాను"

"నువ్వొచ్చిన పని పూర్తిచెయ్యకుండానే వెళ్ళిపోతావన్నమాట! రేపంటే బహుశలేటు"

నసీబ్ అతనికేసి తుళ్ళిపడి చూసింది. ఏవిటి మాట్లాడుతున్నాడు? ఎలా తెలుసు ఇదంతా? తమ గుట్టు వెల్లడయిందా? ఎవరి ద్వారా? కోపంతో, నిస్పృహతో ఆమె కళ్ళల్లో నీళ్ళు నిలిచినై. సత్బీర్ చెల్లెలికేసి ఆప్యాయంగా చూస్తూ, ప్రేమగా ఆమె భుజాలచుట్టూచెయ్యివేసి– "పద" అన్నాడు. ఆమె భుజాలమీంచి చేతులు తీసేసి సూట్ కేస్ పట్టుకున్నాడు.

"వొద్దు" అంది నసీబ్ తీవ్రంగా.

అతను సూట్ కేసు కిందపెట్టి ఆమె వంక అభిమానంగా చూస్తూ చిరునవ్వు నవ్వాడు.

"ముందు చెప్పు!"

"ఏంటి?"

"నీకు తెలిసినదంతా. అబద్ధం చెప్పకు. చెప్పకూడదనుకుంటే కనీసం అదయినా చెప్పు. నువ్వు చెప్పనన్నావని నేను కోపం పెట్టుకోను"

"తప్పకుండా చెప్తా. కాని ఇప్పుడు కాదు... ఇక్కడ కాదు. ముందు నీపని పూర్తి కానివ్వు"

నసీబ్ అతని వంక ప్రశ్నార్థకంగా చూసింది.

"ఇంతవరకు మన చరిత్రలో ఏ అన్నా తన చెల్లెలికి ద్రోహం చెయ్యలేదు"

ఆ మాటతో మబ్బు వీడింది. ఇద్దరూ చప్పుడు చెయ్యకుండా గదిలోంచి బయట పడ్డారు. సత్బీర్ ట్రాక్టర్ బయటికి తీసి రాజసాన్సీ విమానాశ్రయం కంచెదాకా నడుపుకొచ్చి ఆపాడు. ఆ కంచెని ఆనుకుని అతని పొలాలు ఉన్నాయి.

"నువ్వు ఓ వార్తని ప్రసారం చెయ్యాలి. ఇది అనువైనచోటు. విమానాశ్రయం ఎప్పుడూ బిజీగా ఉంటుంది. వచ్చిపోయే విమానాల గురించి, వాతావరణం గురించి అస్తమానం ప్రసారాలు నడుస్తూ ఉంటాయి. ఇది నీకు ముసుగులాగా ఉపయోగపడుతుంది. రేపు తెల్లవారితే నా పొలాలు, ట్రాక్టరు వాళ్ళకి తెలిసే అవకాశమే లేదు."

నసీబ్‌కు జవాబుచెప్పే అవకాశం ఇవ్వకుండా అతను ట్రాక్టర్ని ట్యూబ్ వెల్ బోరుదాకా నడిపి కప్పీకి బెల్టు తొడిగాడు. అంతా తయారుచేసి, ఇంజను స్టార్టు చేశాడు. చప్పుడుచేస్తూ నీళ్ళు బయటికి చిమ్మాయి. అతను దూరంగా కూర్చుండిపోయాడు. నసీబ్ అతనికేసి కృతజ్ఞతాభావంతో చూస్తూ వైర్‌లెస్ సెట్టు బయటికి తీసింది. బయటంతా చీకటిగా ఉంది.

"ఇది దళ్ ఖాల్సా కేంద్రం. అకాలీ దళ్ ఖాల్సా. జాగ్రత్తగా వినండి. పాక్ క్రీడాకారులు మాదగ్గర క్షేమంగా, ఆరోగ్యంగా ఉన్నారు. ప్రభుత్వం మా డిమాండ్లను అంగీకరించేంతవరకు, ఆనందపూర్ తీర్మానాన్ని అమలుపర్చేటంతవరకు వాళ్ళు మాదగ్గరే ఉంటారు."

ఆమె ఆ సందేశాన్ని మూడుసార్లు మళ్ళీ మళ్ళీ చెప్పింది. అది చాలా శక్తివంతమయిన సెట్టు. సరిగ్గా వార్తలు ప్రసారంచేసే సమయంలో ఆమె తన సందేశం ప్రసారం చేసింది.

సెట్టు సూట్‌కేసులోపెట్టి, ఆమె సత్బీర్‌ని చేరేసింది. ఇద్దరూకలిసి ఇంటి మొగం పట్టారు. ట్రాక్టరు గ్యారేజిలో తోసి, సూట్‌కేసు గదిలోపెట్టి సత్బీర్

చెల్లెల్ని గిడ్డంగివేపు తీసుకువెళ్ళాడు. అక్కడ చూసినదృశ్యం ఆమెని నిర్ఘాంత పర్చింది. ధాన్యపు ఊకలో భాయ్ మహీప్ సింగ్ ఒళ్ళెరక్కుండా పడున్నాడు.

"అయితే...?" నసీబ్ అన్నవేపు తిరిగింది.

"అతనూ, నేను ఒకే హాకీ టీములో ఆడేవాళ్ళం. సన్నిహిత స్నేహితులం కూడా. అతను ఎవరో అధికారుల్ని కల వాలని వచ్చాడు. తను నేరుగా వెళ్ళి వాళ్ళని కలవటం ఇష్టంలేదు. నా దగ్గరకొచ్చాడు. నా సహాయం అడిగాడు. సంగతేమిటో పొంతం చెప్తే సహాయం చేస్తానన్నాను. వేరే దారిలేక తనకి తెలిసింది యావత్తు వెళ్ళగక్కాడు. అంతా కాగితం మీద రాసివ్వమన్నాను. రాసిచ్చాడు. వేడివేడి పాలలో చక్కెర కలిపి, చక్కెరతోపాటు పిల్స్ కూడా వేసి ఇచ్చాను. అంతే"

"ఆ కాగితం?"

"తగలెట్టాను. ఇంకే ఇతర సాక్ష్యాధారాలు లేకపోతే నువ్వు సేఫ్"

"ఇతని సంగతి?"

"స్పృహరాగానే పిల్స్ కోసం ఏడుస్తాడు. అట్లా కట్టిపడేస్తాను"

"పిల్స్ అంటే?"

"అదే తెలీదా? ఈ కాలపు కాలేజీ కుర్రాళ్ళు, టీచర్లు అందరూ పిల్స్ మాయలో పడిపోయారు. మందు కన్నా, నల్లమందు కన్నా చాలా స్ట్రాంగు"

"మరితణ్ని ఏం చేస్తావ్?"

"మీగొడవపూర్తయ్యాక వొదిలేస్తాను. దళ్ ఖాల్సా, పోలీసులు నీకోసంగాలిస్తుండే క్షేమంగా నా గిడ్డంగిలో దాచానోయ్ అని చెప్తా. బతికినంతకాలం నన్ను జ్ఞాపకం పెట్టుకుంటాడు"

"మరి వైర్ లెస్ సెట్టుని ఏం చేద్దాం? వాళ్ళు రేపు ప్రతి ఒక్కళ్ళనీ పరీక్ష చేస్తారు"

"నిన్ను చెయ్యరు. నువ్వు రేపు నాతో బైల్దేరుతున్నావ్. రేపు స్వర్ణదేవాలయంలో గురూకాలంగర్ కి బియ్యం, కూరగాయలు చేరవేసే డ్యూటీ ఉంది. ప్రతి సంవత్సరం ఒకరోజు నా వంతు. వాళ్ళ జాబితాలో నా పేరుంది. సరిగ్గా రేపే నా వంతు. సూట్ కేసు కూరగాయల అడుగున పారెయ్యి. ప్రమాదం లేదు"

"విరగ్గొట్టేసి బావిలో పారేస్తేనో?"

"పిచ్చిపిల్లా! ఆ పని చేశావో కొంప లంటుకుపోతాయ్. అది మళ్ళీ స్వర్ణదేవాలయానికే చేరాలి. అక్కడే దానికి భద్రం. ముందు నీ వేలిముద్రలు చెరుపు. ఇక ముందు నీ ఇష్టం వచ్చింది చేసుకో. కాని ఇటువంటి తిరుగుబాటు వ్యవహారాల జోలికి పోయావో..."

"పోతే...?"

"అమ్మ చెప్పిన ఛీనా వెళ్ళి ఆ కుర్రాడితో సంబంధం ఖాయం చేసివస్తా"

నసీబ్ అన్నమీద కలబడి పిడికిళ్ళతో మెత్తగా గుద్దుల వాన కురిపించింది. సత్బీర్ ఎల్లెల్ని చేతుల్లో పొదివి పెట్టి ప్రేమగా కనుబొమని ముద్దుపెట్టుకున్నాడు.

నసీబ్ తన గదిలో పక్కమీద మేను వాల్చాక చాలాసేపు సత్బీర్ ని గురించి ఆలోచిస్తూ మేలుకునే ఉంది. నిజంగా అటువంటి మంచి మనుషులు లేకపోతే ఈ ప్రపంచం నరకప్రాయం అయ్యేది అనుకుంది. "నిన్ను ఆ ఛీనా కుర్రాడికి కట్టబెట్టాలనుకునే నీ పెద్దమ్మలాంటి మనుషుల మాటో?" అనడిగింది ఆమె లోపల మరో గొంతు.

"నోరు మూసుకోవే. పెద్దమ్మ దగ్గ





జోకరు" తన జవాబుకు తనే పెద్దగా నవ్వుకుని నిద్ర ఒడిలోకి జారిపోయింది.

* * *

అకాలీ తీవ్రవాదుల దుందుడుకు చర్యపట్ల దేశంలో సర్వత్రా ఆక్షేపణ, నిరసన వెల్లడయ్యాయి. పార్లమెంటులో, ప్రభుత్వ కార్యాలయాల్లో, హోటళ్ళలో, వీధుల్లో, బస్సుల్లో, రైళ్ళల్లో, ఆఖరికి డైనింగ్ టేబుళ్ళ ముందు కూడా అందరూ ఆ దుశ్చర్యని దుయ్యబట్టటం వినిపించింది. బొచ్చుకుక్కమీద జోరీగల దండు హఠాత్తుగా ముసిరినట్లుగా ఉంది.

ప్రధానమంత్రి వివిధ గూఢచారి సంస్థల అధిపతుల్ని పిలవనంపాడు.

ముఖ్యమంత్రి గ్యాని టీప్‌సింగ్ తన రాజకీయ సలహాదారు మోతీరాంతో మంతనాల్లో మునిగితేలాడు.

సంత్ ఘందర్ నసీబ్‌కి కబురంపాడు.

జత్తేదార్ లౌకే అకాలీదళ్ కార్యవర్గాన్ని అత్యవసర సమావేశానికి పిలిచాడు.

"నువ్వు నమలగలిగినదానికన్నా పెద్ద ముక్కని కొరికేశావ్ నసీబ్" అన్నాడు సంత్ ఘందర్ ప్రశాంతస్వరంతో.

"మేం చేసినపని కనీసం ప్రభుత్వాన్ని కుదిపేసింది" అంది నసీబ్.

"అది నీ పునాదుల్ని కూడా కుదిపెయ్యవచ్చు తల్లీ"

నసీబ్ జవాబు చెప్పలేక మౌనంగా ఉండిపోయింది.

"అది మనం దేశద్రోహులం అని ముద్రవేసింది"

"మనం యుద్ధంలో ఉన్నాం సంత్‌జీ. యుద్ధ చర్య సమర్థనీయం"

"కాదు నసీబ్! ఎందుకంటే మనం యుద్ధంలో లేం. మనం భారత ప్రభుత్వంతో నిజంగా యుద్ధమే చేస్తుంటే మన షరతులేవో మనమే నిర్దేశిస్తాం. అప్పుడు మా కోర్కెల్ని అంగీకరించమని ఇలా ప్రభుత్వానికి విజ్ఞప్తి చెయ్యం"

"సింహం-లేడి ఛాయా భేదం మాత్రం. సంత్‌జీ"

"ఈ దేశంలోని ఇతర వర్గాల, మతాల సానుభూతిని కోల్పోతాం"

"సిక్కులకు ఎవరి సానుభూతీ అవసరం లేదు. వాళ్ళ హక్కులేవో వాళ్ళకి తెలుసు. వాటికోసం వాళ్ళు పోరాడగలరు. మీరు ఒక ప్రసంగంలో ఆ మాటే చెప్పారు గదా!"

"సందర్భ శుద్ధిలేదు. నేను ఆనాడు అలా ప్రసంగించిన సందర్భం వేరు. కేంద్ర హోంమంత్రి సిక్కుల డిమాండ్లను సానుభూతితో పరిశీలిస్తానన్నాడు. మన డిమాండ్లను మహజరు రూపంలో సమర్పిస్తే సానుభూతితో చూస్తానన్నాడు ముఖ్యమంత్రి. ఆ సందర్భాన్ని బట్టి మట్లాడవలసిన పద్ధతి అది"

నసీబ్ బిక్కచచ్చి నమ్రతతో తల వంచింది.

"ఇప్పుడేం చేద్దామంటారు?"

"ఏమీలేదు. పరిస్థితి ఏ మలుపు తిరుగుతుందో వేచిచూడు. దాన్ని బట్టి అప్పటి కప్పుడు కార్యక్రమం వెయ్యి. కాని పరిస్థితి ఇంకా విషమించకుండా మాత్రం చూసుకో"

సంత్‌జీ కళ్లు మూసుకున్నాడు. నసీబ్ బరువెక్కిన గుండెతో బైరాగి గదికి తిరిగి వచ్చేసింది. పాకిస్థాన్ జట్టుని హైజాక్ చెయ్యటం జాతీయ వ్యతిరేక చర్యగా ప్రజలు పరిగణిస్తారని తనకి ఎన్నడూ తట్టనేలేదు. ఏం చెయ్యటానికీ పాలు పోవటంలేదు. తాను తలచిందొకటి...కలిగిన ఫలితం మరొకటి. సంత్‌జీ సంభా

షణని తను మర్చిపోలేకపోతోంది. అంత తీవ్రవాది సంత్‌జీకి సైతం తనంటే విసుగు పుట్టిందేమోనని భయంవేసింది. తన భయం నిరాధారం అనుకుంది. కాని ఆ సంవేదన మనస్సులోంచి పోవటంలేదు.

సంత్‌జీ ఆదేరోజు ఓ లిఖితపూర్వక ప్రకటన ఇచ్చాడు.

"పాక్ జట్టుని ఎత్తుకుపోవటానికి సంబంధించి అకాలీదళ్ ఖాల్సా చేసిన అనధికార రేడియో ప్రసారం నా దృష్టికి వచ్చింది. అకాలీదళ్ ఖాల్సా చర్య కేవలం అనివార్య పరిస్థితుల్లో సంభవించిన రాజకీయ ఆవశ్యకతే తప్ప దేశ వ్యతిరేక చేష్టకాదు.

దళ్ ఖాల్సా కార్యకర్తల్ని దేశద్రోహులని నేననను. జనతా హయాములో యూత్ కాంగ్రెస్ కార్యకర్తలు ఇండియన్ ఎయిర్‌లైన్స్ విమానాన్ని దారిమళ్లించిన సంఘటన లాంటిదే ఇది. కొన్ని సమస్యల్ని వెలుగులోకి తేవటానికి వాళ్లు ఆ పని చేశారు. అలాగే, అకాలీదళ్ ఖాల్సా కూడా కొన్ని నిర్దిష్ట సమస్యల్ని వెలుగులోకి తేవటం కోసం ఈ పని చేసింది.

తమ స్వంత ప్రభుత్వమే తమని నమ్మకపోవటంవల్ల తీవ్ర అసంతృప్తికి లోనైన కొందరు కోపోద్రిక్త యువకులు చేసిన మొండి తెగింపు చర్య అని నేను అంగీకరిస్తాను. వాళ్లు తమ పూర్వులు రక్తం చిందించిన స్వంత దేశంలోనే వ్యక్తిత్వం నిరాకరించబడ్డవాళ్లు; తమ నిష్ఠురకష్టాల్ని చాటాలనుకున్న కారణంగా దేశద్రోహులని ముద్ర పడ్డవాళ్లు; దేశానికి అత్యంత విశ్వాసపాత్రులైన శౌర్యపరాక్రమశాలురై కూడా అమాంతం అవాంఛనీయులైనవాళ్లు.

పాకిస్థాన్ ప్రజలపట్ల సిక్కులకెలాంటి శత్రుత్వ భావం లేదని వాళ్లకి నేను హామీ ఇస్తున్నాను. పాక్ క్రీడాకారులు మాకు గౌరవనీయ అతిధులుగా ఉన్నారు. వాళ్లు క్షేమంగా, సుఖంగా

స్వదేశం తిరిగి వస్తారు.

భారత ప్రభుత్వం విజ్ఞత ప్రదర్శించి సువిశాల భారత మహాజాతిలో ఒక స్వతంత్ర అస్తిత్వం కల సంఘంగా సిక్కుల హక్కుల్ని గుర్తించమంటున్నాను. భారతదేశానికి సిక్కులు, సిక్కులకు భారతదేశం అన్యోన్యావసరమని గుర్తుంచుకోండి. ఉభయులూ అవిభాజ్యం; పరస్పరం కావలసినవాళ్లు"

సంత్ థండర్ ప్రకటన ప్రభుత్వానికి ప్రత్యక్ష హెచ్చరికగా, సాయుధ పోరాట సూచనగా కనిపించింది చాలా మందికి. ఇటువంటి తిరుగుబాటు ప్రచారాన్ని తుంచి వెయ్యటానికి సంత్ థండర్‌కి వ్యతిరేకంగా ప్రభుత్వం ప్రత్యక్ష చర్యకు పూనుకోవాలని పత్రికలు రొదచేశాయి. గురుద్వారాల్ని ప్రభుత్వం స్వాధీనం చేసుకోవాలన్నాయి. సాయుధ బలాలలో సిక్కుల సంఖ్యా బలాన్ని తగ్గించివెయ్యాలన్నాయి. దేశ భద్రత దృష్ట్యా కీలక కార్యాలయాల్లో కీలక పదవుల్లో ఉండే సిక్కుల్ని తక్షణం తొలగించాలనేంత దాకా వెళ్లాయి.

ఈలోగా మాజీ జనరల్ షాబాజ్ సింగ్ ధురియా మాజీ సైనికులంతా తనతో వచ్చి చేరమని పిలుపిచ్చాడు. ఆయన ఇటీవలే పదవీ విరమణ చేశాడు. అతి నిర్భయుడని ప్రతీతి. అనేక వీరచక్రాలు, పతకాలు పొందినవాడు. ఆయన పిలుపులోని అంతరార్థం అందరికీ బోధపడింది. సిక్కులు సాయుధపోరాటానికి సన్నద్ధులవుతున్నారన్న మాట. ప్రజలు నిర్ఘాంతపోయారు. జనరల్ షాబాజ్ సింగునీ,అకాలీ నాయకుల్ని ప్రభుత్వం తక్షణం అరెస్టు చెయ్యాలని పత్రికలు గోలపెట్టాయి.

ముఖ్యమంత్రి గ్యాని దీప్‌సింగ్ తన రాజకీయ సలహాదారు మోతీరామ్‌తో సమాలోచనలు జరుపుతున్నాడు.

"తాడోపేడో తేల్చనైనా తేల్చాలి లేదా తక్షణం తప్పుకోవాలి. వేరేమార్గం లేదు" అన్నాడు మోతీరామ్ ప్రత్యక్షరం ఒత్తిపలుకుతూ.

"సమస్యని బహు తేలిగ్గా తేల్చిపారేశావ్. అంత సులభమనుకుంటున్నావా?"

"సమస్యని మీరు మరీ గందరగోళం చేసేశారు. సంత్‌ని రెచ్చగొట్టొద్దంటే ఆరోజు నా మాట విన్నారూ? అదీ ఎప్పుడు? అకాలీదళ్‌నీ, అతని ప్రత్యర్థి లొంకేని ఎదుర్కోటానికి అతని సహాయం అడిగేక మీరతణ్ణి రెచ్చగొట్టటంలో అర్థమేమైనా ఉందా?"

"అదంతా గతం"

"కాదు సర్దార్‌సాబ్! మీరీ కుర్చీలో కూర్చున్నంతకాలం అది మిమ్మల్ని వెంటాడుతూనే ఉంటుంది. మీరీ కుర్చీ దిగాక అది గతం అవుతుంది"

"మోతీ! నేను కుర్చీ దిగాలని నీకు తొందరగా ఉన్నట్టుంది" అన్నాడు గ్యానీదీప్‌సింగ్ వాడిగా.

"ఔనౌను. మీరు దిగితే ఈ సింహాసనం నేనెక్కాలని" అన్నాడు మోతీరాం నిష్ఠూరంగా.

"మోతీ! మనం కొట్లాడుకోటానికి ఇక్కడ కలవలేదయ్యా. చిక్కుముడి విప్పటం ఎట్లానా అని ఉపాయం ఆలోచించాలిగాని మనం చిక్కుల్లో తగులుకోకూడదు"

"అయితే వినండి సర్దార్‌సాబ్! పాక్ జట్టుని పంజాబుకే ఎత్తుకొచ్చారని మీకు తెలుసు. వాళ్ళని వేరే రాష్ట్రంలో దాచిపెట్టటం దళ్‌ఖాల్సావాళ్ళ వల్లకాదు. కాని మీరేం చెయ్యగలిగారు? వాళ్ళని వేటాడి

మట్టికరిపిస్తే మీ కీర్తి చుక్కలు చూసేది. అయినా మీరేమీ చెయ్యలేకపోయారు. ఇప్పుడు అసలు ప్రశ్న ఏంటంటే మీరీ పరిస్థితిని అదుపు చెయ్యగలరా లేదా? కేంద్రం మిమ్మల్ని ఈ పదవిలో కొన సాగనిస్తుందా, ఊడబెరుకుతుందా? మీకు చాయిస్‌లేదు. అది ఢిల్లీ పెద్దల చేతుల్లో ఉంది"

"అయితే నా అంతట నేనే దిగిపోవా లంటావా?"

"నేనైతే అనను. కేంద్రంలో వాళ్ళు మాత్రం వెంటనే యస్సంటారు. నా మాట వినండి. సంత్‌జీల్ని, జత్తేదార్లని అరెస్టు చేయించండి. పోలీసుల్ని గురుద్వారాల్లో ప్రవేశించమనండి. జోళ్లు విడిచేసి మాత్రమే వెళ్లమనండి. అమృత్‌సర్ గుండా వెళ్లే ఆర్మీ ఆఫీసర్లు యూనిఫారా లతో వెళ్లి పూజచేసి రావటంలేదూ? పాకిస్థాన్‌తోజరిగిన గత రెండు యుద్ధాల్లో సిక్కు జనరల్స్‌ని స్వర్ణదేవాలయం అధి కార్లు సన్మానించలేదూ? అప్పుడు యూని ఫారాలు వేసుకుని, మెడల్సు తగిలించు కుని సకల హంగుల్తో వచ్చి సన్మానాలు చేయించుకోలేదూ ? వాళ్ల అంగరక్షకు లైతే ఆయుధాలతోసహా గురుద్వారాలో ప్రవేశించారు"

"సరైన పాయింటు చెప్పావ్. మంత్రి వర్గ సమావేశం ఏర్పాటు చెయ్యి. వాళ్ళని నేను ఒప్పించాలి. నువ్వు కూడా హాజరవు"

గ్యాని దీప్‌సింగ్ మనస్సులో మళ్ళీ ఆశ అంకురించింది. మొహంలో ఉత్సాహం దీపించింది. మోతీరామ్ ఓ సానుభూతి చూపు పారేసి చకచకా వెళ్ళి పోయాడు.

గూఢచారి సంస్థల అధిపతులందర్లో 'రా' అధిపతంటే ప్రధానమంత్రికి మహా గురి. క్యాబినెట్ సమావేశానికి వెళ్ళ బోయే ముందు ఆయన అతన్తో ముప్పావు గంట ముచ్చటించాడు.

"సర్ ! పాకిస్థాన్ అల్టిమేటం ఉత్త బూకరింపని మీరు నిష్కర్షగా ప్రకటించటం అవసరం.

"ఇక పాకిస్థాన్ జట్టుకి సంబంధించి మనం కంగారుపడాల్సిన అవసరంలేదు. రిజర్వుబ్యాంకు ఖజానాలో కంటే కూడా వాళ్లు భద్రంగా ఉంటారు. ఈ హైజాక్ వ్యవహారంలో అల్‌ఫతే సంస్థకి సంబంధం ఉంది. దర్‌ఖాల్సా మహిళ ఒకావిడ దొంగ పాస్‌పోర్టుతో టర్కీ రాజధాని ఇస్తాన్‌బుల్ వెళ్తున్నట్టు నటించి కాబూల్‌లో దిగిపోయింది. ఆవిడ ఎవ రయిందీ తెలుసుకుంటాను.

"పంజాబుకు సంబంధించి నాదొక మనవి సర్! అకాలీల్ని అధిగమించి ఒక అడుగు ముందుకు వేసే అవకాశం వచ్చింది. మన గడ్డ మీద పాక్ సైన్యాలు దాడి జరపబోయే ఈ మహా క్లిష్ట సమ యంలో దేశప్రజల ఆశలకనుగుణంగా జాతీయ పతాకం కింద నిలబడి శత్రు వుని తరిమికొట్టమని అకాలీలకు మీరు ప్రత్యేక విజ్ఞప్తి చెయ్యండి. సద్భావ సూచనంగా అకాలీ ఖైదీల విడుదలకు ఉత్తర్వులివ్వండి. దానివల్ల తప్పకుండా సత్ఫలితం కలుగుతుందని నా నమ్మకం సర్."

ప్రధానమంత్రి అతనికేసి కృతజ్ఞతా భావంతో చూశాడు. వెంటనే క్యాబినెట్ సమావేశానికి వెళ్లాడు. 'రా' అధిపతి సూచించిన అంశాల మీదే ప్రధానంగా మాట్లాడాడు. మంత్రివర్గం మారు మాట్లాడకుండా ప్రధానమంత్రి ప్రతిపాద

నల్లి ఆమోదించింది.

ప్రధానమంత్రి ఉత్సాహంగా తన కార్యాలయానికి వచ్చేశాడు. ఇంకా కుర్చీలో కూర్చోనైనాలేదు, సిగ్నల్ మెస్సేజి చేతి కందింది.

"స్వర్ణదేవాలయం ముందు సాయుధ సంఘర్షణ. పోలీసులు భారీ ప్రాణ నష్టంతో కాలికి బుద్ధిచెప్పవలసివచ్చింది."

అది చదువుతూనే ప్రధానమంత్రి పళ్లు పటపటలాడించాడు. ఆ చీటీ ఇంకా చేతి లోనే ఉంది. అంతలోనే మరో మెస్సేజి. ఆయన నిలబడే ఉన్నాడు.

"ముఖ్యమంత్రి సంత్ జీలు, జత్తేదార్ల అరెస్టుకు ఉత్తర్వులిచ్చారు. పోలీసుల్ని గురుద్వారాలో ప్రవేశించి అనుమానితుల్ని నిర్బంధంలోకి తీసుకోమని ఆయన ఉత్తర్వు. పంజాబ్ సాయుధ పోలీసు సూపర్నెంటుతోసహా 17 మంది చని పోయారు. వందమందికి పైగా గాయ పడ్డారు. ప్రత్యర్థి శిబిరంలో జరిగిన ప్రాణ నష్టం గురించి సమాచారం తెలీదు. సహాయం కోసం స్థానిక ఆర్మీ అధికార్లకి ముఖ్యమంత్రి అభ్యర్థన పంపారు"

"ఛండాలుడు..." ప్రధానమంత్రి కోపోద్రేకంతో అరిచాడు. డెస్కు వేపు ఒక్క గెంతుగెంతి, తన కార్యదర్శికోసం బజర్ నొక్కాడు.

"హోంమంత్రిని, ఆర్మీ చీఫ్‌ని, 'రా', ఐ.బి డైరెక్టర్లనితక్షణం పిలువ్-అర్జంట్"

సింగ్ విరిగి మీద పడుతున్నా నిండు కుండలాగా తొణకని ప్రధానమంత్రి ఉద్రేకం చూసి కార్యదర్శికి వొణుకు పుట్టింది.

"ముఖ్యమంత్రిని తక్షణం రాజీనామా పంపమని చెప్పు. తాత్సారం చేస్తే, రాష్ట్రపతిపాలనప్రకటించమనిగవర్నరుకు చెప్పు. పంజాబులో పోలీసు యాక్షన్‌ని వెంటనే బందుచేయించు" అన్నాడు ప్రధాన మంత్రి పక్కా మొహంలోకిచూస్తూ.

ముఖ్యమంత్రి అభ్యర్థనని మన్నించ వలసిన అవసరం లేదని ఆర్మీ చీఫ్‌కి చెప్పాడు.

ఆకాశవాణి అధికారుల్ని పిలిపించి తన ప్రత్యేక ప్రసంగాన్ని రికార్డు చేసుకోమన్నాడు. మరుక్షణం మనస్సు మార్చుకుని, జరుగుతున్న కార్యక్రమాన్ని నిలుపుచేయించి సరాసరి ప్రసంగించాడు.

ఆయన ప్రసంగం మృదువుగానూ ఉంది, పదునుగానూ ఉంది. శాంత్యభి లాషా వ్యక్తమైంది; సమర సంసిద్ధతా వెల్లడయింది; రాజనీతి చతురతా ప్రదర్శితమైంది. రణోత్సాహమూ కదం తొక్కింది.

"పాకిస్థాన్ ప్రభుత్వం భారత దేశంతో బలాబలాలు తేల్చుకోవాలని ఉవ్విళ్లూరుతూ ఉంటే మేం వాళ్ళని నిరు త్సాహ పర్చబోమని హామీ ఇస్తున్నాను. అటువంటి అవాంతరాన్ని ఎదుర్కో డానికి భారత ప్రభుత్వం సర్వసన్న ద్ధంగా ఉంది. లోగడ మా పవిత్ర భూభాగం మీద దాడికి తెగించిన అనేక దురాక్రమణ శక్తులతో భారతసాయిధ బలాలు విజయవంతంగా పోరాడి ప్రతిష్ఠ నిలబెట్టిన అనుభవం మాకుంది.

పాకిస్థాన్ తీవ్రమైన తొందరపాటుతో అనాలోచిత చర్యకి తెగించకుండా శాంతి కాముక దేశాలన్నీ ఒత్తిడి తేవాలని విజ్ఞప్తి చేస్తున్నాను. తన తొందరపాటు చర్యకి పాకిస్థాన్ ముస్ముందు అనేక దశా బ్దాలపాటు తలపట్టుకుని చింతించవలసి వస్తుంది"

ప్రధానమంత్రి ప్రసంగానికి దేశ

మంతటా హర్షం వ్యక్తమైంది. పంజాబులో రాష్ట్రపతి పాలనని విధించటంపట్లకూడా ఆమోదం వెల్లడైంది. అయినా పంజాబు పరిస్థితిలో మార్పులేదు. పంజాబు నుంచి అందే నివేదికలు ఆందోళనకరంగా ఉన్నాయి. అకాలీలు స్వర్ణదేవాలయం చుట్టూ బురుజుపై గోడలు లేపుతున్నారు. అకాల్ తఖ్త్ భవనం టాపు మీద సంత్‌జీ తన ఆత్మాహుతికోసం బ్రహ్మాండమైన అగ్నికుండాన్ని కట్టిస్తున్నాడు. సత్‌జీ గనుక ఆత్మాహుతి చేసుకుంటే, పోలీసులు గురుద్వారాలలో ప్రవేశిస్తే పాక్ క్రీడాకారుల తలల్ని ప్రధానమంత్రి విజయానికి ట్రోఫీలుగా పంపుతామని దళ్‌ఖాల్సా తమ అనధికార రేడియో ప్రసారంలో మళ్ళీ మళ్ళీ చెప్పారు. ఇంకా చాలా తలలు దొర్లుతాయి కాబట్టి ప్రధానమంత్రి తన రక్తపిపాసని తీర్చుకుందుకు పుర్రెల్తో జయస్తంభం నాటుకోవచ్చు అని కూడా వ్యంగ్యంగా చెప్పారు.

ప్రధానమంత్రి తన జీవితంలో మొట్ట మొదటిసారి భోజనం మానేశాడు. మిన్ను విరిగి మీద పడుతున్నా పదిన్నరకల్లా పక్క మీద మేనువాల్చే నియమాన్ని అతిక్రమించి ఇంకా పొద్దుపోయేదాకా మేలుకునే ఉన్నాడు. తన రౌద్రం, తన ధైర్యం,తన శక్తి, ఇంకా తన నిస్సహాయత కూడా తెలిసివుండీ బోనులో చిక్కిన పులిలా పడగ్గదిలో పచార్లు చేశాడు. అర్ధ రాత్రి దాటాకగాని నిద్రపోలేదు.

* * *

ప్రధానమంత్రి రాయబారాన్ని జర్తేదాకే లొకే తిరగ్గొట్టాడు. పంజాబులో ప్రశాంత పరిస్థితిని పునరుద్ధరించే సదుద్దేశంతో ఆయన అకాలీ ఖైదీల తక్షణ విడుదలకి ఉత్తర్వులిచ్చాడు. అకాలీ ఖైదీలు దాదాపు 30 వేలమందిదాకా ఉన్నారు. గురు నానక్‌జీ, గురుగోవిండ్‌సింగ్‌జీల జన్మదినోత్సవాలనాటికి అకాలీలంతా జైళ్ళ నుంచి విడుదలై సొంత ఇళ్ళలో సంతోషంగా సంబరాలు జరుపుకోండని ఆయన అకాలీలపట్ల సౌహార్ద్రం ప్రదర్శించాడు. కాని అకాలీలు ఆ ఎరకి తగులుకోలేదు.

దేశంలో అకాలీల వైఖరికి నిరసన వెల్లడయింది. హిందూ సంస్థలు ఆగ్రహం ప్రకటించాయి. ప్రభుత్వం అకాలీ తిరుగుబాటుని కఠినంగా అణచివెయ్యాలని ప్రకటనలు చేశాయి. ఒక సంఘం మాత్రం అకాలీ కోర్కెలకి మద్దతు ప్రకటించింది. ముస్లిం సంస్థలు అకాలీ ఆందోళనని సమర్థించాయి. మీరట్‌లో హిందూ-హిందూ వ్యతిరేకవర్గాల మధ్య ఘర్షణలు జరిగాయి. వందమందికిపైగా ఆ మారణ హోమంలో ప్రాణాలు కోల్పోయారు. లూటీలు, దోపిడీలు, గృహదహనాలు, ఆస్తి విధ్వంసం విశృంఖలంగాసాగాయి. సైన్యం రంగంలోకి దిగింది. మార్షల్‌లా ప్రకటించబడింది.

నసీబ్ ఒంటరిగా బైరాగి గదిలో జోగాసింగు కోసం ఎదురుచూస్తూ కూర్చుంది. జోగాసింగ్ గదిలో అడుగు పెడుతూనే "అంతా సవ్యంగానే ఉంది దీదీ" అన్నాడు.

"మరి ఇన్నాళ్ళు హవేలీనుంచి బైటికి కదలనివ్వకుండా ఉంచామని వాళ్ళు గొడవ చెయ్యటం లేదుగదా?"

"ఒకరిద్దరు అల్లరిచేసి ఊరుకున్నారు. వాళ్ళలో సగంమంది ఆటగాళ్ళు కారు. అసలు ఆటగాళ్లు పాకిస్థాన్‌లో అల్‌ఫతా సంస్థ పెట్టుపోతల్లో ఉన్నారు"

"వాళ్ళకి ఎలా కాలక్షేపం అవుతున్నది?"

"మొదట్లో తాగుడు, తిండి, నిద్ర. ఇప్పుడిప్పుడే వాళ్ళకి తెలిసినవి మాకు నేర్పుతున్నారు"

"ఏమవి?" అంది నసీబ్ అసహనంగా.

"రకరకాల బాంబుల తయారీ. చూడ్డానికి అమాయకంగా కనపడతాయి. కాని మహా అపాయకరం. టైమింగ్ మెకానిజం అవసరంలేని టైంబాంబుల తయారీ కూడా నేర్పుతున్నారు"

నసీబ్ పరధ్యానంలో మునిగిపోయింది. పావుగంటసేపు మాట్లాడకుండా ఎటో ఆలోచిస్తూ మౌనంగా ఉండిపోయింది.

"మీ మనస్సు దేనిమీదో ఉంది దీదీ" అన్నాడు జోగాసింగ్ ఆమె పరధ్యానాన్ని చెదరగొడుతూ.

"ఔను భయ్యా"

"మా సాయం కావాలా?"

"ఆఁ. నువ్వు తిరిగి వెళ్ళిపోయి ఆ జట్టుని తిప్పి పంపే ఏర్పాట్లు చెయ్యి"

"ఏమంటున్నావ్ దీదీ?" అనడిగాడు జోగాసింగ్ ఆందోళనగా "మోర్చా ముగిసిపోయిందా?"

"లేదు"

"అయితే ఎందుకు?"

"జోగా భయ్యా! వివరాలు చెప్పలేను. ముగింపు దగ్గర పడుతోందనే భావం నాకు కలుగుతోంది. నా నిర్ణయం బాగో ఓగో నాకే తెలీదు. చెడ్డది మాత్రం కాదని నేననుకుంటాను"

"సంత్‌జీలు, జత్తేదార్లు మెత్తబడ్డా మనం మాత్రం ఆయుధం దింపొద్దు దీదీ. పంథ్‌కోసం మనం ప్రాణాల్ని పణంగా పెట్టాం. ప్రమాణం చేసినట్టుగా ప్రాణాలర్పిద్దాం" అన్నాడు జోగాసింగ్ ఆవేశంగా.

నసీబ్ అతనికేసి చాలా సేపు చూసింది. జోగాసింగ్ ఆ చూపు భరించలేక వేరేవేపు కళ్ళుతిప్పుకున్నాడు.

"జోగా! సిక్కులంటే అలగా జనం, అల్లరిమూక కాదని గుర్తుపెట్టుకో. అబ్దాలీలు, దురానీలులాగా వాళ్ళు రక్తపిపాసువులు కాదు. దోపిడీ, విధ్వంసం, వినాశనం వాళ్ళ సిద్ధాంతం కాదు. జీవితాన్ని, కుటుంబాన్ని, సమాజాన్ని, ఆఖరికి తాము పొట్టపోసుకోడానికి అవలంబించిన వృత్తినీ ప్రేమించటం గురువులు సిక్కులకు నేర్పారు. అట్లాగే కొత్త మొహాల్ని, నిరుపేదల్ని, సర్వాంగ్యుల్ని, వికలాంగుల్ని, అనాథల్ని ప్రేమించటం కూడా సిక్కులకు నేర్పారు. సిక్కులు తాము పండించే పంటలో, సంపాదించే ఆదాయంలో కొంత భాగం సంఘంకోసం, పేదలకోసం,పీడితుల కోసం తీసిపెట్టాలని గురువులు నిర్దేశించారు. సిక్కుమతస్థులైన వాళ్ళకి మాత్రమే నువ్వు దానం చెయ్యాలని గురువులు చెప్పలేదు. ఒక ముస్లిమో, హిందువో, పార్శీయో, బౌద్ధుడో నీ ఇంటి ముంగిట నిలబడితే అతణ్ని ఆకలితో తరిమెయ్యమని గురువులు చెప్పలేదు. సిక్కుల వంటశాలలన్నీ ధర్మశాలలన్నారు; లంగర్లన్నారు.ఎవ్వరూ ఆకలితో గాని, కోపంతోగాని, మనస్సు గంటుపెట్టుకునిగాని వెళ్ళిపోకూడదన్నారు.

గురువులు ఇంకొక క్రమశిక్షణని కూడా ఏర్పరచారు. అదే సంగత్. అన్ని విషయాలు నిర్ణయించేది సంగత్. అది గురువులకన్నా గొప్పది.సంగత్ ఇప్పుడు సంత్‌జీని, జత్తేదార్‌ని సమర్థిస్తున్నది. సంగత్ నిర్ణయానికి వాళ్ళు కట్టుబడి ఉన్నారు.మనం కూడా. మనం ఖాల్సాలం. క్రమశిక్షణతో మెలుగుతాం మనం. అందులోనే ఉంది మన ఆధిక్యత. అదే




మన శక్తి. యుద్ధాలు జయించే ఒకేఒక మెళుకువ అదే."

జోగా వినయంతో తల వంచాడు. నసీబ్ గురునానక్‌జీ గీతం ఎత్తుకుంది. "ఖురాసాన్ ఖస్మానాకియా..." జోగా గొంతు కలిపాడు.

అకాలీలు జైళ్లు ఖాళీ చెయ్యలేదు. వాళ్ళు అధిక సంఖ్యలో ఉన్నచోట్ల జైళ్ళని స్వాధీనం చేసుకుని సిబ్బందిని లోపల మూసేశారు. కొట్లాటలు జరిగాయి. కొన్నిచోట్ల కొద్ది ప్రాణనష్టం జరిగింది. అటువంటి చెదురుమదురు సంఘటనలు మినహా వేరే ఘోరాలేమీ జరగలేదు. పరిస్థితి మామూలుగా ఉంది.

ప్రధానమంత్రి సంత్ భండర్ దగ్గరికి ఇద్దరు ప్రత్యేక దూతల్ని రాయబారం పంపాడు. కాంగ్రెస్ నాయకుడు తేజా సింగుని కలవటానికి సంత్ నిరాకరించాడు. రౌనక్‌సింగుతో కొద్దిసేపు మాట్లాడ్డానికి మాత్రం అంగీకరించాడు. రౌనక్‌సింగ్ మాజీ అకాలీ. మళ్ళీ అకాలీ పార్టీలోకి మారవచ్చనే వదంతులున్నాయి. ఏమైనా రాయబారం విఫలమైంది. మళ్ళీ ప్రధాన మంత్రితో సంప్రదింపులకు అకాలీ నాయకులు సుముఖంగా లేరని సంత్‌జీ నిష్కర్షగా చెప్పాడు. దానివల్ల కొత్తగా ఒనగూడేదేమీ ఉండదని ఆయన తెగేసి చెప్పేశాడు.

ప్రధానమంత్రి ప్రత్యేక దూతలు నిరాశతో, అసంతృప్తితో తిరిగి వెళ్ళిపోయారు. వాళ్లూ సిక్కులే. కాని దేశం ప్రస్తుతం ఎదుర్కొంటున్న క్లిష్టస్థితిలో సిక్కులు ప్రభుత్వంతో ప్రత్యక్ష ఘర్షణకు తలపడ్డం వాళ్ళకి ఇష్టంలేదు. అకాలీ ఆందోళన మూలంగా తాము ఆశపడ్డ మంత్రి పదవులు చేజారిపోతున్నాయన్న దుగ్ధ వాళ్ల మనస్సులో ఓ మూల మూలుగుతూ ఉండవచ్చుకూడా.

ప్రధానమంత్రి రాష్ట్రవ్యాప్తంగా సరిహద్దు భద్రతా దళాల్ని దింపడానికి ఉత్తర్వులిచ్చాడు. అదనంగా అమృత్‌సర్‌లో ఓ సైనిక పటాలాన్ని రిజర్వులో ఉంచమని ఆదేశించాడు. అకాలీలంటే ప్రభుత్వం జడిసిపోయిందనే భావం వాళ్ళకి కలగనివ్వకూడదు. ఎట్టి పరిస్థితుల్లోనూ అకాలీల్ని గట్టిగా ఎదుర్కోడానికే ఆయన పట్టుదల పూనాడు. జైళ్లని ఖాళీ చెయ్యటానికి నిరాకరించిన అకాలీలపైన చర్య తీసుకోవద్దని మాత్రం ఆయన పరిపాలనా యంత్రాంగాన్ని ఆదేశించాడు. అల్లర్లకు, ప్రభుత్వ ఆస్తుల విధ్వంసానికి దిగనంతవరకు వాళ్ల జోలికి పోవద్దని సూచించాడు.

ఆత్మాహుతికి ముందు సంత్ భండర్ చెయ్యబోయే ప్రసంగాన్ని అప్పటికప్పుడు ప్రత్యక్షంగా వినటానికి అనుసరమైన ఏర్పాట్లు ప్రధానమంత్రి నివాసంలో పూర్తయ్యాయి.

స్వర్ణదేవాలయం చుట్టూ పరకర్మ జనంతో కిటకిటలాడిపోయింది. జన సంద్రం ఉప్పొంగుతున్నట్టుగా ఉంది. సంత్‌జీ తన ప్రసంగాన్ని కచ్చితంగా నిర్ణీత సమయానికి ప్రారంభించాడు. ఆయన తఖ్ పైన కనిపించగానే లక్షలాది ప్రజలు నిలబడి ఉద్రేకంగా హర్షధ్వానాలు చేశారు. అయిదునిమిషాలసేపు ఆహర్ష ధ్వానాలు తెరిపిలేకుండా మోగాయి. సంత్‌జీ తన రెండంచుల వెండి ఖడ్గం ఎత్తి జనాన్ని శాంతించమని సైగచేశాడు

"ఖాల్సాజీ... ప్రభుత్వ సాయుధశక్తి ముందు మీరు బెదిరిపోనందుకు, మీ మనస్సులు చెదిరిపోనందుకు నాకెంతో

సంతోషంగా ఉంది. భగవంతుని ఆవాస మైన ఈ బంగారు కోవెలచుట్టూ పోలీసులు, సరిహద్దు భద్రతాదళాలు, సైన్యం హిమనగంలా పెట్టని గోడ కట్టినా ఈ హర్‌మందిర్ ఆవరణలోకి మహా సముద్రంలా పొంగిపొరలే ఈ మహా జనాన్ని చూస్తుంటే మీ సమర్పణకు, సమర్పణకు ఇంకా ఏం నిరూపణ కావాలి? అబ్దాలీ, దురానీల కాలంలో సిక్కుయోధ సమాజాన్ని దీవాళీ, వైశాఖి పండుగ దినాల్లో హర్‌మందిర్ ఛాయలకి రాని తుండా కట్టడి చేసిన ఆ కష్టసమయం ఈరోజు నా దృష్టిలో మెదుల్తోంది. సింగ్‌జీ... సిక్కు యోధులానాడు పిడుగుల్లా నగరం గుండా దూసుకు పోతూ, దిగ్గ్రృహకాలిపే మెరుపువేగంతో శత్రుసైనిక శ్రేణుల్ని చీల్చుకుంటూ హర్‌మందిర్‌లోకి ప్రవేశించి అమృత సరస్సులో మునిగి గురువులకు పూజ పూర్తిచేసి స్వేచ్ఛగా, నిర్భయంగా వెళ్ళి



పోయారు. ఖాల్సా ఈనాడు కూడా అదే భక్త్యావేశంలో ఉన్నాడు. ఆనాడున్నంత పరిశుద్ధంగా ఈనాడూ ఉన్నాడు"

ప్రధానమంత్రి పడగ్గదిలో కూర్చుని సంత్ ప్రసంగం వింటూ విపరీతమైన చిరాకుతో కుర్చీ అంచుకు జరిగాడు. అకాలీలు తెగబడితే జరగబోయే ప్రాణనష్టం తలుచుకుంటే ఆయనకి వొణుకు పుట్టింది. హింసని ఆయన అసహ్యించుకుంటాడు. ఆయన శుద్ధ గాంధేయవాది. ప్రాణనష్టం ఆయన భరించలేడు. వెంటనే తమాయించుకుని సంత్ ప్రసంగానికి చెవులప్పగించాడు.

"ఖాల్సాజీ! అకాలీ ఖైదీల విడుదల పట్ల ప్రభుత్వ నయవంచనకి మోసపోకండి. అది సౌహార్ద్ర సూచనకాదు. సర్కారీ బేజారు. మోర్చాకు ఇన్నివేలమంది స్వచ్ఛందంగా సమకూడుతారని ప్రభుత్వం భావించలేదు. మీ నాయకులంతా అందని చందమామకేసి బొబ్బలుపెట్టే నక్కలని ప్రభుత్వం భావించింది. సిక్కు అంటే వీరమరణానికి మారుపేరని ఆ మూర్ఖులకు తెలీదు.

సింగ్‌జీ! సిక్కు యోధులు చాలా తక్కువగా ఉన్ననాడు కూడా దుర్నిరీక్షమైన మొఘల్ సామ్రాజ్యశక్తికి వ్యతి



రేకంగా కత్తికట్టారు. సంఖ్యాబలం పెరిగినప్పుడు ఢిల్లీని కూడా దాటి విజయపరంపర సాధించారు. తరువాత పంజాబులో స్వతంత్రరాజ్యం స్థాపించుకున్నారు. విజయమే తప్ప వైఫల్యం ఎరగరు. విజయం సాధించారు లేదా వీరస్వర్గం పొందారు. సిక్కు నిజమైన సైనికుడు. సుఖజీవితాన్ని గురించి సిక్కు పట్టించుకోలేదు. పంథ్ వైభవమే అతనికి పరమానందం. స్వర్గం అతని గమ్యం. తన గురువుల కృపావీక్షణాలలో కూర్చునే స్థలమే అతని స్వర్గం.

అబ్దాలీ దండయాత్రలో సిక్కులు ఘలుఘారాకి (ఘోరకలి) గురయ్యారు. 30వేలమంది రాలిపోయారు. అయినా వాళ్లు కంట తడి పెట్టలేదు. దుఃఖంతో ఆక్రందించలేదు. బలం కూడదీసుకుని సమీకృతం కావడంలోనిమగ్నులయ్యారు. సింగ్‌జీ... వాళ్ళు మళ్ళీ పోరాడి విజయం సాధించారు. ఘలుఘారా మహావిషాదాన్ని తుడిచివేసే మహత్తర విజయంసాధించారు.

ఈరోజున అటువంటి మహాఘలుఘారాకి సమాయత్తం కావటం చూస్తున్నాను. మృతవీరులు 30వేలు కాదు, మూడు లక్షలు దాటవచ్చు. ఖాల్సాజీ... మన దశమగురువుకిచ్చిన వాగ్దానాన్ని నిలబెట్టుకోవటం మీవంతు. మీ తల ఆయనకి దానమిచ్చారు. ఆయనిప్పుడు మీ తల అడుగుతున్నాడు. మీరు నిరాకరిస్తారా?"

"లేదు... లేదు"

"ఖాల్సా గురూకా"

"రాజ్యం ఖాల్సాజీది"

"జో బోలేసో నిహాల్"

"సత్‌శ్రీ అకాల్"

విజయ ధ్వానాలతో దిక్కులు పిక్కటిల్లుతున్నాయి. ప్రధానమంత్రి చిరాకుతో లేచి నిలబడ్డాడు. "మూర్ఖుడు" బిగ్గరగా అరిచాడు. "అమాయకుల నెత్తురుతో అతను చేతులు తడుపుకుంటాడు" గొణుక్కుంటూ గదిలో పచార్లు చేశాడు.

సంత్ తన వెండి ఖడ్గాన్ని పైకెత్తి జనాన్ని శాంతించమన్నాడు.

"ఏది ఏమైనా మీరు మీ ఆత్మశక్తిని నిరూపిస్తారు. అది సిక్కు ఆత్మశక్తి. 'నేను నా జీవితం కోల్పోవచ్చు, కాని నా ధర్మం కోల్పోను' అనే ఆత్మశక్తి. సింగ్‌జీ, మతవిశ్వాసం శూన్యమైతే మీరు ఈ నేల మీద నడిచేప్పుడు రేగే దుమ్ముకన్నా హీనం. విశ్వాసంలేకపోతే జీవితం లేదు. క్రమశిక్షణ లేకపోతే విజయం కలగదు. కాబట్టి, సింగ్‌జీ... ఖాల్సా అపజయం ఎరగదు. అపజయంలో, మృత్యువులో అన్ని వేళల్లో అతను జయం పొందుతాడు. ఆ విజయం ఖాల్సాది; దశమగురువుది; గురు గోవింద్ సింగ్ మహరాజ్‌ది. సింగ్‌జీ.....రేపు ఖడ్గావతారుడైన నా ప్రభువు ఆదేశం ప్రకారం ఆయన్ని సేవిస్తాను. కుష్టురోగులు ఎందులో మునిగి స్వస్థులై ఆరోగ్యవంతులుగా గట్టెక్కారో, ఎందులో మునిగి కాకులు తెలివెన్నెల రాజహంసలై పైకెగిరాయో ఆ పవిత్ర అమృత సరస్సులో మునిగినట్టుగా రేపు నేను అగ్నిగుండంలో అడుగు పెడతాను. ఇది నేను మీతో ఉండే చిట్టచివరి రోజు. అయినా మీ నుంచి శలవు తీసుకోను. నా ఆత్మ ఎప్పుడూ మీతోనే ఉంటుంది. సింగ్‌జీ..నా ఆత్మ మీలో ఉంది, మీ ఆత్మ నాలోఉంది. చివరికి మన ఉభయుల ఆత్మలూ గురు గోవింద్‌సింగ్ మహరాజ్ ఆత్మలో ఏకోన్ముఖమౌతాయి. కాబట్టి నేననేది లేదు. నన్ను సంత్ అంటున్నారు. మీరు సంగత్.




మీరు నన్ను సేవాదారు అనవచ్చు. అధిష్ఠాన వర్గం మీరు. మన పదుగురు గురువుల హోదా కన్నా మీది పెద్దది. మీరు నన్ను సంత్ అంటే, ఖాల్సాచేయగలిగిన దానికన్నా ఇంకా ఎక్కువ సాధించడానికి ధర్మబద్ధుణ్నై ఉన్నాననుకుంటాను. ఎంచేతనంటే మీ ప్రేమానురాగాల బరువు నా మీద వేశారు. అందుకు నాకృతజ్ఞతలు మీకు చెప్పకోవాలి. రేపు నా ఆత్మాహుతి పంథ్ ఆదర్శం కోసం మాత్రమే కాదు, ఈ అల్పుని సేవని మీరు గుర్తించినందుకు కూడా. గురువులకన్నా గురుతరమైన హోదాలో వున్న మీకు నేను చేతులు జోడించి' శిరస్సు వంచి పంథ్ సేవలో నా కర్తవ్యం పరిపూర్తి చెయ్యటానికి మీ అనుమతిని, మీ ఆశీస్సుల్ని, మీ కృపను అర్థిస్తున్నాను"

సంత్ థండర్ మూర్తీభవించిన నమ్రతతో చేతులు జోడించి తల వంచాడు. సంగత్ ఉన్మాదంలో ఊగిపోయింది. వాళ్లు తఖ్త్ వేపు ఎగబాకాలని ఉవ్విళ్లూరారు. ఆయన పాదాలు స్పృశించాలని తహతహలాడారు. ఆ యన దుస్తుల్ని తాకాలని ఆరాటపడిపోయారు. తాకితే చాలనేదే వాళ్ల తపన. ఆ స్పర్శ తమకి ముక్తి ప్రసాదిస్తుందని వాళ్ల విశ్వాసం. సరస్సుకు అవతలి వేపు నిలబడ్డ మహాజనం ముందుకు తోసుకుంటూ కదిలారు. ఆ తోపులాటలో దాదాపు సలభైమందికి పైగా సరస్సులో పడిపోయారు. వెంటనే పక్కనున్నవాళ్లు బైటికి లాగేశారు.

ప్రధానమంత్రి రేడియో కట్టేశాడు. కోపంతో మండిపడిపోయాడు. సంత్ సాధించాడు. జనాన్ని మతోన్మాదంతో రెచ్చగొట్టాడు. దేశ విభజననాటి మారణహోమాన్ని మించిన ప్రత్యక్ష యుద్ధ బీభత్సం జరగబోతోంది.హాయ్ భగవాన్! అనాడే గ్యానీ మాట విని సంత్ అరెస్టుకు సరేసంటేనో! ఈ బీభత్సం నివారించి వుండేవాణ్ణి. ఆత్మాహుతికి ముందే అతణ్ణి ఇప్పటికిప్పుడు అరెస్టు చేయిస్తేనో? కాదు తొందరపడి లాభం లేదు. కొంచెంతాళాలి. ఈ జనమంతా సర్దుకోవాలి. తెల్లవారు జామున నిర్బంధంలోకి తీసుకోవచ్చు. జనం బహుశా రాత్రంతా అక్కడే జాగారం చెయ్యకపోవచ్చు.

పట్టె మంచం పక్కన టేబులు మీది ఎర్ర ఫోను మోగింది. ఆయన దాని వేపు కసిగా చూశాడు. ఎత్త కూడదనుకున్నాడు. మోగేది ఎర్రఫోనని వెంటనే స్ఫురించింది. రిసీవరు ఎత్తాడు. 'రా' అధిపతి అవతలి వేపున్నాడు.

"సర్! దయచేసి రేడియో కట్టేసేయకండి. ఇప్పుడు వినండి. ఊహించని కొత్త పరిణామం"

ప్రధానమంత్రి అయిష్టంగా రేడియో ఆన్ చేశాడు. అంతా గందరగోళంగా వినిపించింది. అంతలోనే సద్దుమణిగింది.. నిశ్శబ్దం. రేడియో పలకడం లేదేమో అనుకున్నాడు. లేచి వెళ్లి చెకప్ చేద్దామనుకున్నాడు. రేడియో మోగింది. బాబా బుద్ధాసింగ్ ప్రసంగించటం ప్రారంభించాడు. ఎవరు మాట్లాడుతున్నారో ప్రధానమంత్రికి అంతుబట్టలేదు. వెంటనే 'రా' ఆఫీసుకు ఫోన్ చేశాడు. శతాధికవృద్ధుడు, మహర్షి బాబాబుద్ధా అని జవాబు వచ్చింది. ఆయన రేడియో ముందు కుర్చీలో కూలబడ్డాడు.

"సంగో.. సంగతో, సంతో...మీకొక విజ్ఞప్తి చెయ్యాలని వచ్చాను" బాబా బుద్ధాసింగ్ ప్రసంగం మొదలయింది. ఒక మానవ కంఠం అంత మార్దవంగా,

మృదులంగా, మధురంగా ఉంటుందా అని ఆయన ఆశ్చర్యపడ్డాడు.

"మీరేం చేసినా సిక్కు ధర్మమంటే ఏమిటో మరచిపోవద్దు. సిక్కు అంటే ఎవరు? ఏమిటి? మీకు తెలుసునని అనుకుంటారు. తెలుసునని అనుకోడం మీ పొరపాటు. కాబట్టి నన్ను చెప్పనివ్వండి"

బాబుడ్డా ప్రశాంతస్వరంతో చెప్పడం ప్రారంభించాడు. ఆయన ప్రసంగించబోతున్నాడని ప్రకటించగానే నోరెత్తి, హోరెత్తి నాగిలే ప్రజాసాగరం నిస్తబ్దమైపోయింది; నిశ్శబ్దమైపోయింది. ఎన్నాళ్ల గానో జనం ఆయన దర్శనం కోసం ఎదురుతెన్నులు చూస్తున్నారు. అందరి దృష్టి తక్త్ వేపు నిలిచిపోయింది. జనమంతా ఒక మనిషైకూర్చుండిపోయారు. ఊపిరి బిగబట్టారు. వాళ్ల మనస్సుల్లో ఈ లౌకిక ఆవేశ కావేషాలు నాశనమైపోయాయి. వాళ్ల మనస్సుల్లో ఒకే ఒక చింతన. ఒక మహాపుణ్యమూర్తి దర్శన భాగ్యమైంది. ఆయన వాణి వినవస్తోంది. ఆ క్షణంలో వాళ్ళకున్నది ఆ ఒకే ఒక స్పృహ.

"సింగో...సిక్కు అంటేరక్షించేవాడు, రక్షించుకునేవాడు, నాగరికత నిర్మించేవాడు, సంస్కృతి సృష్టించేవాడు, ప్రపంచ శాంతి సౌఖ్యాలకోసం పాటుపడేవాడు. ఒక్క మానవులతో మాత్రమే కాకుండా సమస్త జీవజాలంతో నిండిన ప్రపంచపు మంచికోసం పరిశ్రమించేవాడు. ఎంచేతనంటే అతడు పగిలిన ఇటుకలో, ఎండిన కట్టెలో, కుళ్ళిన ఆకులో, కుష్ఠువాని ముఖంలో, పర్వత రాశిలో, సాగరాల జలప్రళయ నాట్యంలో ఈ సమస్త సృష్టికి వెనుకఉన్న శాశ్వత దివ్య సౌందర్యాన్ని సందర్శిస్తాడు. స్వార్థం, దురాశల తుఫాను హోరు సమసిపోయిన శాంతి అనుభవమవుతుంది. భగవత్ప్రేరితమైన ఈ జగన్నాటకంలో మీరంతా పాత్రలు. మీ పాత్ర మీరు నిర్వహించాలి. తమ పాత్ర నిర్వహించ నిరాకరించేవాళ్ళకు శాశ్వతంగా పుట్టగంతులుండవు.

సింగో ... బలహీనుల్ని రక్షించటం, అన్యాయం జరిగినవాళ్లకు న్యాయం కలిగించటం, పేదల్ని ఆదుకొనడం, అన్నార్తుల ఆకలితీర్చడం, ఒంటిమీద నూలుపోగులేక చలిలో వణికేవానికి వెచ్చని దుస్తులు కప్పడం, శాంతి సామరస్యాల సందేశం ప్రచారం చేయడం మీ ధర్మం.

మీరు ఖాల్సాకూడా. అంటే గురు సైనికులు. వెరపు,భీతి ఎరగని సైనికులు. దుర్మార్గాన్ని కూల్చటానికి, దురాక్రమణని నశింపజెయ్యటానికి క్రమశిక్షణతో, తర్ఫీదుతో కదం తొక్కుతూ మీరు ముందుకు నడుస్తారు. కాని మీ క్రమశిక్షణ మిమ్మల్ని నిర్దాక్షిణ్యంగా, విధ్వంసకరంగా ఉండమని నిర్దేశించదు. మీరు గురువుల సైనికులు. మీ గురువుని మీరు కించపర్చకూడదు. ఆశాభంగం కలిగించకూడదు"

ప్రధానమంత్రికి అంతా అయోమయంగా ఉంది. బాబా సిక్కుల్ని రెచ్చగొడుతున్నాడా? మోర్చా విరమించుకోమని హితవు చెబుతున్నాడా? లేకపోతే ఇంకొక కొత్త భీభత్సానికి అంకురార్పణ చేస్తున్నాడా? ఏమీ అంతుబట్టలేదు. అయితే రేడియో కట్టెయ్యకుండా కుర్చీకి అంటిపెట్టుకుపోయి శ్రద్ధగా వింటున్నాడు.

"సింగో...ఖాల్సా ఎందుకు సృష్టించ

బడిందో తెలుసా? యుద్ధాలు రగిలించ టానిక్కాదు, అమాయకుల్ని వధించ టానిక్కాదు, గౌరవనీయులైన అతిథుల్ని అపహరించటానికికాదు – ఖాల్సాయొక్క అవసరం కలిగినప్పుడు కర్తవ్యం పరిపూర్తి చెయ్యటానికి.

ఖాల్సా శాశ్వత సైన్యంకాదు. ఖాల్సా నియమిత సైనికుడుకాడు. దుర్మార్గం, దోపిడి, పీడన, నిరంకుశత్వం తలెత్తినప్పుడు వాటికి వ్యతిరేకంగా పోరాడి నిర్మూలించే దైవశక్తి ఖాల్సా. శాంతి సమయంలో గురునానక్ మహరాజ్ చెప్పినట్లు అతడు గృహస్థుడు. కుటుంబ పోషణ అతని మొట్టమొదటి బాధ్యత. తరువాత సమాజం. సమాజం అంటే కేవలం సిక్కు సమాజం అని మాత్రమే కాదు. ఖాల్సా ఎప్పుడూ మొట్టమొదట తను దాడి చెయ్యడు. గురు హర్‌గోవింద్ మహరాజ్ తనుగా పియండాఖాన్ మీద మొదట దాడి ప్రారంభించలేదని మీరు జ్ఞాపకం చేసుకోండి. అతణ్ని దాడి చెయ్యనిచ్చాడు. అప్పుడు అతణ్ని ఎక్కడికి పంపాలో అక్కడికే పంపాడు. అతనికి అనువైన చోటు నరకం. కాబట్టి నరకానికి పంపించాడు. ఇదే సంప్రదాయాన్ని మన పదవ గురువు గురు గోవింద్ సింగ్‌జీ నిలబెట్టాడు. తనపైన దాడి జరిగినప్పుడే ఎదురుదాడి జరిపాడు. కాబట్టి యుద్ధాలు లేని శాంతి సమయంలో ఖాల్సా శాంతిదూత. మన పదిమంది గురువులూ కూడా రాజ్య విజయంకన్నా, సామ్రాజ్య సంపాదనకన్నా శాంతికే ప్రాధాన్యం ఇచ్చారు.

"సింగో ... గురుగోవింద్‌సింగ్ మహరాజ్, ఆయనకన్నా ముందు గురు హర్‌గోవింద్, గురు అర్జున్‌దేవ్‌లు వెలిగించిన బాటలో మీరు నడవాల్సివుంది. ముందు సంప్రదింపులు జరపండి. ప్రభుత్వం నిజంగా దోపతప్పితే తప్పుదోవతొక్కి ప్రభుత్వానికి విజ్ఞత తెలియజెప్పండి. అధికారపీఠం చుట్టూ దాన్ని తప్పుదారి పట్టించే గంగూలు ఎప్పుడూ ఉంటారు. ఏ మంచిమాటా, ఎంతటి న్యాయతర్కమూ, ఎటువంటి చారిత్రక సాక్ష్యాధారమూ ప్రభుత్వాన్ని కదిలించలేకపోయాయని మీకు కచ్చితంగా నమ్మకం కలిగినప్పుడు కత్తి దూయండి. మోర్చాకాదు – యుద్ధానికే తెగించండి. అప్పుడు ఖాల్సాజీ, మీరు ఆఖరి నెత్తురుబొట్టు చిందించేదాకా పోరాడండి.

కాబట్టి ప్రస్తుతం మోర్చా ప్రసక్తిలేదు. ఆత్మాహుతి అంతకన్నా లేదు. పాకిస్థాన్ నుంచి వచ్చిన మన గౌరవనీయులైన అతిథుల్ని ప్రేమతో, ఆదరంతో ఢిల్లీకి తిప్పి పంపించండి. గురుగోవింద్‌సింగ్ మహరాజ్ చూపిన ఒరవడిలో మొట్టమొదట సంప్రదింపులకు అంగీకరించండి. సంభాషణలు జరపండి. మేం కోరేది లూటీ, సామ్రాజ్యం, క్షణభంగుర వైభవం కాదని వాళ్ళకి చెప్పండి. మేం శాంతిని, గౌరవ ప్రతిష్ఠని, చెమటోడ్చి పండించే తిండిని మాత్రమే కోరుతున్నామని వాళ్ళకి చెప్పండి. మోర్చా ఖాల్సా మార్గంకాదు. ఖాల్సా తన శిరస్సు అర్పిస్తాడు–యుద్ధరంగంలో లేదా ఉరికంబం మీద.

సింగో .... నేను చెప్పవలసిందంతా చెప్పాను. ఇక మీకోసం ప్రార్థనచేస్తాను. మీకు విజ్ఞత, ధైర్యం ప్రసాదించమని గురుమహరాజ్‌ని అర్థిస్తాను"

జనం వెర్రెత్తిపోయారు. దాదాపు గంటసేపు కరతాళ ధ్వనులుచేశారు. గొంతులు బొంగురుపోయేదాకా నినాదాలిచ్చారు.

ఆ ప్రతిస్పందన చరిత్రలో అపూర్వం. ఇంకా గంటలపాటు చప్పట్లు చరిచేవారే; గొంతెత్తి నినాదాలుచేసేవాళ్ళే. కొట్టికొట్టి వాళ్ల చేతులు చప్పబడిపోయాయి. అరిచి అరిచి వాళ్ళ గొంతులు అలిసిపోయాయి.

నసీబ్ బైరాగి గదిలో రేడియో సెట్టు ముందు నిశ్చలంగా కూర్చుండిపోయింది. ఇద్దరి ప్రసంగాలూవింది. బాబా ప్రసంగం వింటున్నంతసేపూ ఆమె కళ్ళు కన్నీళ్లు ఒలికాయి. ఆయన ప్రసంగం వింటున్నంతసేపూ తను ఏడుస్తున్నాననే స్పృహలేదు. ప్రసంగం ముగిసిన తక్షణం కనీస జాగ్రత్తలుసైతం గాలికి వదిలేసి రేడియో తిప్పి గంగానగర్ హవేలీకి ట్యూన్‌చేసింది. పాకిస్థాన్ ఆటగాళ్ళను క్షేమంగా, గౌరవంగా ఢిల్లీకి తీసుకురమ్మని ఆదేశించింది. వెంటనే ఉరికెత్తి బాబాని కలవాలని మనసు తొందరించింది. కాని కదలలేకపోయింది. బాబా వెంటనే వెళ్ళిపోయివుంటారు. ఎవరి తోడూ లేకుండా, ఏ ఆర్భాటమూ లేకుండా వచ్చినట్టే తిరిగి వెళ్ళిపోయివుంటారు. బాబాని తిరిగి కలుసుకోలేకపోయాననే అనే బాధ గుండెని పిండేసింది. మరుక్షణం ఆమె మొహంలో చిరునవ్వు పూసింది. అది ఆమెకి తెలీదు. గదిలో ఎవరి ఆకారమో నడయాడినట్లు, ఎవరిదో చల్లని చెయ్యి తన తలని తాకినట్టు అనుభూతి కలిగింది. ఆమె మనస్సులో శాంతి నిండింది. ఆమె పెదవులు కదిలాయి.

"మిత్రే ప్యారే నూ న్ హా ల్ మురిదాం దాకెహణా...."

గదంతా భక్తుల్తో నిండిపోయిందని ఆమెకి తెలీదు. ఆమె ఏదో పారవశ్యంలో తలమున్కలైంది. కళ్ళు విప్పి చూసింది. గదిలో, గదిబైటా ఎందరో భక్తులు ... ఆమె కళవళపడింది. గదంతా కలయజూసింది. ఎదురుగా పూలరాశి. లేచి దోసిలినిండా పూలు తీసుకుని గదిలో అందరికీ పంచిపెట్టింది. బాబా బుడ్డా అక్కడున్నట్లుగా, ఆయన పనుపున శాంతిని, ప్రేమని పంచిపెడుతున్నట్లుగా అనిపించింది. ఔను...శాంతిని, ప్రేమని పంచి పెట్టమని గురువులు బాబా బుడ్డాని స్వర్ణమందిరానికి పంపించారు! ★

## సిక్కు సాహిత్యంలో దొర్లే కొన్ని పడికట్టు పదాలకు అర్థ, భావ వివరణ

అకాలీదళ్ ఖాల్సా : సిక్కు తీవ్రవాదుల బృందం.

ఖాల్సా : కత్తితో చిలికిన అమృతజలంతో పరిశుద్ధులయినవాళ్లు. 1699లో ఖాల్సా స్థాపన జరిగింది. మొఘలులకు వ్యతిరేకంగా గురు గోవింద్‌సింగ్ కాలంలో సిక్కులు సైనికశక్తిగా సంఘటితపడి 'ఖాల్సా'గా మారారు.

బందా బహాదుర్ : కడపటి మొఘల్ చక్రవర్తుల కాలంలో సామ్రాజ్యాన్ని చీకాకుపర్చి సిక్కు మతధర్మంకోసం, స్వతంత్ర సిక్కు రాజ్య స్థాపనకోసం వీరమరణం పొందిన సిక్కు సేనాని.

హర్ మందిర్ : స్వర్ణదేవాలయం–దర్బార్ సాహిబ్ అని కూడా అంటారు.
కడాప్రసాద్ : రవ్వ, పంచదార కలిపిన పొడి ప్రసాదం
జత్తేదార్ : సిక్కుల్లో గ్రూపు నాయకులు

| | |
|---|---|
| వాహే గురూ జీ కా ఖాల్సా<br>వాహే గురూ జీ కా ఫతే | ఖాల్సా భగవంతునిది;<br>విజయం భగవంతునిది. |
| జో బోలే సో నిహాల్<br>సత్ శ్రీ అకాల్ | భగవంతుడు సత్యమని పలికేవానికి<br>అలౌకిక సుఖం కలుగుతుంది. |

పంథ్ : సిక్కు సమాజంయొక్క సమిష్టి సంకల్ప శక్తి.
సంగత్ : సిక్కు సంఘం.

| | |
|---|---|
| మిత్రే ప్యారే నూన్ హాల్ మురీదా దా కెహ్ణా | గురుగోవింద్‌సింగ్ జీ మొఘలులతో జరిపిన ఒక పోరాటం తర్వాత తన స్థితిని భగవంతునికి ఎరుకపరుస్తూ వాయుదూత ద్వారా పంపిన సందేశగీతం. |

గురుగ్రంథ సాహిబ్ : సిక్కుల పవిత్ర మతగ్రంథం.
మోర్చా : ఉద్యమం
ఆపా : అక్క
అకాల్ తఖ్త్ : అమర సింహాసనం. స్వర్ణదేవాలయం పక్కనే ఉంది. ప్రస్తుతం సిక్కుల అత్యున్నత మతాధికారానికి చిహ్నం. ప్రాచీన సిక్కు వీరులుపయోగించిన ఆయుధాల్ని ఇక్కడ ప్రతి సాయంత్రం ప్రదర్శిస్తారు.
బాబా బుడ్డా : గురునానక్‌జీ కాలంనుంచి గురుపరంపరలో ఆరవ గురు వయిన గురు హర్‌గోవింద్ కాలంవరకు జీవించిన శతాధిక వృద్ధుడు, సిక్కుయోగి. రామ్‌దాస్ గ్రామ వాస్తవ్యుడు.
ఖురాసాన్ ఖసమ్మానా కియా : బాబర్ ఖురాసాన్ నుంచి భారతదేశం పైకి దండెత్తినపుడు గురునానక్‌జీ రచించిన గీతం.
మస్సా రంగడ్ : మొఘల్ అధికారి. హర్‌మందిర్‌లో తిష్టవేసి ముండలతో, తాగుడుతో పొద్దుబుచ్చుతూ పవిత్రస్థలాన్ని మైలపర్చిన దుష్టుడు.
మాయ్ భాగో: గురుగోవింద్‌సింగ్‌ని కనిపెట్టుకునివున్న భక్తురాలు,ధీరమహిళ.
గంగూ: ద్రోహానికి మారుపేరు. గురుగోవింద్‌సింగ్‌జీ వంటబ్రాహ్మడు. డబ్బు కక్కుర్తితో గురుగోవింద్‌సింగ్ బిడ్డల మరణానికి కారకుడైనవాడు.
లంగర్ : గురుద్వారాలలో ఉచిత భోజనశాల. కుల, మత విచక్షణలేకుండా అందరూ సహపంక్తి భోజనం చేస్తారు.

# బ్రతుకు తెరువులు...

బ్రతుకు తెరువులు బహురకాలు. తన పూర్వీకులైన వానరుల్ని పట్టి ఆడించి బ్రతుకు కొనసాగించే వారి నుండి అంతకన్నా ఆదిరూపమైన మత్స్యాలను సేకరించి జీవికను వెళ్లబుచ్చే వారిదాకా ఎందరెందరో...

ఎన్నెన్ని వృత్తులో....?

ఫొటోలు: సూరజ్ యస్. శర్మ, బ్రహ్మదేవ్, యచ్. ఆర్. గ్రోవర్, సుధీర్‌బాబ్జి



# పర్సు

ఎక్స్‌ప్రెస్ బయలుదేరటానికి సిద్ధంగా వుంది ప్లాట్‌ఫారమ్ మీద. శ్రీధర్ తన సీట్లో కూర్చుని ఓసారి చుట్టూ కలయజూశాడు. తన పక్క ఓ సర్దార్జీ, ఆయన పక్క ఓ ముసలావిడా ఉన్నారు. ముసలావిడ అప్పుడే సన్నగా కునికిపాట్లు పడుతోంది. ఎదురుగుండా ఉన్న ఓ కొత్త జంట ఈ లోకంలో లేరు. వాళ్ల పక్క సీటు మాత్రం ఖాళీగా ఉంది.



గార్డ్ విజిల్ ఊదాడు. 'మళ్ళీ రేపు కలుద్దాం' అన్నట్లు రైలు ఓ కేక వేసింది. సరిగ్గా ఆ సమయంలో ఎవరో తోసినట్లు రైల్లోకొచ్చిపడిందా అమ్మాయి.

ఆమెనుంచి ర ప్ప తి ప్పు కో లే క పోయాడు శ్రీధర్. చామన ఛాయ, కోటేరులాంటి ముక్కు, చక్కటి పలువరస, రెండు జడలు, ఆకుపచ్చ పరికిణీ అదేరంగు జాకెట్టు, ముఖాన దోసగింజంత బొట్టు. పదిహేడుకు మించదు వయసు.

'మార్వలెస్!' అనుకోకుండా ఉండలేకపోయాడు శ్రీధర్.

"ఆ పర్సు జాగ్రత్త అమ్మాయ్! ఒకటి రెండు కాదు 'యిరవై వేలు'. వెళ్ళగానే ఉత్తరం రాయించు అక్కయ్యచేత" కిటికీ నుండి చెయ్యి ఊపుతూ పదే పదే చెప్పాడు ఓ ముసలాయన.

"అలాగే మామయ్యా! నువ్వేం ఖంగారుపడకు. ఉంటాను. వచ్చేనెల్లో అత్తయ్యను పంపించడం మరువవద్దు" సమాధానం చెబుతూ తాను కూడా చెయ్యి ఊపింది మందహాసంతో!

వాళ్ళతో పనిలేనట్లు రైలు పరుగు ప్రారంభించింది తన గమ్యంవైపు.

శ్రీధర్ ఎదురుగానే ఆ కొత్త జంట పక్క కూలబడిందాఅమ్మాయి. ఆవిడ

చేతిలోని పర్సువంకే చూస్తూ "మీరెక్కడి దాకా వెళ్ళాలి?" అని పలకరించాడు శ్రీదర్.

అతడివంకోసారి అనుమానంగా చూసి 'విజయవాడ' అంది.

పర్సును ఓసారి గుండెలకదుముకుంది ఆమె. రైలు సికింద్రాబాద్ చేరింది. "కాఫీ తాగుతారా?" అన్నాడు శ్రీధర్ ఆమెతో.

"అబ్బే... అక్కర్లేదు. ఏమీఅనుకోకపోతే ఏదైనా ఓ మాగజైన్ తెచ్చివ్వండి" డబ్బుల కోసం పర్సు తెరుస్తూ అంది ఆమె. పర్సులోని వందరూపాయల కట్టలు పనిగట్టుకుని చూసిన శ్రీధర్‌కి ఎలానో వుంది. ఆ డబ్బే కనుక తనవద్ద వుంటేనా? కానీ పొరబాటున పట్టుబడితే జైల్లో ఊచలు లెక్కించాల్సి వస్తుంది.

ఆమె అందించిన ఐదు రూపాయల్తో రెండు వీక్లీలు, ఓ అరడజను అరటి పళ్లు తెచ్చిచ్చాడు. "చాలా థాంక్సండీ" చిన్నగా నవ్వుతూ అంది ఆమె.

రైలు పరుగు ప్రారంభించింది. ఒక్కరొక్కరే నిద్రలోకి జారుకోసాగారు. ఆమె మాత్రం సీరియస్‌గా వీక్లీలు చదివేస్తోంది.

ఈమె పడుకోదా? మరి తన పనెలా? శ్రీధర్ బుర్ర వేడెక్కిపోతోంది. తన బెర్త్‌లో బెడ్డింగ్ పర్చి ఎయిర్ పిల్లోలో గాలి వూది తలవైపు పెట్టాడు. ఆమెకేసి క్రీగంట చూశాడు. నిద్ర బలవంతాన ఆపుకొంటున్నట్లుంది.

సిగరెట్ వెలిగించి టాయిలెట్‌కెళ్ళాడు శ్రీధర్. తిరిగి వచ్చేసరికి ఆమె కూడా పడక వేసేసింది. నిద్రపోతోంది. 'ఇదే మంచి సమయం' అని అతడి మనసు తొందర పెడుతోంది. నీలం బల్బువెలుగు మసకమసగ్గా ఉంది. చిన్నగా లేచి తనపని ప్రారంభించాడు. తలకింద పర్సు లేదు. మరి ఏమైందా పర్సు? ఇంతలో ఎలా మాయమవుతుంది? జాకెట్లో పట్టేంత చిన్న పర్సు కూడా కాదు. బుర్ర వేడెక్కిపోతోంది. గబగబా సీట్ కిందా, చెప్పులకింద, ఆమె చేతి సంచీలో వెతికాడు. ఎక్కడా పర్సు జాడలేదు. ఏమిటీ మిస్టరీ? పళ్ళుకొరుకుతూ తన బెర్త్‌మీద మేనువాల్చాడు శ్రీధర్.

ప్లాట్‌ఫామ్ మీద కేకల్తో మెలకువ వచ్చిందతడికి. రైలు విజయవాడవచ్చేసింది. ఆమె వంక చూశాడు. పడుకునే ఓసారి కళ్ళు తెరిచింది. "లేవండి! విజయవాడ వచ్చేసింది" అన్నాడు నిరాశగా!

"అరే! అప్పుడే విజయవాడ వచ్చేసిందా?" వీక్లీలు మడిచి బ్యాగులో పెట్టుకుంటూ—"వసానండీ" అంది.

"మీ చేతిలో ఏదో పర్సు ఉండాలి?" ఆత్రుతగా అడిగాడు శ్రీధర్.

"ఓహ్! సమయానికి గుర్తుచేశారు" అంటూ హడావిడిగా శ్రీధర్ తలగడ కిందనుండి తనపర్సు తీసుకొంటూ అంది ఆమె "థాంక్సండీ! రాత్రంతా దీన్ని కాపాడినందుకు"

శ్రీధర్ ముఖం పాలిపోయింది. సోనీ

## స్కూటర్ లోను

చాలాకాలం నుంచీ అప్పారావు ఎదురు చూస్తున్న స్కూటర్ లోను శాంక్షను

## కతలు

అయింది ఆఫీసులో.

ఆమాట తెలియగానే ఎగిరి గంతు వేయలేదుగాని అంతపనీ చేసేడు అప్పారావు. ఒకటా...రెండా... అయిదువేల రూపాయలు. ఒక్కసారే అంత డబ్బు లోనుగా ఇచ్చి మేనేజిమెంటువారు 'వాహన సౌకర్యం చేసుకోవోయ్ అప్పారావూ' అని భుజం తట్టి, చేతుల్లో ఆ డబ్బు పెట్టి దాంతోపాటుగానే మర్లో కాయితం కూడా వుంచేరు. 'ఫలానా శ్రీ అప్పారావుగారూ ! మీరు కోరిన స్కూటర్ లోను ఎలాగయితేం యిచ్చేం గనక వెంటనే అదేదో కొనుక్కుని, ఆ సంబంధించిన లైసన్సూ, సీబుక్కూ వగైరాలన్నింటినీ మరో నెల రోజుల్లోపల మాకు అందీయవలసింది' అని ఆ కాయితం లోని సారాంశం.

అప్పారావు ఆ సాయంత్రం నుంచి ఆ ప్రయత్నాల్లోనే వుంటానుగాక ఉంటానని మేనేజిమెంటువార్కి గట్టిగా హామీనిచ్చి ఆ మరుసటినాటినుంచే యిక ఆ కొనుగోలు విషయాన్ని కావాలనే మర్చిపోయేడు. అయితే నెల్లాళ్ళలోగా అవేవో సీబుక్కు వగైరాలు యివ్వాలిగనక తనకు తెలిసిన ఓ బ్రోకర్ని పట్టుకుని ఏడెనిమిదొందలు వదిలించుకుని ఎవరిదో స్కూటరు సి.బుక్కూ, తనపేర్న కొన్నట్లుగా కాయితాలు సంపాదించి వాటి నకళ్ళను దాఖలా చేసేడు.

వ్యవహారం యింతటితో తేలిపోయి మేనేజిమెంటువారు వూరుకున్నారుగదాని అప్పారావు కూడా ఊరుకున్నాడు. పైగా రోజూ ఆఫీసుకు అంతంత పెట్రోలు తగలేసి రావడం ఎందుకులే అని అందరితో చెప్తూ మామూలుగానే నెంబర్ లెవెన్ (అంటే రెండు కాళ్ళతోనూ) మీద రాకపోకలు జరపసాగేడు.

అయితే అసలు కథ ఇక్కడి నుంచే ప్రారంభమయిందని పాపం అప్పారావు గ్రహించలేదు.

ఆరోజు అప్పారావు సాయంత్రమే భార్యతో ఏదో ఊరు అర్జంట్‌గా వెళ్ళాల్సి వచ్చిందని చెప్పి బయల్దేరి వెళ్ళిపోయాడు. తన స్కూటర్ లోనుగానీ, ఆ వ్యవహారం గానీ శ్రీమతితో పల్లెత్తు మాటైనా అన్లేదు. అంచేత ఆవిడకి ఈ సంగతేమీ తెలీదు.

మరునాడు మామూలుగానే అప్పారావు ఆఫీసులో యమ అర్జంటుగా ఆఫీసు పని దంచేస్తుండగా పై ఆఫీసరు నుంచి అర్జంట్ పిలుపొకటి అందింది ప్యూన్ ద్వారా. పెద్దవాడు అర్జంటంటే యమర్జంటుగా వెళ్ళకపోతే బాగోదని సూపర్ అర్జంట్‌గా వెళ్ళి ఆఫీసరు కేబిన్‌లో చొరబడి ఎదురుగా వున్నవాళ్ళను చూసి నిర్ఘాంతపోయాడు అప్పారావు.

ఆఫీసరు ఎదురుగా కూర్చుని మనవాడికేసి గుర్రుగాచూస్తున్నారో యిద్దరుపోలీస్ జవానులు. అందులో ఒకరిచేతుల్లో అప్పారావు అరెస్టు వారంట్ వుంది. ఆ విషయమే ఆఫీసరు చిరునవ్వుతూ చెప్పేడు.

అప్పారావు ఒళ్ళంతా చెమటలు పోసేసింది.

"ఏం...ఎందుకూ?" అనిమాత్రం అనగల్గేడు చివరకు.

"ఎందుకేమిటి సార్! ఏమీ తెలీనట్లు నటిస్తారు? నిన్న అర్ధరాత్రి పన్నెండు గంటలకు పట్టణ పొలిమేరల్లోని పదమూడో మైలురాయి దగ్గర ఓ మనిషిని ఢీకొని, తొక్కేసి, చంపేసిందిగాక,, ఆ స్కూటరును అక్కడే వదిలేసవచ్చేస్తే




మేం ఎవళ్ళమూ మీసంగతి తెల్సుకోలేం అనుకున్నారా?... మా పోలీసువాళ్ళకు వెయ్యికళ్ళండీ....ఖబడ్దార్"

అంటూ హూంకరించేడు అందులో బుర్రమీసాలున్న పోలీసు ఒకాయన.

అంతే! అప్పారావుకు కళ్లు బైర్లుకమ్మినాయి.

"ఆర్టీవో ఆఫీసులో ఆ వదిలేసిన స్కూటరెవళ్ళ పేర్న వుందీ కనుక్కొని యిలావొచ్చేమండీ! మీవాణ్ణిలా అరెస్టు చేసి పట్టుకొని పోతున్నందుకు వెరీ... వెరీ... సారీ అండీ.."

అంటూ లేచి అప్పారావు చేతులకి అరదండాలు తగిలిస్తున్న విషయం పాపం అప్పారావుకేమాత్రమూ గుర్తులేదు.

**-యం. ఉమామహేశ్వరరావు**

## క్షణికం

రత్నాలమ్మ కోపం తారస్థాయినందుకుంది.

'ఆఁ.... ప్రతీరోజు ఉన్నదే కదా' అనుకుంటూ ఊరుకోబోయాడు భర్త ముత్యాలరావు.

"ఉహుఁ... వీల్లేదంటే వీల్లేదు! ఈ దిక్కుమాలిన కొంపలో ఒక్కరోజు కాదు కదా... ఒక్క క్షణంకూడా ఉండలేను.. ఉండను! అసలా పార్వతమ్మ మొహం చూడ్డమే అసహ్యంగావుంది. దాని సొంత కొంపలా రోజు సాధింపులు... ఇదీనూ!! ఛీ... ఛీఁ.... మీరుకూడా అంతే! ఇంటి విషయం ఒక్కటికూడా పట్టించుకోరుకదా! రేపీకొంప మార్చకపోతే నేనే ఏ నుయ్యో గొయ్యో చూసుకుంటా. ఆఁ...." రత్నాలమ్మ పెద్ద గొంతుకతో భర్తకి అల్టిమేటమ్ ఇచ్చేసింది.

ఆ మాటలేం ముత్యాలరావుకి కొత్త కాదు. ఉదయం లేచింది మొదలు సాయంత్రం వరకు వీధి కుళాయిదగ్గర జరిగిన వీరపోరాటాలు మొదలు...పార్లమెంటులో జరిగిన ముష్టియుద్ధం వరకు ఏకాఏకిన గుక్కతిప్పుకోకుండా రిపోర్టు యిస్తూంటుంది.

కనుక ఆరోజు జరిగిన కదంబ కార్యక్రమం ఏమిటో సవివరంగా వినాలనిపించింది ముత్యాలరావుకి.



"ఇంతకీ ఇవ్వాళేం జరిగింది?" కుతుహలంగా అడిగాడు.

"ఇంట్లో పెళ్ళాం ఏ అవస్థలు పడు తున్నదో అన్న ఆలోచన వుండదు. ఆ పొగరుగిత్త పార్వతమ్మ ఎన్నెన్ని మాట లందో మీకేం తెల్సు? దానిమాట కాదన కూడదట. దాని వాటావైపు బట్టలారవేయ కూడదట. మనం ఆ వాటావైపు తిరగ కూడదట. కరెంటు ఎక్కువగా కాల్చి తినేస్తున్నాంట. ఛీ...ఛీ...ఛీ... డబ్బి ఇస్తున్నా సరే. అద్దె ఇంట్లో ముష్టిబతుకయి పోయింది"

"ఇంతకీ యిప్పుడేం అంటావు?" ముత్యాలరావు మధ్యలోనే ఆపి అడిగేడు.

"ఏవంటాను—ఆరు మూడైనా, మూడు ఆరైనా సరే రేప్పొద్దున్న సామాను బండి కెక్కించవల్సిందే. ఆ తర్వాతే ఇల్లు వెతు క్కుందాం. లేకపోతే ఏ చెట్టు కిందో ఉందాం! అంతేకాని ఈ దిక్కుమాలిన కొంపలో ఛస్తే ఒక్క క్షణం ఉండను.ఆఁ.." అంటూ రత్నాలమ్మ ముక్కు చీదింది.

"చూడు రత్నం! తలవగానే తాతకి పెళ్ళంటే ఎలా అవుతుంది చెప్పు ? ఓ మంచి ఇల్లు చూసి త్వరలోనే ఈ ఇల్లు ఖాళీ చేసేద్దాంలే" భార్యని సమాధాన పరిచే ప్రయత్నాలుచేసేడు ముత్యాల్రావు.

"వీల్లేదు. ఎన్నాళ్ళిలా వెధవ బతుకు బానిసబతుకు బతకటం. మీకు చేతకాక పోతే చెప్పండి. నేనేచూస్తాను. నామాటకు తిరుగులేదు" రత్నాలమ్మ గట్టిగా హెచ్చ రించింది.

ముత్యాలరావుకి తప్పింది కాదు. "అలాగేలే .. రేప్పొద్దున చూద్దాం..." అంటూ నడుంవాల్చేడు.

రత్నాలమ్మ విజయగర్వంతో నిద్రకు ఉపక్రమించేముందు మరోసారి పార్వ తమ్మ వాటాలోకి వినపడేలా ఓ డజను తిట్లూ, శాపనార్థాలూ వదిలింది.

* * *

"చూడండొదినగారూ ! నేను మీకో గిన్నెడు కాఫీపొడుం ఇవ్వాలి..గుర్తుందా! రాత్రి తెచ్చారు లెండిఆయన...ఇదండి" అంటూ పార్వతమ్మ ఉదయాన్నే వస్తూ రత్నాలమ్మను పలకరించింది.

"దానికేముంది లెండి. అన్నట్టు ఈ మాట విన్నారా ... నిన్న బ్యాంకీవాళ్ళ ఇంట్లో దెబ్బలాడుకున్నారుట. ఒహటే అరుపులు, కేకలు. ఛీ... ఛీ... ఎంత అసహ్యం. నలుగురు వింటారనే సిగ్గు, లజ్జ లేకుండా ఆ దెబ్బలాటలేమిటి చెప్పు దురూ! అయినా వాళ్ళ మాటలు మన కెందుగ్గాని నిన్ననే అడుగుదామను కున్నాను. దిక్కుమాలిన మతిమరుపు ఈమధ్య మరీ ఎక్కువైపోతోంది. ఓ గ్లాసుడు కందిపప్పుంటే పంపుదురూ... ఇంట్లో బొత్తిగా నిండుకున్నది" అంటూ రత్నాలమ్మ హుషారుగా కబుర్లు చెప్ప సాగింది. "సర్లెండి. దానికేంగాని అలం కార్‌లోకి 'అడవిరాముడు' మళ్ళీ వచ్చిం దట. మాట్నీకెళ్దాం రడీగా ఉండండి. ఇంట్లో పని ఎక్కడిది అక్కడే వుంది. వెళ్ళొస్తా" అంటూనే పార్వతమ్మ అటు చూసి "ఏవండోయ్...అన్నయ్యగారూ! ఇప్పుడే లేస్తున్నారా ... మేం సినిమా కెళ్తాం సరేనా ?" అని ముత్యాలరావుని పలకరించి వెళ్ళిపోయింది.

తెల్లమొహం వేసి భార్యనూ, సదరు పార్వతమ్మనూ అలాగే చూస్తూ ఉండి పోయాడు ముత్యాలరావు.

—జయంతి ప్రకాశశర్మ

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications
Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly
Eenadu Compound, Hyderabad - 500 004.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004, Regd.No. H/HD/402

మధురమైన రుచులన్నీ ప్రియలోనే వున్నయ్!




మీరు కోరుకొనే రకరకాల పచ్చళ్ళు మీ కందిస్తుంది-ప్రియ. మరపురాని రుచిరానుభూతులతో రూపొందినవే ప్రియ పచ్చళ్ళు. ఈనాడే మీ ప్రియను మీ ఇంటికి తీసుకు వెళ్ళండి.

ప్రియ ఫుడ్స్
ప్రైవేట్ లిమిటెడ్

Marketed by:
MARGADARSI MARKETING
PRIVATE LIMITED

ఎంతో రుచి... ఎంతో రుచి... - ప్రియ

Kiron/PF/833